ANTIMA KSHANALALO AKBAR

By

G. Anjaneyulu



*First Edition*

February 80

*Cover Design*

TRIGUN

*Publishers*

Navaratna Book Centre

Eluru Road, Vijayawada-2

*Printers*

Grama Swarajya

Vijayawada-2

*PRICE*

*Rs. 11-00*

# అంతిమ క్షణాలలో అక్బర్

Plenty of romours in the capital that the kings illness was caused by some poison administered to him in some mysterious form. Even Fr. Xavier believed them and mentioned them in his letter. The alligation that Salim or some one on his behalf had done it gained credence from the fact that the Prince had ardently desired his father's death.

Akbar Part II Page 368
By J. M. Shelot

"మానసింగ్ మహారాజా !"

దీనవదనంతో తలయెత్తి చూచాడు రాజా మానసింగ్.

"మిమ్మల్ని ఈ విధంగా చూడటం నాకు చాలా బాధాకరంగా ఉన్నది. కాని ఏం చేయను?" కుటిలత్వాన్ని మాటు పెట్టిన చిఱునవ్వుతో అన్నాడు సలీమ్.

మానసింగ్ నరనరంలో క్రోధం ప్రజ్వలించింది. కాని అతడు బాదీ, మాట్లాడక ఊరుకున్నాడు.

"తమమీద నాకున్న గౌరవ భావాన్ని కూడ తామెరుగుదురు. ఆ గౌరవమే లేకపోతే తాముకూడ అబుల్ ఫజల్ పోయిన త్రోవనే పోయి ఉండేవారు!" సలీముముఖాన మరల ఆదే చిఱునవ్వు దోబూచులాడింది.

"పాపంఅబుల్ ఫజల్ గొప్పవాడే. కాదనను నామీద పాదుషావారి కోపాని కంతటికి అతనే కారణమంటే మీరు కాదనలేరు. కాని సలీమ్‌కు ఎదురునిలచినవాడి కెప్పటికైనా అదేగతి తప్పదనే సత్యం తెలిసికొన్నారు" కొనకనులనుండి కృత్రిమపు చూపొకటి మానసెంగ్ అవయవాలను దూసి కొనిపోయింది.

తనకు కూడ మరణశిక్ష తప్పదనే నిర్ణయానికి వచ్చాడు. మానసింగ్ రాజపుత్రగౌరవమర్యాదలు, ఆచార సంప్రదాయాలు, మత, అభిమానాలు వదిలి ఈ పాదుషాలను కొల్చినదానికి తగిన గౌరవము తనకు కీడు జరుగబోతున్నది. ఎప్పటికైనా తప్పని మరణం కొఱకు భయం దేనికి అంటూ క్రుద్ధనాగముగా అభిమానం తల మెత్తింది.

"ఇప్పుడు నా అపరాధ మేమిటి యువరాజా?" తీవ్రంగానే అన్నాడు మానసింగ్,

"మమ్మల్ని పాదుషాగా మీరింకా గుర్తించ లేదన్న

విషయం ఇప్పుడే తెలిసికొన్నాం మహారాజా!" హేళనగా అన్నాడు సలీమ్.

"అక్బరు పాదుషా జీవించి ఉన్నంతకాలం తమరు యువరాజులే !"

"మీ పాదుషా చెరలో మగ్గుతున్నాడు మానసింగ్! ఇప్పుడు పాదుషా సలీమ్ అని మీరు గుర్తు చేసికొనడం మీకూ మంచిది" కోపంగానే అన్నాడు సలీమ్.

"మరణదండన విధిస్తామని భయ పెడుతున్నారా యువరాజా ! ఈ మానసింగ్ మరణించిన మరునాడు సర్వ రాజపుత్రలోకం మీ అంతాన్ని చూడడానికి సిద్ధమౌతుంది, రాజ పుత్రలోకంలో పౌరుషమింకా చావలేదు." అతని కంఠస్వరం కోపంతో వణకిపోయింది. ఆ కోపానికి బదులుగా పకపక నవ్వాడు సలీమ్.

"మానసింగ్ ! ఇంకా మీలో పౌరుషమనేది ఉన్నదా ? అక్బరు పాదుషాకు ఆడబిడ్డలను అప్పగించిన నాడే మీ పౌరుషం, అభిమానం మంటగలిసి పోయిందనే సత్యాన్నెందుకు మరచిపోయి ఆత్మవంచన చేసికుంటు న్నారో అర్థం కావటం లేదు"

సిగ్గుతో తల వంచుకున్నాడు మానసింగ్. ఈ మాట లకు అతనివద్ద జవాబులేదు.

"పౌరుషం, అభిమానం, ఆత్మస్థైర్యం, ధర్మదీక్ష కల్గిన రాజపుత్రులంటే మీరు కాదు మానసింగ్. ఆ గౌర

వాలన్నీ తెలిసినవారు రాణాప్రతాప్ ఒక్కడే! మీరంతా ఆడంబరమైన రాజ్య సౌఖ్యాలకోసం స్త్రీలను పణంగాపెట్టిన క్షుద్రమనస్కులు. మాతండ్రి మతసహనం పేరున ఆడిన నాటకానికి క్రొక్కుతాళం వేసి అతనిలోని కామపిపాసను స్త్రీలనిచ్చి చల్లార్చి ప్రతిఫలంగా బిరుదులు, ధనం, భోగాలు కో కొల్లలుగా అనుభవించారు. మీకు కావలసినదేదో ఆ ఘనత వహించిన పాదుషాకు తెలుసు. ఆయనకు కావలసినదేదో మీరు పూర్తిగా యెరుగనిమూఢులు" అసహ్యంతో అన్నాడా మాటలు సలీమ్.

ఎఱ్ఱగా కాల్చిన ఇనుపముక్కలతో తన శరీరాన్ని కాల్చినట్లు బాధపడ్డాడు మానసింగ్.

"ఈ తీవ్రమైన మాటలతో మరణ యాతన కల్పించే కంటే మా తల తీసివేయించండి యువరాజా!"

"మీ మీద మా గౌరవంతగ్గిపోయిందని మీరేమీ బాధపడవద్దు మహారాజా! మీరు నా తల్లికి బంధువులు. మీకు మా అక్బరు పాదుషామీద నున్న అభిమానం నశించి పోవలె. అదే అభిమానం మాపై కలిగిననాడు తమ స్థానానికి గౌరవానికి లోటురాదు" అన్నాడు సలీమ్.

మానసింగ్ ఆశ్చర్యం పొందాడు. ఆలోచనలో పడ్డాడు.

"తండ్రి బ్రతికి ఉండగానే కుమారుడు పాదుషా కావడం మహాపరాధమంటారు మీరు. కాని పాదుషా కావలసిన

తండ్రి ఉండగానే అతని కుమారుణ్ని పాదుషా చేయబూనిన అక్బరు పాదుషాను అతనికి అండగా నిలచిన మిమ్మల్ని నిరపరాధులుగా చూడమంటారా?" సూటిగా ప్రశ్న వేశాడు సలీమ్.

"నేను అపరాధిగా ఒప్పుకుంటున్నాను, కాని పాదుషా వారి ఆజ్ఞ ననుసరించి ప్రవర్తించాను." మానసింగు అన్నాడు.

"సామ్రాజ్యానికి వారసుడైన పెద్దకుమారుడు జీవించి ఉండగానే మరొకరికి రాజ్యాన్ని సంక్రమింప జేస్తాననడం న్యాయ సమ్మతమా?" సలీం అన్నాడు.

"అతడు తమ కుమారుడే గదా?" మానసింగ్ అడిగాడు.

"నా కుమారుడే కానీ మరెవరయినా కానీ అది న్యాయమని మీరు మీ భగవంతుని సాక్షిగా చెప్తారా? అతడు మీకు మేనల్లుడనే భావన వదిలివేయుండి. పూర్తి న్యాయాన్ని ఆలోచించి నాకు జవాబు చెప్పండి తమరు" ఆవేదనలో అన్నాడు సలీం.

ఒక్క క్షణం ఆగాడు మానసింగ్.

"అపరాధాన్ని ఒప్పుకుంటున్నాను. దానికి తగినశిక్ష అనుభవించటానికి సిద్ధంగా కూడ ఉన్నాను. కాని మీ స్థానంలో అక్బరు పాదుషా ఉంటే నా రాజభక్తికి బహుమతి లభించేది. ఆ స్థానంలో మీరున్నందువల్ల రాజద్రో

హింగా శిక్ష లభిస్తున్నది. న్యాయాన్యాయాలకు కల భేద మింతే యువరాజా!" విషాదంగా అన్నాడు మానసింగ్.

"ఇప్పుడు స్థానాస్థానాలతో పనిలేదు. అక్బరు పాదుషా చేసింది న్యాయమేనని మీరు హృదయపూర్వకంగా చెప్పండి మహారాజా! మీకది రాజాజ్ఞగాగాక న్యాయంగానే తోచి ఉంటే చెప్పండి. నాది అన్యాయమైతే ఈ సింహాసనాన్ని వదలి ఈ క్షణంలో వెళ్ళిపోతాను. న్యాయదేవతల యెదుట మీరు మాట్లాడండి. ధర్మాన్ని లోభమోహాలను వదలి పల్కండి" ఉద్రిక్తంగా అన్నాడు సలీమ్.

అతనికేమని సమాధానం చెప్పగలడు మానసింగ్? తన తండ్రి రాజ్యానికి తానే విధంగా వారసుడైనాడో ఆ విధంగానే తనకు వారసుడుగాడా తన కుమారుడు.

"ఈ విషయంలో ధర్మం చెప్పాలంటే అక్బరుపాదుషాను నేను సమర్థించలేను కాని నా ధర్మాన్ని విధిని నిర్వర్తించాను" తనను తాను సమర్థించుకున్నాడు మానసింగ్.

"మీ విధి నిర్వహణ అన్యాయానికి అధర్మానికి పోషించేసింది మహారాజా! అదికూడ మీరు చేసిన అపరాధం క్రింద కేవస్తుంది ఇందులో మీ కేమీ స్వార్థం లేదంటారా" అడిగాడు సలీం.

"ఇందు నా స్వార్థమేమిటి యువరాజా?"

"చిన్నవాడు పాదుషా అయితే రాజ్యపాలన అంతా మీ చేతిలోనికే వస్తుందికదా మహారాజా! అందువలననే

నా కుమారుణ్ని పాదుషా చేయడాన్ని మీరు సమర్థించారు అది కాదంటారా" నవ్వుతూనే అన్నాడు సలీం.

మానసింగ్ తలవంచుకున్నాడు. కాని సలీం ఇంత నెమ్మదిగా ఇన్ని విషయాలు తనతో ఎందుకు చర్చిస్తున్నాడో అతనికి అర్థం కావటేదు.

"నేను అపరాధాన్ని ఒప్పుకుంటున్నాను. తాము కాబోయే పాదుషాలు నేను నా అపరాధానికి తమను క్షమించమని మాత్రం కోరటం లేదు" అభిమానంతో అన్నాడు మానసింగ్.

"నేను మీకు శిక్ష విధించకుండా వదలదలచలేదు కూడ. కాని అన్యాయానికి పాల్పడిన అగ్బరుకు శారీరకమైన శిక్ష, అన్యాయానికి ప్రోదిచేసిన మీకు మానసికమైన శిక్ష విధింప దలచాను."

"నిర్వర్తింపడానికి సిద్ధంగా వున్నాను" వెంటనే అనేశాడు మానసింగ్ ఆలోచనా రహితంగా.

"రాజపుత్రులు మాట తప్పరనే నేను అనుకుంటున్నాను" నవ్వుతూ అన్నాడు సలీం.

"ఈ శరీరంలో ప్రాణాలున్నంతవరకు మాట తప్పటమనేది జరగదు యువరాజా!"

"అగ్బరు పాదుషాకు మేము వేయబోయే శిక్షను తాము అమలు జరుపవలెను మహారాజా! అప్పటికిగాని తాము

మా పై క్రోధం లేని వారని మేము విశ్వసింపలేము" నెమ్మదిగా అన్నాడు సలీం.

నిర్వీణ్ణుడైనాడు మానసింగ్. ఒక క్షణంలో మనస్సు నిగ్రహించుకున్నాడు.

"ఇది అన్యాయమైన నిర్ణయం యువరాజా! తమకు నాకే విధించండి శిక్ష అనుభవిస్తాను. పాదుషాపై శిక్షను నే నమలు చేయుటమా? నేను రాజద్రోహిని కాదలచ లేదు." ఆతృతతో అన్నాడు మానసింగ్.

"రాజపుత్రులైన మీరు అసత్య దోషానికి ఒడిగట్టకండి. కాని మీరు మా తల్లికి జరిగిన అన్యాయాన్ని ఎరుగదురా మహారాజా? మరణసమయంలో మా తల్లి ఆ విషయాన్ని వివరించింది. ఆ నాడే ఈ అక్బరు పాదుషా జీవితం అంతమైయుండేది. కాని ఆ తల్లి నన్ను ఉద్యోగంనుండి మరలించింది. ఆ పాదుషాను తండ్రిగా ఊహించుకోవడమే నాకు ఆనాటినుండి బాధగాయున్నది"

"మార్యమ్-ఇ-జమాని ఏమి చెప్పింది సలీం. కాదు యువరాజా" ఆవేదనతో అడిగాడు మానసింగ్.

"అదే మీరు అగ్బరు పాదుషాను అడగండి. ఈ చివరిదినాలలో నన్నా ఆ విషయం తెల్పమనండి. అందుకై పశ్చాత్తాపపడమని కూడ బోధించండి. ఒక్క విషయం ఆలోచించండి. మానసింగ్, మా తండ్రి జరిపించిన ఇన్ని యుద్ధాలకు కారణమేమిటి? కాంతా కనకాలకు సంబంధించిన వేమైనా అసలు ఉన్నవా?"

దీర్ఘాలోచనలో పడ్డా మానసింగ్ తాను నడిపిన యుద్ధాలు జ్ఞప్తికి వచ్చినాయి, మీరాబాయి, దుర్గావతి, జయరాణి. ఏ యుద్ధం స్త్రీతో సంబంధంలేనిది? అక్బరు ఇంత కామ పిపాస కలిగినవాడా? మనుష్యరక్తం రుచిమరిగిన పులి వంటివాడా?

"దీర్ఘాలోచనలో పడ్డారు తాము" అన్నాడు నవ్వుతూ సలీం.

"నా కన్నులు ఇప్పుడే తెరుచుకుంటున్నాయ్ యువరాజా రాజభక్తి పేరిట కప్పిన ఆదర్శపు పొరలు ఇప్పుడిప్పుడే ఊడిపోతున్నాయ్ తాము విధించే శిక్ష వినిపించండి జహాపనా!"

"జహాపనా, అంటే మీ మనసులో కొంత మార్పు గోచరించుతున్నది. కాని శిక్ష అమలు జరిపేముందు మీ కొక్క అవకాశాన్నిస్తున్నాను. మా తల్లి విషయం అక్బరు పాదుషా వారినోట వినండి ఆ తర్వాత శిక్షకు అర్హుడని తోస్తే అమలు చేయండి. శిక్ష అవసరం లేకుంటె తిరిగి వచ్చేయండి"

"ఇదిగో మహారాజా!" అంటూ తన యెదుటనున్న పళ్ళెంపై కప్పబడిన ముఖమల్ గుడ్డను తొలగించాడు సలీమ్.

అందులో మద్యంతోనిండిన పచ్చలపాత్ర వజ్రాలు తాడిన పిడిబాకు కళ్ళేరం బంగారుది.

"ఇవి అక్బరు పాదుషా ఘనతకు సరిపోయిన విలువ కల వస్తు సముదాయము. అది లక్షల విలువ జేసే పచ్చలతో తొలిచిన పానపాత్ర. అది హేమూను జయించినప్పుడు మా తండ్రికి దొరికినది. హేమూ తండ్రి రాజాపురాణమల ఎట్లా చంపబడ్డాడో మీకు తెలుసు తన మతం మార్చుకో ననందుకు హేమూకుమార్తెను తనకు అర్పించనందుకూ ఆ వృద్ధునికి ఈ పాత్రతోటే విషమిచ్చాడు మా తండ్రి. ఆ పాత్ర అందుకే ఇప్పుడుకూడా వినియోగపడుతున్నది. మహారాజా!" ఆగాడు సలీమ్.

"అదిగో ఆ వజ్రాలపిడి బాకు మా తల్లి మార్యమ్ ఇ జమాని మరణానికి కారణభూతమైంది. ఈ భోగలాలసు డైన తన భర్తప్రాణం కొరకు తన ప్రాణాన్ని అర్పించింది నా తల్లి. అగ్బరుపాదుషాను చంపవలసిన ఈపిడిబాకు రాణి దుర్గావతి విసిరినది. అది అడ్డువచ్చిన నా తల్లి ప్రాణాలను తీసింది అదేబాకు. ఇది ఆవీరనారీమతల్లి దుర్గావతి పౌరుష ప్రతాపాలు ఇందులో నిక్షిప్తమై ఉన్నవి. అది ఇప్పుడు వినియోగపడుతున్నది. మానసింగ్? తెల్లవివన్నీ పాలనుకో నేవు! ఆ పచ్చల పాత్రలోని మద్యంకాదు విషం. ఈరెంటిని నేను వ్రాసిన చీటీతో మా తండ్రికి అందచేయి. నీనిర్ణయం కూడ ఆయనకు చెప్పు. అంతవరకే నీపని తర్వాతపని భగవం

తుని అమరావతారమని మీరు నమ్మిన దిన్ ఇలాహీ మత స్థాపకుడు అక్బరు పాదుషా వారు పూర్తిచేస్తారు." విషాద భరితమైన నవ్వునవ్వాడు సలీమ్.

అతనిలో తండ్రిమీద కరడుకట్టిన ద్వేషం చూడ కల్గాడు మానసింగ్.

గంభీరంగా మారిపోయింది సలీమ్ ముఖము.

"మానసింగ్ ! ఇరవదేండ్లక్రితము ఆగ్రానగరము లోని అందమైన యువతుల శవాలు యమునాతరంగాలలో తేలివస్తుంటే రాజధాని నగరమంతా అల్లకల్లోలమైంది జ్ఞాపకమున్నదా ? కామతృప్తి కనికరమే లేకుండా అనుభవించిన స్త్రీనల్లా యమునాజలాలలో త్రోసి వేశారు రహస్యం బయలుపడకుంటుటకై. కాని ఇప్పటి నగరపౌరునిగా నావిధి నేను నిర్వర్తించాను. పాదుషాకు తెలియపరిచాను. నిర్భయంగా ఆ విషయం కూడ నేను చెప్పినట్లు అడగండి మహారాజా!"

మానసింగ్ మనస్సు జుగుప్సతో నిండిపోయింది,

"ఇకవద్దు జహాపనా! తమఆజ్ఞనిర్వర్తిస్తాను" అంటూ బంగారు పళ్ళెరాన్ని అందుకున్నాడు మానసింగ్,

"ఇది అత్యంతరహస్యం బయటపెడితే మీప్రాణాలు మీవి కావు. వెళ్ళరండి" అన్నాడు సలీమ్

పళ్ళెరంతో కారాగారమైన అక్బరు సౌధానికి బయలుదేరాడు మానసింగ్.

సలీమ్ కనుసన్నతో తెలియకుండా అతని ననుసరించాడొక గూఢచారుడు.

# 2

"He (Mansingh) also like Khan Azam is one of the hypocrites and old wolves of this state. What they have done to me what has happened to them from me God, the knower of secrets knows; possibly no one could mention such other case." Salim said.

Jahangir—Tuzuk-i-Jahangir
By Rogers & Beveridge.

ఆది క్రీస్తుశకం 1605 సంవత్సరం అక్టోబరు నెల పదునారవ తేది.

అక్బరు పాదుషా నివసించిన మహాసౌధమది. పరిచారకులతో, మంత్రి సామంతాదులతో, కళకళలాడిన ఆ భవనము నేడు చిన్నబోయి నిమ్మకు నీరెత్తినట్లున్నది. అక్బరు పాదుషా రోగగ్రస్తుడై యున్నాడని ప్రకటింపబడినది. వారి ప్రశాంతతకు భంగము కలుగకుండుటకై ఎల్లరి ప్రవేశములును నియమిత మొనర్పబడినవి. రాజవైద్యు లప్పుడప్పుడటకు వచ్చి పోవుచున్నారు. వారి ముఖములు దీనములై యున్నవి, కాని అవి విచారపూరితములు విషాదసూచకములు కావు. ముందు జాగ్రత్తకొరకై సౌధమును ఐదువందలమంది సిపాయిలు సలీం పాదుషా అంతరంగిక సైన్యము

కాపలా కాయుచున్నది. మహారాణి జియారాణి అంతకు పూర్వమే మరణించినది. రేవారాణి వారెందులకో మరణ శయ్యపైనున్న పాదుషాను చూడరాలేదు. సలీమాసుల్తానా కూడ అటు రాలేదు.

అగ్బరు పాదుషా రోగగ్రస్తుడు కాలేదనియు అతని పెద్ద కుమారుడు సలీం అగ్బరు పాదుషాను నిర్బంధములో నుంచినాడనియు రాజధానీ నగరమున నొక వార్త పుట్టి కార్చిచ్చువలె ఆ సాయం సమయమునకు అంతటా వ్యాపించినది.

పగలు తన జీవితాన్ని పూర్తిచేసి రాత్రి ఒడిలో అలసి నిద్రించింది. రాత్రి విడిచే నిట్టూర్పుల వేడిమికి చల్లగాలులు వేడెక్కి పోతున్నవి. చీకటి కాటుక శరీరాన పులుముకున్న నిశ తారల కాంతుల సహాయంతో కాలాన్ని జరుపుతున్నది.

తెల్లని రాళ్ళతో చెక్కిన శిల్పాల అందాలను ఇతరులు చూడరాదనే ఊహతో నిశి చీకటి తెరను కప్పింది. ఆ మహాసౌధంలో అక్కడక్కడ వెలిగించిన దీపపుకాంతులు చీకటితో ఘోరయుద్ధంచేసి కొంత ప్రదేశాన్ని ఆక్రమించుకున్నవి. కాని వాయుదేవుని సహాయం చీకటికే మొగ్గుగా వుండటంతో వెలుగు ఓటమి నంగీకరించక తప్పటం లేదు.

వెలుగు చూడలేని దివాంధాలు తమ క్రోధాన్ని

కుత్సితపు త్రోవల్లో తీర్చుకొనడానికి రాత్రి సహాయపడితే తెన్ను కానని బికారిపక్షుల దీనాక్రందనాలు కరుణకల హృదయాలను కలతపెడుతున్నవి.

రాజులైనా రారాజులైనా కాలప్రభావానికి లోను గావలసిందే. చీకటి వెలుగుల ప్రభావాల ననుభవించాలి సిందే ననే సత్యాన్ని తెలియజేయుటానికి ప్రయత్నిస్తున్నదా రాత్రి.

అగ్బరుపాదుషా తన మందిరంలో కాలుగాలినట్లు తిరుగుతున్నాడు. తన జీవిత చరమాంక మీ విధంగా ముగియడానికి కారణాలు ఊహిస్తున్నాడాతడు, తన వారను కున్న వారంతా రాజద్రోహులై పోవటం అతని కెంతో బాధను కల్పించింది.

"తానెత్తి పెంచిన తన కుమారుడు సలీం తనపై ఎందుకంతటి ద్వేషాన్ని పెంచుకున్నాడు. తానాతనికి చేసిన ద్రోహమేమిటి' చిన్నతనంనుంచికూడా తనపై అతనికి ప్రేమ లేదు. దానికి కారణం తనలోపమా! అతనిలోని హిందూ రక్తమా! అతని తల్లి మరణమే. ఆనాడామెతో సలీంను రహస్యంగా మాటాడనీయడమే అతనిలో అణగిన తనపైని క్రౌర్యాన్ని విజృంభింపజేసింది. కాని కుమారునిమీద తన ప్రేమ అడ్డువచ్చింది.

"అబుల్ ఫజుల్‌ను హత్య చేసిననాడే సలీంకు మరణ శిక్ష విధింపవలసింది. అంతటి మహాత్ముడు వివేకి ప్రాణానికి

ప్రాణమిచ్చే స్నేహితుని హత్యకు తాను ప్రతీకారం చేయక పోవటమే తనకీనాటి శిక్షకు కారణం."

"సర్వభారత దేశాన్ని కను సన్నలలో ఆడించిన తనకు కారాగారవాసమా? ఈ చెరలో ఎంతకాలం జీవించ గలను? ఆత్మహత్య నొనర్చుకుంటే? ఛీ! ఏమాలోచన. పిశాచలోకం చేరటానికి ఈ కారాగారవాసం కన్నా మనం చూడలేని పిశాచలోకమే మంచిది. ఈ అవిశ్వాస పిశాచాల మధ్య జీవించడం కన్నా తాను మరణాన్ని వాంఛించడమే శ్రేయస్కరం."

సేవకుడు లోపలికి వచ్చాడు.

నేలకంటా మొక్కి నిలచాడు.

"రాజా మానసింగ్ తమదర్శనాన్ని కోరుతున్నారు" అన్నాడు సేవకుడు.

"ఈ ఆపత్సమయంలో తనున్న వదిలివేశాడీ రాజ ద్రోహి. తనచేత మన్ననలు పొందాడు. రాజభోగాలనుభ వించాడు. ఆంతరంగికుడుగా జీవించినట్లునటించాడు. ఇప్పుడు వదిలివేశాడు, ఏరుదాటి తెప్పతగలవేసే నీచపుస్వభావం. ఇవ్చ! అదృష్టమే తనున్నవదిలివేసింది. ఈమాదిరి ద్రోహాలు వదలటంలో ఆశ్చర్యమేము."

అయినా అతడు ద్రోహికాలేదేమో? చూడటానికి అనుజ్ఞ యాచుకపోవచ్చు సలీమ్. ఈభావన అతని పరితప్త హృదయాని కొకింత ఊరట నిచ్చింది.

"ప్రవేశపెట్టు" అన్నాడు నిర్లిప్తంగా అగ్బరు. లోపలకు ప్రవేశించిన మానసింగ్ తలవంచి మ్రొక్కాడు పాదుషాకు. వంచిన తల ఎత్తగానే అతని కనులలో కదలాడే నీళ్ళను గమనించాడు అగ్బరు.

"జహాపనా !" ఆ కంఠస్వరంలో విచారం దోబూచులాడింది. "మానసింగ్" కాతుర కంఠంతో అన్నాడు అగ్బరు. వెనుకటి గంభీరత ఆ కంఠంలో లుప్తమైంది.

మానసింగును తన చేతుల్లోకి తీసికొన్నాడు అగ్బరు. అతని కండ్ల వెంట వేడికన్నీరు బొటబొట రాలింది.

"ప్రభూ! మనసునుచిక్కబట్టుకొనవలసిన తరుణమిది. మానవ జీవితానికి వెలుగు చీకట్లు సహజాలు. సర్వభారత దేశాన్ని ఏలిన ప్రభువులు బాధకు మరణానికి విషాదం పొందకూడదు.

అగ్బరును ఆశ్వాసించాడు మానసింగ్.

ఇద్దరు చెరొక సింహాసనం మీద కూర్చున్నారు.

"రాజా ! నాకు మరణమంటే భయం లేశమాత్రమూ లేదు. ఇప్పుడు మా మరణాన్ని మనఃపూర్తిగా ఆహ్వానిస్తున్నాను. ఇకపై ఈ అవిశ్వాసపు లోకంలో ఉండటమే గాక దుర్భరంగా తోస్తున్నది."

మానసింగ్ హృదయం చివుక్కుమంది.

"జహాపనా ! ఈ మానసింగ్ మాత్రం అవిశ్వాసిగా ప్రవర్తించలేదు. తమ మాటకొఱకై పోరాడి యువరాజు

సలీమ్ చేతుల్లో పట్టుబడ్డారు. ఆ యుద్ధంలో మరణించినా ఈ దురదృష్టంనాకు చుట్టుకొనకపోయేది. ఈ శిక్షనాకు విధించబడకపోయేది " అతనిస్వరం బొంగురుపోయింది. విచారమూ కంఠంలో గూడుకట్టింది.

"నీకు విధించిన శిక్షయేమిటి మానసింగ్ ? జీవించి ఉన్న మా అంతరంగికుల నందరినీ వాడు హత్య చేయక మానడు. చివరకు నావిషయంలో ఆలోచిస్తాడు."

"కాదు! ప్రభూ ! మీకు విధించే శిక్ష శారీకమైనది కాని నాకు విధించినశిక్ష మానసికమైంది. ఘోరమైనదీ "

"ఏమిటది మానసింగ్ ?" వేగిరపడే కంఠస్వరంతో అడిగాడు అగ్బరు.

"సలీమ్ పాదుషావారు తమతల్లికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం జరుపుతామన్నారు. ముందుగా ఆమెకు జరిగిన అన్యాయాన్ని తమ్ముడిగి తెలిసికొనమన్నారు ? దాని న్యాయాన్యాయాలను నన్ను విచరించమన్నారు." అన్నాడు మానసింగ్.

మూర్ఖుడు తనతల్లి రహస్యాన్ని కొరకు తెలిసికొనడానికిష్టపడేవాడు వాడు బిడ్డగాడు. మానసింగ్! నా భార్యకు సంబంధించిన విషయాన్ని తెలియజేసేటంత అభిమానహీనుణ్ణి కాను నేను"

"అంటే ఏమరా మాతృదేవత కన్యాయం చేశారని నేను విశ్వసింపవలసివస్తుంది."

[ 3 ]

"విశ్వసించు మానసింగ్ అందువల్ల నాకు జరిగేనష్ట మేమిటి ? నన్ను వరించబోయే మృత్యుదేవత మరి కొంత ముందుగా నన్ను చేరుతుంది. మీరందరూ విశ్వాసఘాతకులు అన్నం పెట్టి ఐశ్వర్యాలిచ్చిన వాడికి అపకారం తలపెట్టిన హీనులు మానసింగ్ ! మీరు హీనులనే విషయం నేనీనాడే అనుకోనలేదు పౌరుషాభిమానాలు చచ్చిపోయిన జీవచ్ఛవాలని ఆనాడే జియారాణిని నాకీయడానికి ఒప్పుకున్ననాడే అనుకున్నాను. ఆ అభిప్రాయమింతవరకు నాకు మారలేదు. ఇక మార్చుకోనవలసిన అగత్యంకూడ కన్పించడంలేదు" క్రోధంతో అతనిముఖం ఎర్రవారింది.

మానసింగ్ నిర్వీణ్ణుడైనాడు నిర్వికారంగా అన్నాడు

"జహాపనా ! ఈ ఆఖరినిముషాలలో కూడ మీరు పశ్చాత్తప్తులు కాకపోవడం దురదృష్టం ఆ పశ్చాత్తాపమన్నా మీలోని పాపాన్ని కొంత తగ్గిస్తుందని తలచాను కాని మీరందుకు కూడా ఇష్టపడడం లేదు."

"నేనెందుకు పశ్చాత్తాప పడవలె మానసింగ్ ! ఈ దేశాన్నంతా ఒక్క చేతిమీదుగా పరిపాలించాను. కోరిన యువతినల్లా అనుభవించాను. కోరిన భోగాన్ని సమకూర్చుకున్నాను. భావిచరిత్రకారులు మొగలు సార్వభౌముల్లో సాటిలేని వాడక్బరు చక్రవర్తియని స్వర్ణాక్షరాలతో లిఖిస్తారు. భారతదేశచరిత్ర ఉన్నంతకాలం అక్బరుచక్రవర్తి పేరు తప్పకుండ నిలిచివుంటుంది"

"మీ ఆత్మనడగండి జహాపనా? మత సహనపు ముసుగులో మీరొనర్చిన ఘోరాలు, కామమోహితులై మీరొనర్చిన మానభంగాలు, సామ్రాజ్య దాహంతో యుద్ధాల పేరిట మీరొనర్చిన మానవమారణ హోమాలు, స్నేహితాల పేరుతో మీరొనర్చిన నమ్మక ద్రోహాలు ఇవన్నీ తమరు పశ్చాత్తాపం చెందడానికి కారణాలు గావా! ఇది ఆత్మపరిశీలన జేసికొనే సమయం. మాతో గాకపోయినా అల్లా ఎదుటనైనా మీరు మీ అపరాధాలకు తగిన సంజాయిషీ చెప్పుకొనక తప్పదు," మానసింగ్ స్థిరంగా అన్నాడు.

"నీ మాటలు వింటుంటే నాకేమిటో అనుమానంగా ఉన్నది. మానసింగ్! నా శిక్షను వినిపించడానికే సలీమ్ నిన్నిక్కడకు పంపి ఉంటాడనే తోస్తుంది. నిజమా?" గంభీరంగా అడిగాడు అక్బరు పాదుషా.

"అదే నా దురదృష్టం జహాపనా! విశ్వాసంతో కొలిచిన ప్రభువుకు నేనే శిక్షను గూర్చి వినిపించవలసి రావడం నా పాపఫలితం కాదా ప్రభూ? కాని సలీమ్ తన తల్లికి జరిగిన అన్యాయానికి మీనుండి విని మీకు విధించిన శిక్ష న్యాయాన్యాయాలను ఆలోచించమన్నాడు ఈ శిక్ష అన్యాయమని తోస్తేనే నేను యువరాజుకు తెలియచేస్తాను." అన్నాడు మానసింగ్.

"నాకెవరి దయా అవసరం లేదు మానసింగ్! నా రహస్యాలను అదునా నా జనానాకు, జీవితానికి సంబంధించిన

విషయాలను సేవితరులకు చెప్పుకోనవలసిన అవసరం అపరాధాన్ని మన్నింపమని యాచించవలసిన దైన్యంనాకురాలేదు. నీవు తెలియజేయవలసిన విషయం ఇష్టముంటే చెప్పండి" అక్బరులోని గంభీరత చెక్కు చెదరలేదు.

మానసింగు అనుజ్ఞతో ముఖమల్ గుడ్డగప్పిన బంగరు పళ్ళెరమొక సేవకుడు తెచ్చి వారియెదుట పెట్టి నమస్కరించి వెళ్ళాడు.

"ఏమిటది మానసింగు!" అక్బరు అడిగాడు.

"తమ కుమారుడు తమకంపిన ఉపాయనం ప్రభూ! స్వీకరించండి తమకు శిక్షకూడ ఇదే" పళ్ళెరాన్ని అక్బరు ముందుకు తోశాడు మానసింగు.

కన్నార్పకొకక్షణం మానసింగ్ ముఖం చూశాడు అక్బర్. మానసింగు మ్లానవదనంలో తిరిగిన కన్నీటిని గమనించాడు అక్బరు.

"నీవుచింతపడకు మానసింగు.నీవిధిని నిర్వర్తించావు" అంటూ ఆ పళ్ళెరం మీద గుడ్డను తొలగించాడు అక్బరు.

మద్యంతోనిండిన పచ్చలపాత్ర వజ్రాల కైజారు ; పిడికిక్రింద ఒక ఉత్తరం.

ఉత్తరాన్ని చేతికి తీసికొన్నాడు అక్బరు,

అక్బరు పాదుషాకు,

సర్వభారతదేశాన్ని పరిపాలించిన ఘనతవహించిన తమకు తగిన విలువగల వస్తువులనే పంపుతున్నాను. లక్షల

విలువ జేసే పచ్చలపాత్రి దానిరాజ్యాలు విలువ జేసే పూర్వ గాథ తమకు తెలిసిందే తమ హృదయంలాంటి ఆ పాత్రలో పైకి కన్పించేది రుచియైన సారాయము. కాని నిండా ఉన్నది విషం. రెండవది వజ్రాల కైజారు దాని విలువ రాజ్యాలను మించింది పాత్రకంటవిలువ దానికున్నది. ఆ కైజారు కథ తమ కెరిగినంతగా మాకు తెలియదు. ఇవి మీ ఘనతకు మర్యాదకు అధికారానికి తగినవనే ఉద్దేశ్యంతో తమకు నమ్మిన సేవకుడైన మానసింగు ద్వారా పంపుతున్నాము. మీ ఇష్టము మీ రేదికోరుకున్నా మాకు అభ్యంతరంలేదు. ఈ వాక్యంకూడ ఒకప్పుడు మీరన్నదే. దీనితో మా తల్లి గారి ఋణాన్ని తీర్చినట్లు భావిస్తాను.

—జహాంగీర్ పాదుషా.

జాబు పూర్తిగా చదివాడు అగ్బరు.

అతని ముఖంలో మారేరంగులను గమనిస్తాడు మాన సింగ్. అగ్బరు ముఖం నల్లబడినది,

"ఇప్పుడైనా తమకు ఆత్మపరిశీలన అవసరమనితోచ డం లేదా జహాపనా!" ప్రశ్నించాడు మానసింగు.

"అవసరమైనా కాకపోయినా అది నా ఒక్క హృద యానికే పరిమితం కదా మానసింగు. రా మానసింగు నీ ప్రభువును ఒక్కసారి కౌగలించి కడసారివీడ్కోలు యివ్వు నీ యెడ నేను చేసిన అపరాధాలుంటే క్షమించు" అంటూ మానసింగును కవుగలించుకున్నాడు అగ్బరుపాదుషా.

ప్రభుత్వభావం వారిలో నశించింది. ఆపదలోనున్న ఒక మానవుడు దానికి సానుభూతి తెలిపే మానవుడింకొకడు. ఇప్పుడా మానవహృదయాల ప్రతిరూపాలు వారిరువురు.

కొద్దిక్షణాల తర్వాత కౌగిలి వదిలాడు అక్బరు పాదుషా.

"ఇన్నిదినాలు కలసి మెలసి తిరిగిన ప్రభువును విస్మరించకు మానసింగు! ఈ శిక్ష అమలు జరుగుతుంది. ఇక నీవు వెళ్ళిపో మానసింగు వెళ్ళు. నా ఆప్త పరివారంలో బతికి వున్న వాడివి నీవే. ఇక వెళ్ళు. ఇటువంటి శిక్ష నీకుకూడ ఒకనాడు తప్పదని ఆ జహాంగీరు పాదుషాకు తెలియజేయి,"

కంటినుండి ప్రవహించే నీటిని ఒత్తుకుంటూ పెద్ద పెద్ద అంగలతో బయటికి వెళ్ళి పోయినాడు మానసింగు. తన గదిలోపల బిగించుకున్నాడు అక్బరు.

# 3

"మార్యమ్-ఇ-జమానీ" అనుకుంటూ నిట్టూర్పు విడిచాడు అక్బరు పాదుషా.

"నామీద నీ కెందుకింత పగ జియా! నా సలీం మనసును విరిచివేశావు. నేను నీ కే మపకారం చేశాను. మహారాణి, సర్వ రాజభోగాలు నీ కరతలామలకం చేశానే! ఎందుకు నన్నీ విధంగా నా కుమారుడికి దూరం చేశావు?

ఇప్పుడు నేను పడుతున్న నరకయాతనకంతటికీ నీ ద్వేషమే కారణం జియా, మరి అటువంటి ద్వేషమున్నదానివి నన్నెందుకు రెండుసార్లు ప్రాణాపాయంనుండి రక్షించావు? నా ప్రాణంకోరకు నీ ప్రాణాన్నెందుకు బలిపెట్టావు? ఇంత ద్వేషంలో కూడ నా ప్రాణంమీద నీ కెందుకంతటి మమకారం? అవునులే జియా, రాజపుత్రిలపగ నీది. అది నీవు ఇప్పటికీ తీర్చుకున్నావు. ఆనాటి నీ వాక్యాలు నాకు జ్ఞాపకమున్నవి. మహారాణీ! అవి నెమ్మదిగా ఇప్పటికి నిజాలైనవి నీ మతాన్నుండి, నీ దైవతాలనుండి నిన్ను బలవంతంగా తెప్పించాను"

అగ్బరుకు ఆనాటి విషయాలు కన్నులముందు కదలాడినాయి.

* * *

"ఎవరు అంబరు మహారాజులా! మొగల్ పాదుషాను ఎదిరించి జయించదలచిన మహావీరులు చేతులకు సంకెళ్ళతో బందీలుగా నిలువవలసి వచ్చింది" హేళనగా అన్నాడు అగ్బరు.

"జయాపజయాలు దైవాధీనాలు. ఇవి మాకుమంచి దినాలు కావు" అన్నాడు బిహారీమల్.

"కాలాన్ని మంచిగా మార్పుచేసుకోవడం మనచేతుల్లోనే ఉంటుంది మహారాజా! మంచి చెడులు మన నడతననుసరించి ప్రతిఫలాన్నిస్తుంటవి" అగ్బరన్నాడు నెమ్మదిగా.

"మా దేశ రక్షణకొరకై మేము పోరాడాము. ఓడిపోయినాము. విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించడం చెడుగాదు" కొంచెం తీవ్రంగానే అన్నాడు బిహారీమల్.

"బిహారీమల్! మీ రాజ్య పునశ్రేయస్సును మీరు కోరుతున్నారా?" అడిగాడు అక్బరు పాదుషా.

"అంతకంటే నేను కోరదగిన దేమున్నది?"

"మీతో సరసమైనసంధి చేసికొనడమే పాదుషావారి ఉద్దేశం" అన్నాడు సేనాపతి ఆజంఖాన్.

"బిహారీమల్ ముఖం విప్పారింది. అది గమనించాడు అక్బరు.

"పాదుషావారితో సంధి చేసికొనడం నాకు సంతోష కరమైన విషయం" బిహారీమల్ అన్నాడు.

"సంధిషరతులు మీకు కొంచెం బాధ కలిగించవచ్చు" నెమ్మదిగా అన్నాడు అక్బరు.

"నా రాజ్యాన్ని ప్రజలను రక్షించుకొనడానికి మేము కూడ కొంత త్యాగం చేయడానికి సిద్ధమే ప్రభూ" అన్నాడు బిహారీమల్.

"ఈసంధి కుదిరిననాడు మీ అంతటి అదృష్టవంతులింకొక రెవ్వరీ భారతభూమిపై ఉండబోరు మహారాజా" ఖాంజమాన్ అన్నాడు.

"తమ మాన్‌సింగు - భగవాన్‌దాసు లిరువురూ మొగలు సంస్థానంలో ఉన్నతపదవులలంకరించడంలో సందే

హం లేదు" అన్నాడు రాజా అలీఖాన్ అసిర్‌ఘర్ మహా
రాజు.

ఆ షరతు లేమిటో ఊహించలేకపోయినాడు బిహారీ
మల్. మొగలు చక్రవర్తి ఎంతగా లొంగదీసిన ఆ షరతు
లేమిటో అర్థం కాలేదా రాజపుత్రునికి. అయితే తన స్వా
తంత్ర్యం మాత్రం నశించి తాను అక్బరు సామంతుడు కాక
తప్పదనే విషయం అందులో అతడు గమనించాడు.

"అంబరు మహారాజు లేమాలోచిస్తున్నారు? మా
సంధి షరతులు తమకు నచ్చలేదా" కుటిలపు చిరునవ్వు
నొకదాన్ని విసిరాడు అక్బరు.

"మా కంతటి అదృష్టాన్ని సమకూర్చే సంధిని మే
మంగీకరించక పోవడంలేదు. ఆ సంధి షరతులను వివరించ
చండి. అవి ధర్మబద్ధమైనవి కావడం అవసరం" అన్నాడు
ఏదీ ఊహించలేని బిహారీమల్.

"తాము హిందూ రాజులు, మేము మహమ్మదీయు
లము. ఈ మొగలు సామ్రాజ్యం హిందూ రాజులకు కంట
కంగా ఉండటం సహజం. కాని ఈ సామ్రాజ్యం అవి
చ్ఛిన్నమైనది. సర్వభారతావని ఒకనాడు ఈ సామ్రాజ్యం
లో విలీనం కాక తప్పదు" ఒక క్షణం ఆగాడు అక్బరు.

"హిందూ రాజులు ఎల్లకాలం శత్రువులుగా ఉండటం
మాకు ఇష్టం లేదు, వారితో కలిసి సహజీవన మొనర్చడమే
మా పరిపాలనా పద్ధతిలో మొదటిసూత్రం. హిందూ మహా

మ్మదీయ లిద్దరూ మాకు సమాదరణీయులు. ఆ సిద్ధాంతంతోనే ఈ సంధిని మేము ప్రతిపాదిస్తున్నాము. మేము జయించిన ఈ అంబరు రాజ్యమంతా మా అధికారం క్రిందకు వచ్చింది, కాని ఈ రాజ్యాన్ని తిరిగి మీకు ఇచ్చివేస్తున్నాము మీరు మొగలు సామ్రాజ్యాని కేవిధమైన కప్పము కట్టనవసరంలేదు. కాని మీ రాజ్యం మొగలులకు లోబడిన రాజ్యాంగా మాత్రం పరిగణింపబడుతుంది. మీ రాజ్యాన్ని మీరే స్వతంత్రంగా పరిపాలించుకొన వచ్చును" ఒక్కసారి బిహారీమల్ మానసింగుల ముఖాలవైపు మిగిలిన బందీలయిన అందరు వీరులవైపు చూచి అడిగాడు అక్బరు.

"తమ ఉదార హృదయానికి మా జోహారులు. పరాజితున్ని, ఇంతటి దయతో ఆదరించే విజేత సర్వజన మాననీయుడు."సంతోష తన్మయత్వంలో అన్నాడు బిహారీమల్.

మానసింగు హృదయం శంకాకళంకితమైంది,

"తమ సంధి షరతులివేనా?" అనుమానంగా అడిగాడు మానసింగు.

మరొక్కటి మిగిలిపోయింది అన్నాడు ఖాన్‌జమాన్.

"ఏమిటది" బిహారీమల్ అడిగాడు.

"పాదుషావారు ఈ కయ్యాన్ని వియ్యంగా మార్చుకొన గోరుతున్నారు" నెమ్మదిగా అన్నాడు ఖాన్‌జమాన్.

ఈ కుటంత్రంతా అర్థమైంది మాన్‌సింగుకు బిహారీమల్ ఇంకా గ్రహించలేదు.

"ఇందులో వియ్యమనే విషయమేమున్నది?" బిహారీమల్ ప్రశ్నించాడు.

"తమ కుమార్తె జియారాణిని పాదుషావారు తమ పట్టపురాణిగా చేసికొనగోరుతున్నారు. ఇది ఉభయరాజ్యాల మైత్రికి కారణభూతమౌతుంది" అన్నాడు ఖాన్‌జమాన్.

"ఖాన్‌జమాన్ నీవు అన్నదేమిటో గ్రహించు, మీ సంధిలోని కుట్ర నాకు అర్థమవుతున్నది. తురకలకు పిల్లనిచ్చే పౌరుషహీనులు కాదు రాజపుత్రులు" పెదగా ఆవేశంతో అరిచాడు రాజాభగవానుదాసు.

"ఆవేశపడకు భగవాన్‌దాసు! బందీగా వున్న నీవు ఇంత పౌరుషం చూపడం అవివేకం. పాదుషావారు తలచితే క్షణంలో జియారాణి మా చేతుల్లో వుంటుంది, కాని ఆ బలవంతం మా పాదుషావారికి యిష్టంలేదు. వియ్యానికి మమత అవసరం" అన్నాడు ఖాన్‌జమాన్.

బిహారీమల్ కు ఆలోచనలు ఆగిపోయినాయి. కాలం స్తంభించిపోయినట్లున్నదాతనికి. అతనిలోని జీవచైతన్యాన్నెవరో దోచుకొని పోయినట్లు భావించాడాతను.

"అంబరు మహారాజులేమంటారు?" చిరునవ్వుతో అడిగాడు అక్బరు.

"ఏమంటారు? ఇంతటి ఘోరకార్యం చేయజాలనంటారు" కుటిలమయిన మీ హృదయాన్ని తెలిసికొన్నామంటారు" అన్నాడు భగవాన్‌దాసు.

"ఆగండి! మీపొగరుబోతుతనాలకి శిక్షను ఊహించుకొనండి" కటువుగా అన్నాడు ఆదంఖాన్.

"ప్రాణాలు తీయించడంకంటే ఎక్కువ శిక్ష విధించలేరు మీరు. మా మత సాంప్రదాయాలను పౌరుష పరాక్రమాలను వదలి మీకు పిల్లనీయడం అంతకంటే పెద్దదయిన శిక్ష. సర్వ రాజపుత్రలోకంలో మాకంటే క్షుద్రులెవ్వరూ ఉండరు అప్పుడు" అన్నాడు భగవాన్‌దాసు.

"బిహారీమల్! ఆలోచించండి. మీ బంధుమిత్రులు, ఈ పౌరుష పరాక్రమాలు ప్రదర్శించే వీరు సంధిని వ్యతిరేకించిననాడు మీరు మిగలరు. మీనగరం స్మశానం కాకతప్పదు. జియారాణి అక్బరుపాదుషావారి జనానాలో చేరక అప్పటికయినా తప్పదు, అది తప్పవలెనంటే ఆమె ప్రాణాలతో నీకు దక్కదు" అన్నాడు ఆదంఖాన్.

"అంబరు రాజ్యమనేది భూమిపై ఆపైన మిగలకపోవచ్చు కూడ" అన్నాడు మంత్రి షంషుద్దీన్ అట్కా.

"నాకు ఆలోచించుకోవటానికి వ్యవధి కావాలి" నిర్లిప్తంగా అన్నాడు బిహారీమలు.

"ఆలోచించుకొనండి మహారాజా! మీ రాజ్యాన్ని నిలుపుకొనటమో లేక సర్వనాశనమొనర్చుకొనడమో మీ చేతులలోనే వున్నది. పెళ్ళి కుమార్తెకు నచ్చ చెప్పి ఒప్పించండి. సర్వ మొగలు సామ్రాజ్యానికి ఆమె పట్టపు మహిషియని తెలియ జేయండి. తిరిగి రెండు దినాలలో మీ

నిర్ణయాన్ని మాకు తెలియజేయండి అంతవరకూ మానసింగు భగవాన్‌దాసులిద్దరూ మా వద్దనే వుంటారు" అన్నాడు షంషుద్దీన్.

సంకెళ్ళనుండి ముక్తుడయినాడు బిహారీమలు. అక్బరుకు మొక్కి బయలుదేరాడు బిహారీమలు.

"మహారాజా! ఈ మీ ఆత్మబంధులిద్దరు చిత్రవధలకు గురికాకుండా చూడండి. మీ నిర్ణయం మాకు వ్యతిరేకమయిననాడు వీరేముందు బలియవుతారు" అన్నాడు మంత్రి షంషుద్దీన్.

చిరునవ్వు ముఖంపై చిందులాడగా లోపలికి లేచి వెళ్ళాడు అక్బరు. నిర్విణ్ణులై బంధితులై యున్న మానసింగు భగవాన్‌దాసులను చూసి నిట్టూర్చి డేరా బయటకు వెళ్ళిపోయినాడు బిహారీమలు.

* * *

"బంధువుల మిత్రుల క్షేమాన్ని రాజ్యపు శ్రేయస్సును ఆలోచించి నేనీ నిర్ణయానికి వచ్చానమ్మా!" అన్నాడు బిహారీమలు తనకెదురుగా నిలచి కన్నీరుగార్చ కుమార్తె జియూరాణితో.

"అందరి క్షేమం కొరకు నన్నొక విధర్మిని మ్లేచ్ఛుని వివాహం చేసుకొనమంటారా నాన్నా? నాకు నచ్చిన భర్తను చేసుకొనే హక్కయినా నాకు లేదా" జియూరాణి అడిగింది.

"లేకేమిత్తల్లీ తప్పక వుంటుంది, పరిస్థితులు విష మించినప్పుడెవరయినా చేయగల్గిందేమిటి — తల్లీ! అతడీ పెండ్లిని రాజ్యంతో ప్రజలప్రాణాలతో ముడిపెట్టాడమ్మా"

"ఈ వివాహం జరిగితే ఈ రాజ్యం నిలుస్తుందని నీకు దృఢమైన నమ్మకముందా నాన్నా! బంధువులను, ప్రజలను రక్షించవలసింది ఖడ్గంతోగాని కూతురును తాకట్టుపెట్టిగాదు. ధర్మగ్లానితో సిద్ధించే మీ వాంఛ చిరకాలం నిల్చేదికాదు నాన్నా!"

"జియా! ఈ ధర్మప్రశ్నలను నేను వినదలచలేదు. మొగలు సైన్యాల కిరాతక కృత్యాలకు నా రాజ్యాన్ని ప్రజలను నేను బలిచేయదలచలేను. రాజ్య క్షేమమును కాంక్షించడంలో నాకెంత బాధ్యత వుందో అంతటి బాధ్యత నీకూ వున్నది. ఒక్క కుమార్తె కొరకు నేను నా విద్యుక్త ధర్మాన్ని వదలి శాంతిని నాశనం చేయదలచలేదు."

"విద్యుక్తధర్మ మేమిటో మీ రెరుగరు నాన్నా! మీలోని క్షాత్రతేజం నశించటంలోనే, మీ పౌరుషం లోపించిపోవటంలోనే ధర్మగ్లానిని మీరు సహించటంలోనే మీధర్మం విలుప్తమయింది. పరాక్రమించి నెరవేర్చవలసిన ధర్మాన్ని కృతిమోపాయాలచేత అమ్మేచ్చుడి కామపిపాసను చల్లార్చడానికి కుమార్తె నర్పించడంచేత నెరవేర్చ దలచడంకంటె క్షుద్రమైన కార్యమేమిటి నాన్నా! దీనితో మీ ఆత్మగౌరవమే నశిస్తుంది. సర్వ రాజపుత్ర

లోకంలో మీరు తలయెత్తుకొని బ్రతకగలరా నాన్నా-కన్నకుమార్తెను రక్షింపలేని మీరు రాజ్యాన్నే రక్షిస్తానని పల్కడం వింతగాదా చివరిసారిగా వేడుకుంటున్నాను. సనాతనధర్మ మ్లేచ్ఛుని బారినుండి, ఆ కామపిశాచి బారినుండి సామ్రాజ్య దాహంతో పెదవులు తడుపుకుంటున్న ఆ రాక్షసి బారినుండి రక్షించండి ఇందులో మీ ప్రాణాలు పోయినా మీరు ధర్మరక్షకులనే పేరును పొందుతారు" అంటూ తండ్రి పాదాలపై పడింది జియూరాణి.

కన్నీళ్ళతో లేవనెత్తి ఆమెను హృదయానికి హత్తుకున్నాడు. తన అసమర్థతకు తనకే సిగ్గువేసింది అతనికి. కాని అతనిలోని భయం వేయింతలయి క్షణక్షణానికి పెరిగిపోతున్నది.

"అక్బరు పరమతసహనానికిదినిదర్శనం కాదాతల్లీ! ఈ రాజపుత్రులతోడి బాంధవ్యమును వాంఛించుటలో అతని ఉదారత తెలియుటంలేదా!" మెల్లగా అన్నాడు బిహారీమల్.

ఆ మ్లేచ్ఛుడికి పరమత సహనమనేది ఒక ఆచ్ఛాదన. పరమత సహనము ఇతర ప్రజలమతములో జోక్యము లేక పోవడం కాని ఇతరుల స్త్రీలను బలవంతంగా తన కామ వాంఛలు తీర్చుకొనడానికి భార్యలుగా చేసుకొనడముకాదు. ఆ పరమత సహిష్ణునికి వివాహముగాని సవతి చెల్లెలున్నదే ఆమెను మన మానసింగు అన్నగారికేల యివ్వకూడదు నాన్నా? అది వారి మత దురహంకారానికి లోపాన్ని

సమకూరుస్తుంది. ఇష్టంలేని ఆడదాన్ని బలవంతంగా తన కామ పిపాసకు బలిచేయడంలోనే అతని ఉదారత ఇమిడి వున్నది నాన్నా" అన్నది జియారాణి.

శరీరాన్ని ఖడ్గాలతో పొడిచినంత బాధపడ్డాడు బిహారీమల్.

"ఇంతవరకు హిందూ దైవతాలను కొలిచిన నీ కుమారిత ఇక మహమ్మదీయ యువతిగా నీ కండ్లముందు తిరుగుతూ వుంటే చూచి ఆనందించ దలచావా నాన్నా? చివరి మాట చెపుతున్నాను నాన్నా! నాకూ పౌరుషమున్నది. బలవంతంగా నాకీ వివాహం జరిపిస్తే పౌరుషహీనులైన మీ ముఖాలను మరెన్నడూ చూడను. ఏ అక్బరు పాదుషా మీ రాజ్యాలకు సర్వరక్షకుడని మురిసిపోతున్నావో అతని చేతనే ఈ పౌరుషహీనులు పరాక్రమ రహితులు ఏలుతున్న రాజ్యాన్ని సర్వనాశనం చేయిస్తాను" అన్నది జియారాణి.

బిహారీమల్ క్రోధం ఉవ్వెత్తుగా లేచింది.

"అంతే కానివ్వు మూర్ఖురాలా! ఇప్పుడే సర్వనాశనమయే బదులు నీచేత పంపబడిన సైన్యంతో పోరాడి అప్పుడే మరణిస్తాము, నీవు అగ్బరునే ఇప్పుడు వివాహము చేసికొని తీరవలసిందే" తన నిర్ణయాన్ని తెల్పి వెళ్ళిపోయినాడు బిహారీమల్. మరునాటి ఉదయానికి అంతఃపురంనుంచి జియారాణి అదృశ్యమైంది.

ఉదయము గదిలోనికివచ్చిన చెలికత్తె సిద్వేణిఅయి

మాంనసింగ్, భగవాన్ దాసులు పదేసివేల సైన్యాల కధిపతులైనారు,

దాసీపుత్రిక జియా రాణిగా అగ్బరును అంతఃపురాన్ని అలరించి ఆనందిస్తున్నది.

నాలుగు మాసములు గతించినవి. రజని గర్భము ఫలించినది. భావిసామ్రాజ్యాధిపతి ఉదయించగలడని భావించాడు అగ్బరు.

బైరాంఖాను కుమారుడు, అబ్దుల్ రహీము అంబరు రాజ్యంలో అగ్బరు ప్రతినిధిగా నియమింపబడ్డాడు. అతనికి అగ్బరు పెండ్లిచేసికొన్న యువతి రాజపుత్రిక కాదని ఆమె స్థానంలో ఉన్న దాసీపుత్రిక రజనీఅని తెలియడానికి రెండు నెలలు పట్టింది.

అబ్దుల్ రహీం ఈ విషయమై బిహారీమల్లును ప్రశ్నించాడు.

అప్పటికే మొగలు పాదుషా సంబంధంతో అతడొసంగిన భోగభాగ్యాలతో మత్తెక్కిన బిహారీమల్ అతనితోడి విరోధమును తలుచుకొని కుంగిపోయాడు. భీతి అతణ్ణి లోగొన్నది.

అప్పటికే తన కుమార్తె జియారాణి మేనమామల యిల్లు చేరిందని తెలుసుకొని వున్నాడు బిహారీమల్లు.

అబ్దుల్ రహీం బెదరింపులకు బెదిరిపోయిన బిహారీమల్లు తన కుమార్తె ఆచూకీ అబ్దులు రహీంకు తెల్పి తన రహస్య

మును బయల్పరచకుండుటకై అతనికి లక్షబంగారు నాణెము లిచ్చి ప్రసన్నుణ్ణి చేసికొన్నాడు.

బిహారీమల్లు పాలనలోని ఒక కోటలో దాగిన జియా రాణి కొరకు అబ్దులు రహీం ఆ కోటపై దాడి చేశాడు.

జియారాణి మేనమామ ప్రతిఘటనకు సిద్ధపడ్డాడు. తన శీల రక్షణకు ప్రాణాలను త్యజించ సిద్ధపడిన మేనమామను వారించింది జియారాణి.

ఇక అక్బరు తనను వదలడు. తనకు రక్షణనీయ గలిగిన వారెవరు? చిత్తూరు ప్రభువు నాశ్రయించితే తనకురక్షణ లభిస్తుంది. కాని శాంతి సుభిక్షాలతో సుఖిస్తున్న ఆ రాజ్యాన్ని తను ఒక్కతె మూలంగా యుద్ధజ్వాలలో దింపకూడదు, తన తండ్రి తన సుఖంకొరకు కూతురినీ, ధర్మాన్నీ, బలిపెట్టాడు. తనకు రెండే పద్ధతులు అక్బరుకు లోబడడమో లేక ప్రాణత్యాగం చేయడమో? తన ప్రాణత్యాగం తన తండ్రి రాజ్యాన్ని ఆహుతి కొంటుంది.

తన మేనమామ వెంటరాగా జియారాణి అబ్దుల్ రహీంకులోబడి పోయింది.

మహారాణి మర్యాదతో అతడు జియారాణిని ఢిల్లీ నగరానికి అగ్బరు పాదుషా సన్నిధికి తెచ్చాడు.

అతి రహస్యంగా ఆమె అగ్బరు అంతఃపురానికి చేర్చ బడ్డది, తన ద్వేషాన్ని హృదయంలో పదిం చేసుకొని పట్టపు రాణి అయింది జియారాణి.

తిరిగి ఆమె మరణించేవరకు తను తండ్రి యింట అడుగుపెట్టలేదు

హిందూ వనితలకు భర్త పరమదైవం. ఆ భర్తతోడిదే లోకం ఆ రక్తమూ మెను కొంతకాలానికి అక్బరుకు సుముఖురాలిని చేసింది.

తనలోని ఆ ద్వేషాన్ని చంపుకొనడానికి కామెకు చాల కాలమే పట్టింది. సలీమ్ పుట్టిన తర్వాతనే ఆమె అక్బరుకు సన్నిహితురాలైంది మానసికంగా.

ఒకనాడు అక్బరు అంతఃపురానికి వచ్చాడు.

జోధారాణి విషాదంతో ఉన్నది. అక్బరు అప్పుడే ఆమె గర్భిణి అనే విషయం వినివచ్చాడు. ఉత్సాహం అతనిలో ఉరకలు వేసింది.

"జియా! ఈ విషయాన్ని నాకు తెల్పలేదేమి ?" అక్బరన్నాడు. ఆమెకు ఉత్సాహం కల్గలేదు.

"నామీద ద్వేషం నీకింకా పోలేదా జియా ! నీ సౌందర్యమే నన్నింతటి బలవంతానికి పురిగొల్పింది."

"ఆ ద్వేషం నాలోనన్నే దహించి వేస్తున్నది ప్రభూ! నేను హిందూ వనితను. నాకు భర్త దైవస్వరూపుడు నా భర్తను నేనట్లాగే కొలుస్తాను"

"మరి యీ విషాదం దేనికి జియా ?"

"నా ధర్మంమీద నాకు మమకారమున్నది. ఆ అధర్మాన్ని పోద్రోచి బలవంతంగా వివాహాడిన మీపై ద్వేషమున్నది. ఈ సమయంలో పుట్టబోయే ఈ బిడ్డ మనస్తత్వమే విధంగా ఉంటుందోననే నా బెంగ. నాలోని ద్వేషం ఈ బిడ్డకు వారసత్వమవుతుందేమో ?" తన విషాదకారణాన్ని వెల్లడించింది జియారాణి. అలవోకగా నవ్వాడు అగ్బరు.

"ఇంత మహాసామ్రాజ్యాన్ని నిర్మించి పాలించే అగ్బరుకు తన కుమారుణ్ణి ఆవిధంగా పెంచుతాడా జియా ? నీవా భయ సందేహాలు వదిలివెయ్యి. ఉత్సాహంగా పుట్టబోయే కుమారుడి భవిష్యత్తుకు బాటలువేసేటట్లు ప్రవర్తించు" అన్నాడు నవ్వుతూ అగ్బరు.

"మనకు కుమారుడే పుడతాడని చెప్పగలరా ?" సిగ్గుగా అన్నది జియారాణి. ఆమెను దగ్గరకు తీసికొన్నాడు అగ్బరు.

"షేక్ సాహెబ్ ఆశీర్వదించాడు జియా ! ఈ పుట్టబోయే కుమారుడే భవిమొగల్ సమ్రాట్టు" అన్నాడు అగ్బర్.

"మరి రజనికుమారుడన్నాడు గదా? ఆనాడు మాయమైన నా చెలి రజని తిరిగి యింతవరకు నాకంట బడలేదు ప్రభూ , ఆమెనుగురించి అడిగినప్పుడల్లా మీరు నవ్వి ఊరు

కున్నారు, ఆమెకు కొడుకే పుట్టిఉంటే అతడేగదా మీ పెద్దకొమారుడు. అతడే భావిసామ్రాజ్యాధిపతిఔతాడు"

తిరిగి నవ్వాడు అక్బరు. ఆ నవ్వులో ఏవో కుటిలం క్రోధం కన్పించినయ్ జిఝూకు.

"మీ నవ్వు నా కనుమానం కల్గిస్తున్నది. ప్రభూ!" జియా ప్రశ్న వేరువిధంగా అర్థమైంది అక్బరుకు.

"నీవు అనుమానించ వలసినదేమీ లేదు. జిఝూరాణీ! నీకు కల్గిబోయే పుత్రుడే సామ్రాజ్యాధిపతి, నన్ను మోసగించి నీ స్థానంలో నన్ను వివాహమాడిన రజని నీవు అంతఃపురంలో అడుగుబెట్టిన మరునాడే ఈ స్థానాన్ని వదిలింది. ఆమె శాశ్వితంగా ఈ భూమినే వదిలేసింది. ఆమెనుండి ఇక నీకే భయంలేదు అన్నాడు అక్బరు.

ఎదురుగాఉన్న అక్బరు ఆకారంలో పిశాచాలనీడలు కన్పించి భయంతో కంపించిపోయింది ఆ మృదుల హృదయం.

"ఆ గర్భవతిని చంపించారా జహాపనా!" అన్నది వణికిపోతూ, ద్వేషం విషాదం క్రోధం ఆవరించి ఆమెను వివశను చేసినయ్.

# 4

Bairam khan, the faithful guardian now requested his king to cut of the head of Hemu with the Royal hand and thus obtain the name of Ghaji, Akbar did certainly do so.

"Hemu's head was sent to Kabul to be exposed and his trunk was gibbeted at one of the gates of Delhi."

(This is the statement of Vincent smith on the authority of Ahamad yadgar and Dutch writer Uanden Brocke - Page 39 of Akbar the great Moghul.

"జోధారాణీ! నీ మాటలు నిజమే అయినయ్ నా కుమారునికి ద్వేషానికి కారణంలేదు. అది నీ రక్తంనుంచే అతనిలో చేరింది. అదే ఇప్పటి నా అధోగతికి కారణమైంది. నా కొడుకే నాకు విషమిచ్చి చంపబూనాడు. ఇంతకంటే ఘోరమైనశిక్ష నాకేమున్నది"

"నీ వెంతమందికి విషమీయలేదు అక్బర్, విషప్రయోగమనేది నీ రాజ్యతంత్రంలో ఒకభాగం కదా అక్బర్! అదే విషప్రయోగం నీకు జరిగితే ఎందుకింత పరివేదనం నీకు" అన్నదొక గొంతు.

"ఎవరు నీవు?" బిగ్గరగా అన్నాడు అక్బరు.

గదిలోని నీలినీడల్లో ఒక ఆకారం కదులాడింది ఆ ఆకారం పక పక నవ్వింది. దానితలకు మొండేనికి కొంచెం

దూరమున్నది. అక్బరుకు అసహ్యం భయం రెండూ కల్గి నయ్.

"ఎవరునీవు ?" తిరిగి అడిగాడు పోతున్న జవసత్వాలను కూడగట్టుకుంటూ అక్బరు పాదుషా.

"నన్ను గుర్తుపట్టలేకపోయినావా అక్బర్? నీ స్వహస్తంతో ఖండించిన ఈతల కాబూలుకు పంపావు. ఈ మొండాన్ని ఢిల్లీ కోటగోడలపై ప్రదర్శించావు. ఘాజీబిరుదాన్ని పొందావు. జ్ఞప్తికివచ్చిందా అక్బర్! ధర్మంగా యుద్ధంచేసి జయించలేక కుటిలంగా నన్ను హత్యచేశావు స్మృతిలేని స్థితిలో నన్ను చంపగలిగావు. ఇకనైనా గుర్తుకువచ్చానా అక్బర్? ఇవి నీ ఆఖరుక్షణాలు నీ కుటిలనీతికి నీ రక్తదాహానికి ఇకనైనా పశ్చాత్తప్తుడవు కావడం నీ ధర్మం" అన్నదా ఆకారం.

"నీవు నీవు హేమూ హేమూ" అన్నాడు అక్బరు.

"అవును అక్బరు. నీ అదృష్టం తిరిగిపోయింది నీ కుమారుడే నీకు శత్రువైనాడు" అంటూ గది దద్దరిల్లేటట్లు నవ్విందా ఆకారం. అదృశ్యమైపోయింది.

హేమూ జ్ఞప్తికి వచ్చాడు అక్బరుకు. తన భ్రమ అనుకున్నాడాతడు.

అక్బరుతండ్రి హుమాయూన్ పాదుషా మరణించాడు. రాజ్యమంతా దురదృష్టదేవత పొట్టనబెట్టుకొనగా చెట్టుకుపుట్టకు తిరిగిన తన తండ్రి రాజ్యాన్ని తిరిగి గెల్చుకున్నాడు!

సౌధో పరిభాగాన్నుండి దిగివస్తుండగా హుమాయూన్ కాలుజారిపడి మరణించాడు.

ఢిల్లీ నగరాన్ని తార్దిబేగ్ రక్షిస్తున్నాడు. తనకుతాను మాత్రంగా పట్టాభిషేకం జరిగింది.

హేమూ ఢిల్లీనగరాన్ని ముట్టడించాడు. ఆ దళ సేనానాయకుడయినా హేమూ హిందువు. హిందూ రాజ్యస్థాపన అతని లక్ష్యం. అత్యధికసంఖ్యలో అతని సైన్యం. దానికి తోడు పదిహేనువందల గజబలం అతనికి ఉంది. విలుకాండ్రు ఆ సైన్యంలో ఎక్కువ.

మొగలుల పాలయిన రాజ్యాన్ని ఆక్రమించుకొనుటకై భారతీయుడొకడు చేసిన చివరి ప్రయత్నమది.

ఢిల్లికోటను హేమూసైన్యాలు ముట్టడించినవి. బాణపాత దూరంగా వేసిన గుడారంలో హేమూ ఉన్నాడు. సైన్యం కోటగోడల కెగబ్రాకుటకై ప్రయత్నించినవి. లోనుండి సైన్యం ప్రతిఘటించింది —

కోటలోని తార్దిబేగ్ అసంఖ్యాకమైన శత్రుసైన్యాన్ని గమనించాడు. ఎంతప్రయత్నించినా తను గెలవడం అసంభవం. పాదుషా అగ్బరిప్పుడు తనకు సహాయపడే స్థితిలో లేడు. కోటనువదలి తాను తప్పుకోవడమే మంచిదిగాతోచింది. కోటలోని సైన్యాన్ని లొంగిపొమ్మని అనుజ్ఞయిచ్చి తార్ది

బేగ్ కోట వాటి పారిపోవడానికి సిద్ధపడ్డాడు. హేమూ సైన్యానికి చిక్కిపోయినాడాతడు.

కోటను వశపరచుకొన్న హేమూ రాజా "విక్రమాదిత్య" బిరుదుతో సింహాసన మెక్కాడు.

పట్టుబడిన తార్దిబేగ్‌ను సేనాధిపతి అతనిముందు నిలిపాడు.

"తార్దిబేగ్ ! ఏమిటి నీ సంజాయిషీ ? ఇపుడు నీవు మా బందీవి" అడిగాడు రాజా విక్రమాదిత్య.

"నా ధర్మాన్ని నేను నెరవేర్చాను. కాని మీ సైన్యాలు అధికం కావటంతో నేను ఓటమి సంగీకరింపక తప్పలేదు" తార్దిబేగ్ అన్నాడు.

"కోటవదలి నీవు పారిపోడంలో ఉద్దేశం!" హేమూ ప్రశ్నించాడు.

"అనవసరంగా సైన్యం చనిపోవటం నాకిష్టం లేదు. అందుకే ఈ కార్యానికి తలపడ్డాను" తార్దిబేగ్ అన్నాడు.

"రాజధానీ నగరాన్ని శత్రువు కప్పగించిన నిన్ను అక్బరు క్షమిస్తాడా తార్దిబేగ్ ! నీకు పరమ శత్రువైన బైరంఖాన్ నిన్ను బ్రతుకనిస్తాడా ? నిన్ను క్షమించి నా సైన్యంలో ఉన్నత పదవినిస్తాను అంగీకరించు" కోరాడు హేమూ.

"కృతజ్ఞుణ్ణి మహారాజా ! హుమాయూన్ పాదుషా కాలంనుండి ఆ కొలువులో ఉండి వారి భోగభాగ్యాలనుభవిం

చినవాణ్ణి. అక్బరు పుట్టినప్పుడు అతనిని కాపాడటానికి మాట యిచ్చినవారిలో ఒకణ్ణినేను. ఈ విషయం అక్బరు పాదుషాకు తెలుసు. అపరాధిని కాని నన్ను అక్బరు శిక్షించలేడు" అన్నాడు తార్దిబేగ్.

"నీకు ప్రాణదానం చేస్తున్నాను వెళ్ళు తార్దిబేగ్. నీవు రాదలచితే ఈ సైన్యంలో ఎప్పుడూ నీకొక పదవి ఉంటుంది. అంటూ తార్దిబేగ్‌ను వదిలివేశాడా ఉదారుడైన హేమూ.

అక్బరువద్దకు జేరేవు తార్దిబేగ్‌ను మధ్యలోనే బైరాం ఖాన్ మనుష్యులు పట్టి ఖైదుచేశారు.

అక్బరు ముందుచూరా సేనాపతిని. బైరంఖాన్ దుర్బుద్ధులు తలకెక్కిన అక్బరు సింహాసనం మీద ఉన్నాడు.

"నీవు సేనాపతివి. కోటకు అధికారివి, తొలిముట్టడిలోనే కోటను స్వాధీనపరచి పారిపోవలసిన అవసరమేం కల్గింది. నీకు?" అనుమానంగా అడిగాడు అక్బరు.

తలయెత్తి చూచాడు అక్బరును. ఆకండ్లలోని శంకను అర్థం చేసుకొన్నాడు తార్దిబేగ్.

"జహాపనా! కోటనువదలడం క్షంతవ్యం కాని నేరమే. అంతకంటె ఘోరమైన నేరం వ్యర్థముగా సైన్యం హాతం కావడం అనవసరమైన మానవులవిధకు అర్థం లేదు. నేను నేను శక్తిజీవని ప్రభూ! తగినంత సైన్యాన్నిప్పించండి. ఢిల్లీ కోటతో బాటు హేమూనుకూడ మీకప్పగించుతాను" అన్నాడు తార్దిబేగ్.

“కొన్నిలక్షల మొహరీలను లంచంగా పుచ్చుకొని కోటనప్పగించిన నీవు తిరిగి ఢిల్లీకోటను మా కప్పగించుతావా? ఇందుకెంత ధనం కావాలినీకు?” హేళనగా ప్రశ్నించాడు అక్బరు.

“మన్నించండి జహాపనా! నాపై అల్లబడిన ఈ కుట్రకు కారకులెవరో నాకు తెలుసు. నా రాజభక్తిని మీరు శంకించడం నాకు ఖేదాన్ని కల్గిస్తున్నది. ధనం కొరకు రాజ్యాలను పణంగా పెట్టడం. రాజద్రోహం చేయడం నా వంశంలో లేదు, కష్టకాలంలో తమ తండ్రితో కలసి తిరిగిన నేను తమరు పుట్టినప్పుడు మీ అభివృద్ధికి శపథం చేశాను. నా శపథానికి కట్టుబడి ఉన్నాను.”

“రాజధానీ నగరాన్ని శత్రువుకప్పగించిన ఈ రాజద్రోహి పాదుషా అభివృద్ధికి శపథం చేసాడట” క్రోధంగా అన్నాడు బైరాంఖాన్.

“బైరాంఖాన్!” పెద్దగా అరచాడు తార్దిబేగ్, “నీవు అవకాశవాదివి, రాజ్యంపోయిన హుమాయూన్ పాదుషాను ఆదరించ నిరాకరించిన నీవు ఒక రాజభక్తుడవు. పాదుషా అదృష్టం తిరిగి విజయమందుతున్న కాలంలో గజనీనుండి రాజభక్తుడుగా ఊడిపడ్డావు. నీతోటి అవసరంతో హుమాయూన్ పాదుషా అప్పటికి ఊరుకున్నాడు. ఇప్పుడా మహా మహుడు బ్రతికి ఉంటే రాజద్రోహులెవ్వరో తీర్పు చెప్పేవారు. జహాపనా! ఈ కుట్రకు కారకుడీ బైరాం” అంటూ ఆవేశపడ్డాడు తార్దిబేగ్.

"ఛీ ! నీచుడా ! నీ మూలకంగా మొగలు సామ్రాజ్యము పునాదులు పెళ్ళగించబడినవి. నీవికజీవించడం ఆసామ్రాజ్యానికే ప్రమాదం" అంటూ ఒరలోని కత్తిదూశాడు బైరాంఖాన్. తార్ది బేగ్ తల ఎగిరి నేలబడింది.

ఒక్క క్షణంలో జరిగిన ఈ హత్యకు అక్బరు నిర్విణ్ణుడైనాడు.

బైరాంఖాన్ నొక్క మాట అనగల్గిన తాహతులేదు అక్బరు కానాడు. బైరాంఖానుపై కల్గినఆగ్రహాన్ని అణచుకొన్నాడు అక్బరు.

తార్ది బేగ్ వంశంలోని మాహం అనాగా అక్బరు వశమైంది.

ఢిల్లీపైకి నడచింది అక్బరు సైన్యం బైరాంఖాను నాయకత్వం క్రింద తన సైన్యాన్ని హేమూ నడిపాడు. రెండు సైన్యాలు పానిపట్టువద్ద కలిసినయ్.

తన ఢిల్లీనగరాన్ని అప్పగించి హేమూపుత్రికను అక్బరు పాదుషాకు అప్పగించి ఏబదిలక్షల సువర్ణాలు చెల్లించితే హేమూను వదలుతామని బైరాంఖాన్ చెప్పి పంపాడు.

హేమూనవ్వుకున్నాడీ గాయబారానికి.

సంకులసమర మారంభమైంది.

మొగలు సామ్రాజ్యము కూకటివేళ్ళతో పెళ్ళగించి వేయబడడమో లేక స్థిరంగా పాదుకొని వేరుదన్ని నిలువడమో తేలిపోయే యుద్ధమది మూడుదినాలు గెలుపోట

ములు లేని యుద్ధము జరిగింది. హేమూ సైన్యాలకు విజ
యోత్సాహము అక్బరు సైన్యాలకు అపజయభీతి క్రమంగా
బలపడుతున్నాయ్. మరుసటి దినం యుద్ధం కడపటియుద్ధంగా
భావించారు ఇరువాగులవారు.

మాహం అనాగా అక్క జి అనాగా. ఈమె తార్దిబేగ్
జనానా స్త్రీ ఆమెకుమారుడు ఆదంఖాన్, తార్దిబేగ్ ఓడి
నప్పుడు అతడు ఢిల్లీకోటలో నిలిచిపోయినాడు తల్లితో.
అతడు సైన్యంలో ఒక చిన్న అధికారి. బైరాంఖాన్ రహ
స్యంగా అతనితో మంతనములు సలిపాడు.

అక్బరుపాదుషాకు సహాయపడితే ఢిల్లీకోట వశమైన
తర్వాత అతన్ని పెద్ద అధికారంలో ఉండేటట్లు అక్బరుపాదుషా
స్వయంగా వాగ్దానం చేశాడు అక్బరు. ఇప్పుడు ఆదంఖానుకు
కావలసినవాడు అనాగా సంబంధంతో.

నాల్గవనాటి యుద్ధం జరుగుతున్నది ఏనుగుపై అంబారి
నుండి హేమూ ఎక్కడ చూచినా తానై తనసైన్యాలను
ప్రోత్సహిస్తున్నాడు.

హేమూ ఆధారపడినది తన గజబలంమీద అక్బరుసై
న్యాలను చీకాకు పరుస్తున్నవి ఏనుగులు. విజయం హేమూకు
సన్నిహితమైంది. హేమూ సైనికులు విజయోత్సాహంతో
పరాక్రమిస్తున్నారు.

బైరాంఖాన్ చివరిప్రయత్నం చేయదలచాడు. ఇం
తలో హేమూ ఏనుగులగుంపు ఒకవరుస మధ్యలో తుపాకి

ముందు పేలింది. ఏనుగులు భయంతో సైన్యంపై బడినవి.
ఆదే సమయంలో బైరాంఖాన్ ప్రేల్పించిన ఫిరంగి గుండ్లు
ఆ ఏనుగులను మరింత కల్లోలపరచినయ్. పిచ్చి ఆవేశంతో
ఆ గజరాజులు హేమూ సైన్యాన్ని చిందరవందరగా
తొక్కి పారవేసినయ్.

దగ్గరలోనే సమయంకోసం చూస్తున్న ఆదంఖాన్
విషపూరితమైన తనకోలకై జారును ఏనుగుపైనున్న హేమూ
కంఠానికి గురిపెట్టి విసిరినాడు. ఆ కంఠానికి సూటిగా హేమూ
కంటిలో గ్రుచ్చుకొనిపోయింది. విషం సోకగా హేమూ
వివశుడైనాడు. అదృశ్యుడైన ఆదంఖాన్ అగ్బరు దగ్గర
చేరాడు.

ద్వారంలోనికి వచ్చి విజయలక్ష్మి కోపించి వెనుదిరిగి
మొగలుస్కంధావారానికి నడచి అగ్బరును వరించింది.

అవశుడై పడిఉన్న హేమూ ఖైదు చేయబడి అగ్బరు
ఎదుటకు కొనిరాబడ్డాడు.

హేమూతండ్రి రాజా పురాణమల్ అతనికుమార్తె
కొందర అంతరంగికులతో పారిపోయినారు.

తనచేతికి చిక్కక తప్పించుకొనిన హేమూ కుమార్తె
కొరకై అగ్బరు అధికంగా విచారించాడు. మరొక యుద్ధం
కూడ చేశాడు.

"ఈ స్మృతిలేనివాణ్ణి విచారించటమేమిటి? ఇతనికి
తెలివి వచ్చిన తర్వాత శిక్షించవచ్చునన్నాడు అగ్బరు తన
రక్షకుడు బైరాంతో"

బైరాంఖాను ఆ నిర్ణయాన్ని వ్యతిరేకించాడు. "ఈతడొక్క నిమిషం బ్రతికి ఉండటం కూడా మొగలురాజ్యానికి ఆపదకారణమే" అన్నాడు బయిరాం. ఆడంఖాన్ వంతబలికాడు.

"జహాపనా! ఇది తమ తొలివిజయం. దీనితో ఢిల్లీ తమవశమైంది. ఈతిరుగుబాటుదారుని వదలడంగాని క్షమించి కరుణజూపడంగాని మనకు మేలుకాదు. ఈతనికి శిక్ష సామ్రాజ్యంలోని విలక్షణంగా వ్యవహరించే తిరుగుబాటు మనస్తత్వం కల్గినవారికి గుణపాఠం కావలె. తమరు ఘాజీ బిరుదును పొందండి, ఈ హిందువుల తలదున్చి" అంటూ ప్రోత్సహించాడు బైరాం.

తన వజీరులు తాపిన ఖడ్గాన్ని చూసి అగ్బరు చేత ఉంచాడు.

హేమూ స్మృతిలేకుండ పడివున్నాడచ్చట.

ఘాజీ బిరుదుకొరకు అగ్బరు స్మృతిలేని రాజా విక్రమాదిత్య బిరుదాంకితుడైన హేమూ శిరస్సును ఖండించాడు. అప్పటినుండి అతను రక్త పిపాసిగా మారాడు. మనుష్య రక్తం రుచిమరిగిన పెద్దపులి అయినాడు. ఇతడు చరిత్రలో కన్పించని అక్బరు. హేమూతలను మాత్రం కాబూలుకు పంపి తన ఇచ్చటి విజయాన్ని చాటుకున్నాడు అగ్బరు. హేమూ మొండెం మాత్రం ఢిల్లీకోట ద్వారం ప్రజలందరకు ప్రదర్శింపబడింది.

అగ్బరు సామ్రాజ్యానికి హత్య నీరాజనమైంది,

తరువాత జరిగిన అనేకమైన హత్యలకిది నాందిప్రస్తావన మాత్రమే.



Bairam sent Tarsun beg with the reply that "the loyalty and devotion of Bairam would never allow him to do any thing to any servant of the state against his Mejesty's wishes for nought but kindness and favour is due to all those who faithfully discharge their duties.

Akbar by J. M. Shelot
Page 66

Sultana Salima Begum widow of Bairam khan whom Akbar had married in his youth weilded considerable influence if not in state affairs at least in the personal affairs of the king.

Akbar—Page 357

"అక్బరు!" సన్నని పిలుపు వినిపించింది.

విచారముతో మూతలు పడిన కన్నులు విప్పాడు అక్బరు.

ఎట్టఎదుట బైరాంఖాన్. కన్నులు పెద్దవి చేసిచూచాడు అక్బరు.

“అక్బరు! కన్నులు మరికొంచెం తెరచి చూడు. కన్నులు తెరచిచూడవలసింది లోకాన్నికాదు అక్బర్! లోకాన్ని చూడటం అజ్ఞానులపని.”

“మరి నన్నేం చూడమంటారు ఖాన్ జీ” అక్బరు అడిగాడు.

“నీవు ఈ సమయంలో చూడ దగినది నీవు చేసిన పాపపుణ్యాలను అక్బర్! చేసిన పాపాలను గూర్చి ఆలోచించడం పశ్చాత్తప్తుడవు కావటం అవసరమిప్పుడు”

“నేనాలోచింప దగిన పాపాలనేం చేశాను ఖాన్ జీ!” అక్బరు అడిగాడు.

“నీవేమీ పాపాలే చేయలేదా? నీవు చేసిన మానవ హత్యలు పాపాలు కావా అక్బర్! నీవొనర్చ జేసిన మతాంతరీకరణలు పాపాలు కావంటావా అక్బర్? నీవు దోచిన రాజ్యాలు నీవు చేసిన యుద్ధాలు పాపాలుకావా.”

“ఇవన్నీ నా సామ్రాజ్యాన్ని విస్తరించడం కొరకు, విస్తరించిన సామ్రాజ్యాన్ని నిల్పటంకొరకై చేసినవి. చక్రవర్తిగా అది నా విద్యుక్తధర్మంకాదా ఖాన్ జీ!”

“నీ సామ్రాజ్యదాహం కొరకు ఇతరుల స్వాతంత్ర్యాన్ని అపహరించే హక్కు నీ కేమున్నది అక్బర్!”

“ఈ సామ్రాజ్య నిర్మాణకాంక్షకు కారకులు మీరే

కాదా ఖాన్‌జీ? ఆనాడు అవశుడై యున్న హేమూ తలను ఖండించి ఘాజీ బిరుదు పొందమని చెప్పింది మీరు కాదా ఖాన్‌జీ? అదే నా రక్తదాహానికినాంది ప్రస్తావన" అన్నాడు అక్బర్.

"అక్బర్." కటువుగా ఉన్నదా స్వరం. "ఇప్పుడు కూడ ఇంకా ఆత్మసాక్షికి వ్యతిరేకంగా మాటాడుతావా అక్బర్? ఆనాడు నీ హృదయాన్ని నేను చదివాను. నీకు లోపల హేమూను చంపవలెననే కోరిక లేదా? అతని మీది ద్వేషం పొంగులువారే నీ కండ్లను నేను చూడలేదా అక్బర్? నేను హేమూను చంపమనినప్పుడు నీవన్న మాటలు జ్ఞాపకమున్నవా? అక్బర్?"

"నేనతని నీ వరకే ఖండించినాను" అనినావు.

కాబూలులో తను గీచిన పటములో హేమూ పోలిక లున్నవి. దానిని ద్వేషముతో తను ముక్క లొనర్చినాడు. అనగా అతని చంపునంతటి ద్వేషముతనలో అంతకు మునుపే యున్నది.

అక్బరు మాటాడక యూరకున్నాడు.

"అక్బర్? నీ అవసానకాలములో నీ వొనర్చిన పాప కృత్యాలను పరిశీలించుకో. అల్లాను ప్రార్థించు, నా ఒక్కడి విషయంలో నీవు చేసిన ఘోరకృత్యం మరే దేశంలో ఏ రాజూ చేయలేదు అక్బర్, క్రూరుడని పేరు మోగిన చంగిజ్‌ఖాన్ కూడ ఇంతటి విశ్వాసఘాతకుడు కాలేదు. నే

స్మరించినాడు కన్ను తెరచితే నీవూ నీ రాజ్యమూ చరిత్ర పుటలలో లేకుండా పోయేవారు. కాని నేను నీ తండ్రికిచ్చిన వాగ్దానాన్ని భంగం చేయలేదు. నే నేనాడైనా రాజ్యాన్ని కాంక్షించి ఉంటే నిన్ను కనుమూసి తెరచినంత కాలంలో భస్మం చేసేవాడిని. కాని నేను పెంచిన తీగను నా చేతితోనే పీకివెయ్యడం నాకు చేతకానిది. అందువలననే నీకు లోబడి నీ చేత హత్య చేయింపబడ్డాను అక్బరు."

"నీ హత్యకు కారణం నేనా ఖాన్‌జీ! నేనెప్పటికీ కాదు. నీవు ముబారిక్ లోహానీ తండ్రిని చంపించావు. ఆ ద్వేషంతో లోహానీ నిన్ను హత్య చేశాడు" అక్బర్ అన్నాడు అరచినట్లుగా.

"ఆహా అక్బర్. నాముందు అసత్యమాడడమా! నీ ఆత్మముందు నీవు అసత్యం చెపితే ఎట్లాగుంటుంది! ఆలోచించు అక్బర్, నీవు కోరిన సలీమా బేగం కొరకు నిన్ను రక్షించి పెద్దచేసి చక్రవర్తి నొనర్చిననన్నెట్లా బహూకరించినది ఆలోచించు."

అక్బరు కండ్లు తెరిచాడు. తానింత అశక్తుడైనాడు ఈనాడు. తన కెందుకింతటి ఆవేదన! త్వరలో ముగిసిపోయే తన జీవితాన్నింతటి ఆవేదన పెట్టడమేమిటి? ప్రక్కనున్న పాత్రలో మద్యం వంచుకొని గటగట తాగేశాడప్పుడు. అతనికి కొంత శాంతి లభించినట్లయింది. కల్మషం లేకుండా వదలిన మనస్సు జీవితపు వెనకటి పుటలను తెరిచింది.

"సలీమా!"

"అక్బర్!"

"ఈ దినం నా ప్రయాణం సలీమా! నిన్ను వదలి పోవడం నాకు దుర్భరంగా ఉన్నది."

"నాకు మాత్రం అక్బర్! నీవులేని ఈ జీవితం తలుచుకుంటేనే భయంగా ఉన్నది. మన ప్రణయం ఈ విధంగానే సాగిపోతుందంటావా అక్బర్?"

"ఆ విధమైన సందేహం నీకెందుకు కలిగింది సలీమా! నీ ఈ అక్బరును అనుమానిస్తున్నావా?"

"నా హృదయం శంకాకళంకిత మౌతున్నది."

"అవునవును. ప్రేమ యెక్కువయ్యే కొద్దీ అనుమానాలు రావటం అసహజం కాదు సలీమా!"

"అంతేనా! నీపై అల్లిబిల్లిగా అల్లుకొనిన నా మమతలే ఇందుకు కారణమంటావా? నీ వొక్కపూట కన్పించక పోతే నా ప్రాణాలే నన్ను వదిలినట్లుంటయ్ అక్బర్. నిన్ను విడిచి ఉండటమేవిధంగా?"

"విధిలేని స్థితిలో మనకీ యెడబాటు తప్పదు సలీమా! నా రాజ్య స్థితిగతులు కత్తివాదర మీద నడుస్తున్నవి సలీమా! ఏ విధమైన తప్పటడుగు పడినా రాజ్యంతో నేను కూడ సర్వనాశనం కాక తప్పదు."

"అంతటి మాటలనకు అక్బర్. నీవు నీ రాజ్యం కలకాలం సుఖంగ వర్ధిల్లాలి. కాని ఈ సలీమాను మరువకు అక్బర్.

ఎప్పటికీ ఎక్కడఉన్నా నా హృదయం నీకొరకే ఆవేదన పడుతుంటుంది. అది మీకొరకు పూజాపుష్పంగా ముడుపు కట్టిపెడతాను."

"నాకీ రాజ్యాధికారంలో ఏదైనా వ్యతిరేక స్థితి కలిగినప్పుడు మీతండ్రి నిన్ను నాకీయడానికి అంగీకరిస్తారా సలీమా? ఏ రాజకీయాలలో కూడిపెట్టి నిన్నెవరికైనా..." సలీమా అక్బరు పెదవులను తన చేతితో మూసి ది.

"మన యీ పరిణయానికెప్పుడూ ఏ విధమయిన ఆటంకంరాదు అక్బర్! నీవు బికారివైనా నీ కొరకు రాజులనుకూడ తిరస్కరించి వస్తాను అక్బర్"

ఆప్యాయంగా చేతులలోనికి తీసికొన్నాడామెను అక్బరు. ఆ కౌగిలిలో పరవశించిపోయినదా భామాసలీమా. ఆనాటి ఆ రూపమా చక్రవర్తి హృదయాన ముద్రివేసికొన్నది. ఆ ప్రేమలత నానాటికిఅభివృద్ధి చెందింది ఇరువురి హృదయాలను పెనవేసుకొన్నది.

అక్బరు తనఅదృష్టాన్ని వెదకుతూ వెళ్ళిపోయినాడు. ఢిల్లీలో స్థిరపడ్డాడు. మొగలు సామ్రాజ్యపు పునాదులు గట్టిపడినాయి.

బైరాంఖాన్ అక్బరు సంరక్షకుడు. అతని భుజబలము పరాక్రమము, ధైర్యశౌర్యాలే మొగలు రాజ్యము నిలవడానికి, అక్బరు చక్రవర్తిగా మనడానికి కారణభూతమైనవి. ఏనాటికీ అక్బరు ఋణం తీర్చలేనంతటి సేవ చేశాడు బైరాంఖాన్.

తన ఉద్యోగులకు చెందిన కాబూలులోని కుటుంబాల నన్నింటిని ఇక్కడకు తేవడానికి అక్బరు ప్రయత్నించాడు. భారతదేశమే తమదిగా చూచుకొనుటకే కార్య మవసర మైనది.

అక్బరు చక్రవర్తి ఆజ్ఞతో బైరాంఖాన్ కుటుంబాలను తేవడానికి కాబూలు వెళ్ళాడు.

అక్బరు చక్రవర్తికి అత్యంతసన్నిహితుడుగా మొగలు సామ్రాజ్యానికి మకుటములేని చక్రవర్తిగా భావింపబడుతున్న బైరాంఖాన్ కచట చక్రవర్తివలెనే మర్యాదలు జరిగినవి. అక్బరున కత్యంత ప్రీతిపాత్రుడై అత్యున్నతాధికారమున నున్న వీరుడైన బైరాంఖాఖానునకు తన కుమార్తెనీయ సమకట్టినాడు సలీమా తండ్రి మీర్జానూరుద్దీన్ మహమ్మద్.

సలీమా అందచందములు బైరాంఖానున కామెయందు మోహమును రేకెత్తించినది. బైరాంఖాను సంతోషముగా సలీమాను వివాహమాడుటకు అంగీకరించినాడు.

ఈ వివాహమును తిరస్కరించిన సలీమా మాటలకు విలువలేకుండా పోయినది. బలవంతముగ ఆమెను ఒప్పించి ఆమె హృదయమునకు వ్యతిరేకముగ నూరుద్దీన్ సలీమాను బైరాంఖానునకిచ్చి వివాహ మొనరించినాడు. ఆ ప్రణయ హృదయమున ప్రళయ సన్నిభములయిన విరోధబీజము లప్పుడే బైరాంఖానుపై నాటపడినవి. అవి త్వరత్వరగా అంకురించి వృక్షములై ఆ హృదయభూమిని వేరుదన్ని నిలిచినవి.

ఈ ప్రేమ వృత్తాంత మెరుగని బైరాంఖాను అంతటి అందగత్తె తన భార్య యగుట అదృష్టముగ భావిసిపోయి నాడు. ఆ అందాల సలీమా తనపాలిటి మృత్యుదేవతగా తన పాణినందుకొనినదని గ్రహింపజాలక పోయినాడు.

రాజకుటుంబమునకు సంబంధించిన వివాహములన్నియు ఆరాజు ననుమతిపై జరుగుటే మొగల్ సంప్రదాయము. తన సేవలను గుర్తించి ఈ వివాహమునకు చక్రవర్తి అనుజ్ఞనీయగలడను ధీమాయే బైరాంఖాను సలీమాను వివాహమొనర్చుకొనుటకు ప్రేరేపించినది, సలీమా బైరాం అంతఃపురాంగన యైపోయినది. ఆమెలో ప్రోదిచేసికొని పెరిగి పుష్పించిన ప్రణయలత ఫలమువిచ్చులోపుగ సమూలముగ పెళ్ళగింపబడి బైరాం పాదఘట్టనల నలిగిపోయినది. మొగలు సామ్రాజ్య పట్టమహిషి కాదగిన సలీమా ఆ చక్రవర్తి సేవకునకు భార్యయైనది.

కాబూలులోని రాజకుటుంబము లన్నియు కదలివచ్చి మానుకోటలో నున్న అగ్బరు చక్రవర్తిని దర్శించినవి.

"జహాపనా! తమ ఆజ్ఞానుసరించి రాజకుటుంబము లన్నింటిని తరలించుకొని వచ్చినాను" బైరాంఖాను ఒక్క క్షణమాగాడు. "నేనొనర్చిన ఒక్క కార్యానికి ప్రభువులు క్షమించగోర్తాను" అతని ముఖంలోకి ఆనందం ఉరకలు వేసింది. ఆ ముఖం వింతకాంతిని సంతరించుకున్నది.

"కావ్ బాబా (అగ్బరు బైరాంకానుకిచ్చిన అధీకార

పడవి) తమరు తప్పుచేయుట నేను క్షమించుటయా? అదికాక ఈ విషయం తెలిసే సమయంలో మీ ముఖంలో వెలిగిన కాంతులు ఆ చేసినది తప్పుకాదని తెల్పుతున్నాయి, ఏమైనా మీరు చేసిన ఆ కార్యాన్ని మేము ఆమోదిస్తున్నాము" అక్బరు అన్నాడు చిరునవ్వుతో.

"తమ అనుజ్ఞలేకుండ వివాహం చేసుకొన్నాను ప్రభూ! దానికిప్పుడు అనుమతిని వేడుకొంటున్నాను. తన కుమార్తె వివాహమచ్చటనే జరుగవలెనని పట్టుబట్టిన ఆ తండ్రికోరిక తీర్చడానికై త్వరపడ్డాను ప్రభూ!"

"వివాహమా! మా కానుకలు లేకుండగనే వివాహాన్ని చేసికొన్నారా? ఆవివాహానికి మేమంగీకరిస్తున్నాము. ఆమె మా రాజకుటుంబానికి చెందిన ఆమెయేనా?" సంతోషంతో అడిగాడు అక్బరు.

"అవును జహాపనా. ఆమె రాజకుటుంబానికి చెందినదే, హుమాయూన్ పాదుషావారి సోదరి పుత్రిక" అన్నాడు బైరాంఖాను.

అక్బరు హృదయం కుతకుతలాడినది.

"ఎవరామె?" సలీమా కాకూడదనే ఆకాంక్షతో అడిగాడు, తన భావిజీవితాన్ని, తన ప్రణయాన్ని ప్రేమను అగ్నిపరీక్షకు పెట్టిన క్షణమది అక్బరుకు, ఆ జవాబుపై బైరాంఖాను అదృష్టంకూడ ఆధారపడిఉన్నది. ఆ చక్రవర్తి,

చక్రవర్తికి అంగరక్షకుడనిపించుకొని ఖాన్ బాబాగా వ్యవహరింపబడుతున్న బైరాం ఒకరికొకరు పరమ శత్రువులు కానున్న క్షణమది.

"మీర్జానూరుద్దీన్ కుమారై జహాపనా" బైరాం ఖాను సమాధానమిచ్చాడు.

"సలీమా!" అరచినట్లే అన్నాడు అక్బరు చక్రవర్తి. వేయి పిడుగులు ఒక్కసారి తనముందు పడినప్పటి వణుకు కలిగింది అక్బరు హృదయంలో. తమ ప్రేమవృక్షాన్ని సమూలంగా పెరికివైచిన రాక్షసుడుగా కన్పించాడక్బరుకు బైరాం. ఆ క్షణంలో బైరాంను హత్య చేద్దామనే తలంపు కలిగింది. ఖడ్గం పైకి చేయిపోయింది.

అతని ఆలోచన మరొకవైపు సాగిపోయింది బైరాం తన రాజ్యానికిప్పుడు అత్యవసరమైన వ్యక్తి. సైన్యమంతా ఇప్పుడతని చేతులలో ఉన్నది. తాను స్థిరపడేవరకు అతనిని చెనకకూడదు.

హాలాహల సమమైన హృదయాన్ని లోలోన దహిస్తున్న క్రోధాన్ని చిరునవ్వుమాటున అణచిపెట్టాడు అక్బరు. ఆ గుణమే అతన్ని చక్రవర్తిని చేసింది. అది ఆరిపోయే అగ్ని కాదు. ఎప్పుడో ఒకప్పుడా అగ్ని భస్మం చేస్తుంది.

ఖడ్గంమీది చేతిని కైజారుపైకి పోనిచ్చాడు అక్బరు,

"ఖాన్ బాబాజీ! తమ వివాహానికి పారితోషికంగా ఈ కైజారును తమకు బహూకరిస్తున్నాను" అంటూ వజ్ర

లం తాపిన తన కైజారును బైరాంఖానుకు బహూకరించాడు అక్బరు.

ఆనందంగా స్వీకరించాడు ఖాన్ బాబా.

అది అత్యున్నతమయిన బహుమానంగా అచ్చటి వారికి గోచరించి బైరాం అదృష్టాన్ని కొనియాడారు వారు.

అదే అతనికి తాను బహూకరించిన మృత్యువుగా తలపోశాడు అక్బరు.

ఆనాటినుండి అక్బరుకు దూరమైనాడు బైరాంఖాన్ తార్ధీబేగ్‌ను చంపినప్పటినుండి బైరాంఖానుకు శత్రువైన మాహాం అనా — అక్బరు హృదయమును చలింప జేసినది.

అక్బర్ ఈ విషయము అనాగాకు చెప్పి దుఃఖించినాడు, బైరాంఖానుపై ఆతని ద్వేషమును రగిల్చినది అనాగా. ఆమె ఒకనాడు సలీమాను అక్బరు వదకు కొని వచ్చినది.

"సలీమా!" అక్బరు పిలిచినాడు ఆ యువకుని కంఠమున దుఃఖము గూడుకట్టింది.

"స్వామీ!" అంటూ అతని పాదాలను చుట్టుకొని దుఃఖించినది సలీమా.

ఆమెను ఓదార్చటం అక్బరుకు వశం కాలేదు.

"ప్రభూ! ఒక్క కోరిక" అన్నది సలీమా.

"ఏమిటది సలీమా!"

"నన్నాతోడేలు బారినుండి తప్పించండి లేక నన్ను

మీ ఖడ్గంతో మరణించనీయండి. ఇంతకన్నా నాకే కోరిక లేదు అక్బర్" అన్నది సలీమా.

"నాకు మాత్రమిది దుఃఖకారణం కాదా సలీమా! నా హృదయంలో చెలరేగే దావాగ్ని జ్వాలలు నీ కర్థం కావు. అవి మనకు తీగని అపచారం చేసిన ఆ పిశాచిని దహించక మానవు.

"ఆ సమయం వచ్చేసరికి నేను మరణిస్తానేమో ప్రభూ?" సలీమా తన అనుమానం వెల్లడించింది.

అక్బరు నవ్వాడు. అది క్రోధం మిళితమై అతని హృదయంలోని ద్వేషానికి ప్రతీకమైన నవ్వు.

"నీ వేమీ దుఃఖపడకు సలీమా. కొద్దికాలంలోనే అక్బరు అంతఃపురానికి చేరుతావు."

"నాకు అంతఃపురాలు రాజభోగాలు అవసరంలేదు. అక్బరు పాదాలదగ్గరమాత్రమే చోటు కావాలి నాకు. ఆ వాగ్దానాన్ని పదిలంగా హృదయంలో దాచుకొని ఆ సమయము కొరకు నిరీక్షిస్తాను" అన్నది దుఃఖంతో సలీమా.

అక్బరు వాగ్దానం చేశాడు. అతని కాళ్లనుండి విడివడి బైరాం అంతఃపురం చేరింది సలీమా. తుచ్ఛమైన కామానికి లోనైన క్షుద్రహృదయాలు. అల్లాసాక్షిగ వివాహమాడిన భర్తను ద్వేషించిన స్త్రీని ప్రేమించాడు అక్బరు.

మానకోటలో ఆదంఖాను అక్బరు గారవార్థమై

ఏనుగుల పోరాటము కల్పించినాడు, బైరాంఖాను అస్వస్థతగా గుడారమునందున్నాడు. పోరాడు ఏనుగులలో నొకటి భయపడి ఆ గుడారముపైపు పారిపోయి వచ్చినది. ఆదం ఖాను ప్రేరణతో రెండవగజము నటునైపు మరలించినాడు మావటి. మొదటి గజము బైరాం డేరాను కొంత చిందర వందర చేయగా బైరాం భటులు దానిని తరిమివైచినారు.

దీని నవమానముగా భావించిన బైరాం అగ్బరునకు తన తీవ్ర నిరసనను తెల్పినాడు.

మాహం అనాగా ఒకనాడగ్బరును దర్శించినది.

"జహాపనా!" దీనముగా పిల్చినది అనాగా. ఆమె ప్రభావము అప్పటికి అగ్బరుపై బాగా పనిచేయుచున్నది.

"నాకు మక్కాకు పోవుట కనుజ్ఞ దయచేయండి ప్రభూ" అన్నది అనాగా.

అగ్బరు ఉలికిపడినాడు.

"అదేమి అనాగా! ఈ విపరీతపు కోరిక యేమి!"

"నాకీ దుర్భర జీవితము గడుపుట కష్టమైనది ప్రభూ! ఇచ్చటి అభిమానరహిత జీవితముకన్నను మక్కాలో ప్రశాంత జీవితము గడపుటకు వాంఛించుచున్నాను."

"అగ్బరుపై అధికారమున్న అనాగా ఈ రాజ్యమున దుర్భరమైన అవమానాలను పొందుతున్నదా? నిన్నవమానించి ప్రాణములమీద ఆశ వదలుకొన్న మూర్ఖుడెవ్వడు అనాగా?"

"అతడు మీకును నాకును కడకు తల్లిగారికిని శత్రువే అధికార దాహముతో అంగలార్చే ఆ సాహసి ఎప్పటికేమి చేయగలడో అనూహ్యము."

అగ్బరు కర్థమైంది,

"అతడిప్పుడేమి చేయగలిగాను?" ద్వేషం నిండివుంది ఆ పలికిన భంగిలో.

"అనాగాను బంధించి చిత్రవధ చేయించుమన్నాడట."

"నిజమా అనాగా?" ఆశ్చర్య క్రోధాలు పెనవేసుకొన్న వా ప్రశ్నతో.

"షంషుద్దీన్ మా అక్కతో అనినాడట. ఆమె ఆదంతో చెప్పిపంపినది. వాడు ప్రతీకార మొనర్చెదనను చున్నాడు."

"ఆదంఖాను నెందులకు అతని యిష్టమునకు వదలి వేయరాదు?" అగ్బరు ప్రశ్నించినాడు.

"జహాపనా! సైన్యములాతని అధీనమైనవున్నవి, అధికారమంతయు అతని హస్తగతము. ఉద్యోగులాతని దాసానుదాసులు. అతనిపై కత్తి నెత్తువాడా ఆదం? రాజ్యము నేలుచున్నదిప్పుడు అక్బరుకాదు. అగ్బరిప్పుడు బైరాంఖానాట్లాడించిన ఆట్లాడెడుబొమ్మ. ఈ మొగలు సామ్రాజ్యమునకు సర్వాధికారి బైరాంఖాను, ఖాన్ బాబా!"

"అనాగా!" పెద్దగా అరచినాడు అగ్బరు.

త్తమబహుమానమని తమతో సంగినది. నే సేనాడును తమ యెడ అవిశ్వాసముగ ప్రవర్తించలేదు. నాపై తమరు కలిగిన ఆగ్రహము నా దురదృష్టము. దీనికి కారకు లెవ్వరో నే నెరుగుదును. స్త్రీ కపటోపాయములకు లోబడి విశ్వాసియై మిమ్ము కొల్చిన సేవకుని అవమానించి పంపుట ధర్మము కాదు."

"ఇందమర్యాద యేమి బైరాం ఖాన్! నీవు కోరిన కోరిక దీర్చినాను" అని నాడక్బరు.

"నా కన్నియు తెలియును ప్రభూ! నాపై ద్వేష భావమును వదలి నన్ను మిత్రునిగా మక్కాయాత్ర కనుమతింపుడు. అంతియే నే కోరినది" విచార ద్వేషములు పెన వైచుకొన్న వా మాటలలో.

"నాపై తమ కన్యాయాగ్రహము కలిగించిన వ్యక్తులు నా యాత్ర పూర్తియగు లోపలనే ఫలితము ననుభవింపగలరు. పూర్తి రాజభక్తి కలిగిన సేవకుడుగా అల్లాపై ప్రమాణ మొనర్చి చెప్పుచున్నాను" ఆగ్రహ మాతని లోగొన్నది. బైరాంఖాను అన్నాడు.

అతడు మక్కాకు వెళ్ళుటకు బయలుదేరినాడు. సలీమా అతనితో పోయినది.

బైరాంఖాన్ మరణమును కోరినది అనాగా.

అతడే విధముగ తిరుగుబాటు నడుపకుండుటకు అతని వెనుక నొక సైన్యమంపుట శ్రేయస్కరమని తెల్పినది అనాగా. పీర్ మహమ్మదు అందులకు తగినవాడని తెల్పినది.

పీర్ మహమ్మద్ బైరాంఖాను సేవకుడు అతని ప్రాపున మొగలు సేనాపతియగు నాతడు బైరాం ఖానును గాంచినప్పుడెల్ల అతని పూర్వాశ్రయము జ్ఞప్తికి వచ్చును. అది యాతని హృదయమున కలత చేయును. ఆ కలతయే ద్వేషముగా మారినది. ఆ ద్వేషము హద్దులు మీరినది.

బైరాంఖాను ననుసరించుట కక్బరు పీర్ మహమ్మదును నియమించినాడు.

పంజాబు కరిగిన బైరాం తన సేవకుడే తన నదుపు చేయుటకై వచ్చుచుండెనను వార్త వినినాడు.

అక్బరుపై అతని క్రోధము అసలు కొట్టినది. క్రోధమనునది మానవునందలి మంచిగుణములు హరించును. బైరాంఖానుతనకండుబాటులోనున్న స్నేహితులతో తిరుగుబాటు నొనర్చి తనపై వచ్చుచున్న పీర్ మహమ్మద్ నెదుర్కొనినాడు.

ద్వేషపూరితుడై వచ్చినాడే కాని పీర్ బైరాంఖానున కెదురు నిలవగల్గినాడా! ఓడి పారినాడు పీర్ మహమ్మద్ వలీబేగ్ ఓడిపోయి ఖైదీయైనాడు.

అక్బరుకోరిన దదియే. అనాగా కోరికకూడ అదియే. తిరుగుబా టొనర్చిన బైరాంఖానునకు మరణశిక్షయే.

అక్బరుసైన్యముతో పంజాబు చేరినాడు.

బైరాంఖాను స్నేహితులాతని తిరుగుబాటుకు ప్రోత్స

హించినారు. నలుబదివేల సైన్యమాత్రని వెనుక నున్నది. కాని రాజభక్తుడైన బయిరాంఖాను అక్బరును శుపమాణ కోరినాడు. అతడు మక్కాకు పోవుటకు తిరిగి అనుజ్ఞ పొందినాడు. అతని ప్రభుభక్తి అక్బరు ద్వేషహృదయము నొకింత కదిలింపకపోలేదు, కాని సలీమా అతని వెంటనున్నది.

అక్బరులోని కామపిశాచి వేయినాల్కలు జాపినది. సలీమా బేగం తనదికావలయును. అందులకొక్కటే మార్గము. అది బైరాంఖాన్ మరణం. కృతఘ్నుడు తానెక్కివచ్చిన తెప్పను తనను రక్షించిన తెప్పను తగులవైచినాడు. సామ్రాజ్యపు ఉన్నతి దక్క అన్యము ఎఱుగని నిస్వార్థ సేవ ఒకవైపు మోహపు వాగురలలో చిక్కి ధర్మాధర్మముల నాలోచించజాలని స్వార్థము ఒకవైపు. దుర్మార్గమునకే బలము బయిరాంఖానును చంపించుటకు నిశ్చయించుకొని నాడాతడు.

అక్బరునకు నమ్మినబంటు సికందర్ కలమాగ్. సర్వ దుర్గుణములు మూర్తీభవించిన మానవుడాతడు. కాని అక్బరుపై ఆతనికి ప్రేమ. అతడు చిన్నతనపుస్నేహితుడక్బరునకు. బయిరాంఖానును హత్య చేయుట కాతడు నియమింపబడినాడు. బయిరాంఖాను వివాహం బహుమతిగా నిచ్చిన కయిజారు కల్మాగ్ పొందినాడు.

నాగుపామువంటిది అనాగా. పంజాబులోని లోహానికి కబురంపినది. అక్బరునుండి రక్షణకు గుర్తుగా కల్మాగ్ ముబారక్ లోహానీని కలిసినాడు.

కొద్ది మంది పరిజనులతో సహస్ర లింగతటాకమును తిలకించుచున్న బయిరాంఖానుపై ముబారక్ లోహాన తన పరిజనులతో దాడి నొనర్చినాడు.

నిస్వార్థముగ సేవనొనర్చి రాజాభ్యున్నతికి తోడ్పడిన బయిరాంఖాను అక్బరు మోహపిశాచికి బలియైనాడు. అనాగా నాగుపాము పగకు ఆహుతియైనాడు.

బయిరాంఖాన్ పాలిట మృత్యుదేవత సలీమాబేగం పాలిట ఆనంద చంద్రికయై అంతఃపురమున చేరినది.

జీవితపు వెనుకటి పుటల నొక్కసారి పరికించి నిట్టూర్చినా డక్బరు. ఇవి తానొనర్చిన ఘోరదుష్కృత్యమా!

# 6

But see Badaoni. Jr. Lower II 58.59. where he insinuates that the attempt to assasinate was in connection with Akbar's desire to marry the wife of one Abdul wasi whom he had compelled to divorce her.

Smith following Badaoni also holds that the attempt at his assasination was due to Akbar having tried to marry certain ladies belonging to Delhix families and the Royal invasion on the honour of these families.

Akbar the great Mughal
Page 65
By V. Smith.

"కల్ మూగ్!" ఆలోచనలో నుండి తేరుకొనిన అక్బరు పిలిచాడు.

నేలకంటు మొక్కి నిలచాడు కల్‌మాగ్.

"తెలియదు ప్రభూ !"

"అతని భార్య గుల్‌నార్ చాల అందగత్తె" అని నాడు చిరునవ్వుతో.

కల్‌మాగ్ కూడ కొద్దిగా నవ్వాడు. అర్థమైనది అతనికి.

"వాసీ ఉజ్‌బేగ్‌లలో వాడు జహాపనా!"

అతనిభావం అర్థమయింది అగ్బరుకు.

"మన్‌సబ్‌దారుడే కాతాడు. అప్పటికి లొంగడా!" కుటిలమయిన నవ్వు అతని ముఖంపై మెరసి మాయమయింది.

"అతను కాదంటే గుల్నారును కీత మందిరానికి చేర్పించు కల్‌మాగ్"

"జహాపనా!" ఆగాడు కల్‌మాగ్.

ఏమిటి అన్నట్లు చూచాడు అగ్బరు.

"రాజధానీ నగరం అట్టుడికినట్లు ఉడికిపోతున్నది" కల్‌మాగ్ వినయంగా చెప్పాడు.

"ఏ విషయంలో!"

"యమునానదీ తరంగాలమీద తేలివచ్చే స్త్రీల శవాలవిషయంలో" కల్‌మాగ్ అన్నాడు.

అగ్బరు అదరిపడ్డాడు.

"ఏమనుకొంటున్నారు? ఎవరి ననుమానిస్తున్నారు!" ఆతురతతో అడిగాడు అగ్బరు.

"ఒకరినేమిటి ప్రభూ! అది పాదుషావారినికూడ అనుమానించడం వరకు పోయింది. కాని అనుమానం ఎక్కువగా ఒకరిద్దరు వజీర్ల మీద నిలచిఉంది. వారిలో ఆసఫ్ ఖానుకూడ ఒకరు."

బలవంతముగా కొనిరాబడిన స్త్రీలు బయటకుపోకుండ అక్బరొనర్చిన పైశాచిక కార్యమది. తానుకోరిన యువతిని కల్ మాగ్ ఇతరులకు తెలియకుండ కొనిరావడం, అక్బరు తన మనసు తీరువరకు ఆ స్త్రీని అనుభవించి యమునానదీ జలాలలో త్రోయించుట జరుగుచున్నది.

దాని నితరు లెరుగరు. అనాగావంటి అంత:పుర కాంతలెరుగుదురు. మార్యమ్ - ఉ-జమాని ఎరుగు నీ విషయము. చివరకీ విషయమే సలీమున కామె తన విషాద వైవాహిక జీవితము తెల్పునపుడు పుత్రుడు సలీమునకు తెల్పినది. ఈ పైశాచిక కార్యమే సలీమున కాతనిపై ద్వేషముగా మార్చినది.

"ఈ విషయమింతటితో అంతమొందించుట మంచిది ప్రజలలోనిది పాకరాదు," ఆలోచనగా అన్నాడు అక్బరు.

"వాసీ నొకపర్యాయము నా దర్శనమునకై పిలిపించు" అనుచు అక్బరాతనకీ కొన్ని బంగారు నాణెములొసంగినాడు.

అబుల్ వాసి పిలిపించబడినాడు.

వినయముతో సలామొనరించినాడు వాసి.

"అబుల్ వాసీ! రాజధానిలోని కల్లోలమును విని నావా?"

"ఏకల్లోలము జహాపనా?"

"యమునానదిపై తేలివచ్చు కళేబరముల విషయము. నీవు యమునానది పరిసర ప్రాంతముల కొత్వాలవు కదా?

"ఆ విషయమును వినినాను ఆ శవములను చూచి నాను. అవన్నియు అందమయిన స్త్రీల శవములు. నగల కొరకు చేయు దుర్మార్గమా? ధరించిన నగలలో నొక్క-టియు దొంగిలింప బడుట లేదు. హిందువులూనర్చు దుర్ణయ మనిన వారిలో హిందూ స్త్రీలే ఎక్కువగా మరణించుచు న్నారు. అది ప్రతిదినము జరుగునది కాదు. ఎట్లు జరుగుచు న్నదో ఊహింప తరముగాకున్నది. అందమయిన యువతులు పాలిట నదియేదో శాపముగా నున్నది."

"మరి యింతవరకు ఈ విషయము నాదృష్టికేల కొని రాలేదు?" అక్బరు ఆగ్రహముగ ప్రశ్నించినాడు.

"నగరపాలకున కనేక పర్యాయములు విన్నవించి నాను. అంతకన్న నేను చేయగల్గినదే మున్నది!" వాసియని నాడు.

"ఇంతవరకీ విషయమై యొచూకి, తీయబడకుండుట రక్షణోద్యోగుల అసమర్థతగా మేము భావించు చున్నాము," అక్బరనినాడు.

"ఇందు మంత్రులు సేనాపతులున్నారని తోచు

చున్నది. ప్రభువు అనుగ్రహించిన ఈ అపరాధిని నిర్ణయింపగలను. కాని వారిని బంధించుటకు నాకు అధికారము కావలయును ప్రభూ;" వాసి యడిగినాడు.

"ఆ యధికారమును నీకు మేమీయగలము. వాసీ! ఒక్క విషయము" అగ్బరొక క్షణమూగినాడు.

"నీవు మన్ సబ్ దారు కాగలవు." అగ్బరనినాడు. అతని ముఖము గంభీరమైనది.

"తమకరుణ అపారముప్రభూ" సంతోషముగా అనినాడు వాసి.

"అందులకు నీవు కొంతమూల్యము చెల్లించవలయును" అగ్బరనినాడు.

"ఈ దేహమూ ప్రాణముతమ సేవకొరకే వినియోగింపబడునవే" వాసి నినాడు.

"నీభార్య గుల్ నార్ ను నీవు వదలివేయవలెను" అగ్బరనినాడు.

శిరముపై వజ్రాఘాతమైనట్లైనాడు అబుల్ వాసి.

"అది నీ అదృష్టము. నీవు జాగీర్ దారు వయ్యెదవు గుల్ నారు జనానాలో చేరిపోవును!" అగ్బరనినాడు.

"గుల్ నార్ నా ప్రాణమునకు ప్రాణము జహాపనా! ఆమెను వదలి నేను బ్రతుకుట దుర్లభము" వాసి యనినాడు.

"నీ ప్రాణమే పాదుషా సేవకొరకు ఇక ఎదురాడి మమ్ము నొప్పించుటకూడదు" అగ్బరాజ్ఞాపించినాడు.

"లేదు జహాపనా! ఆమె నను వదలిన జీవించదు. చిన్న తనమునుండి మమతలతో పెనవేసుకొనిన జీవితములు మావి. మమ్ము విడదీయుట ప్రభువులకు ధర్మముగాదు.

"ఇందు ధర్మాధర్మములు ప్రసక్తిలేదు. మేము నడచినదే ధర్మమార్గము రెండు దినములలో నీ వామెకు విడాకు లీయవలెను. అది ఉల్లంఘించుట మృత్యువుతో చెలగాటము."

కాముకుడేం కార్యమొనర్పజాలడు ! కామపిశాచిచే ఆవహింపబడిన అధికార మదోన్మత్తున కెదురేది?

జీవచ్ఛవమై ఇల్లు జేరినాడు వాసి.

గుల్నార్ ఆ వసివాడిన తన ప్రియుని ముఖముగాంచి ఏదియో జరిగిపోయినదని ఊహించినది.

"పాదుషా వారెందులకు పిలచినాడు!" గుల్నార్ ప్రశ్నించినది. పాదుషా పేరువినగనే అతనిలో అణచి పెట్టబడిన క్రోధము పెల్లుబికినది.

"వాడొక నీచుడు" పెద్దగా అరచినాడు వాసి, గుల్నార్ పై ప్రాణము పైననే పోయినది.

అతని నోటిని తనచేత మూయుచు "ఎవ్వరైన వినిన మనతలలు తెగిపోవును దైవమానుడైన అక్బరు పాదుషా కెట్లు నోరువచ్చినది" గుల్నారనినది.

ఆమె అమాయకత్వమున కాతని నవ్వును ఏడ్పును కలసివచ్చినవి.

"దైవసమానుడే నీపాలిటి పెద్దపులియై నీ శీలమును హరింపకాచియున్నాడు.

"ఆ" యని నిర్విణ్ణయైనది గుల్నారు.

"నేను నిన్ను వదలివేసిన జాగీర్ దారు నొసర్చునట. నీ వాతని జనానాలో చేరి మహారాణి కావలయునట ఏభర్త తనభార్య నిట్లమ్ముకొనగలడు?" హుంకరించినాడు హాసి.

ఆమె వాసిని కవుగిలించుకొని వాపోయినది. గడ గడ వణికిపోయినది. ఉన్మత్తయైనది.

"నీవు నన్ను వదలెదవా?" భర్తను ప్రశ్నించినది ఆమె.

"అప్పుడు ప్రాణమునుగూడ వదలవలెను" వాసి అనినాడు. ఆమెకొకింత స్థిమితము చిక్కినది.

"ఇక్కడొక ఘడియయైన నిలచుట శ్రేయస్కరము కాదు" గుల్నారనినది.

"ఎచ్చట కరుగుట?"

"మాయన్న ఢిల్లీలోనున్నాడు, అచ్చటకు పోవుదము"

"అతడుషఫురుద్దీన్ హుసేన్ కొలువులోనివాడుగదా అతడు రాజద్రోహికదా!"

"ఇచట జరుగునదే ద్రోహము. ఇది ప్రజాద్రోహము, మానవద్రోహము. ఇంతకన్న అదియే గొప్పదిగా చూడవచ్చును."

గుల్నార్ ఆలోచన నచ్చినది అబుల్ వాసికి. అతడు ఢిల్లీకి ప్రయాణము కట్టినాడు. తన అన్న కోకాపలాద్‌ను చూడవచ్చునను ఆశ. ఈ అపాయమింతటితో తప్పునను ఆలోచన ఆమెనుత్సాహ పరచినది.

మరునాడుదయమే పయనమై అబుల్ వాసి భార్యతో కోట దాటినాడు.

వాసి గుఱ్ఱముపై నున్నాడు! గుల్నార్ మేనాలో నున్నది. రెండు కోసులరిగినారు వారు.

ఒకగుంపు వారిపై పడినది. ఒకని కత్తిదెబ్బకు వాసి వివశుడై పడిపోయినాడు. గుల్నార్ మేనాను వెంట నిడికొని ఆ గుంపు వెడలిపోయింది.

వాసి తెలివివచ్చి చూచుసరికి గుల్నార్ లేదు. వారిని వెంబడించిన కల్‌మాగ్ గుల్నారును అగ్బరు అంతఃపురము నకు చేర్చినాడు.

శారీరకమైన గాయములనుమాన్పుకొనుటకు వాసి వెనుదిరిగినాడు. ఈమానసిక గాయము మాన్పదగి నదిగాదు. నాల్గుదినముల తరువాత గుల్నారు శవము యమునాజలము లపై ప్రత్యక్షమయినది.

యమునానదీ జలములపై తేలియాడుచు వచ్చెడు స్త్రీ కళేబరముల కారణమర్థమయినది వాసికి.

ఈ విషయమై పరిశోధనకు పూనిన సలీముని కాతడన్ని విషయములు వ్రాసిన కాగితమప్పగించి ఢిల్లీకి పారి పోయినాడు వాసి గుల్నార్ అన్నవద్దకు.

ఖోశాఫలాద్ అతి పౌరుషవంతుడు. తన చెల్లెలికి జరిగిన అన్యాయమున కాతడక్బరుపై పగదీర్చు కొనదలచినాడు. తన ప్రభువు షఫురుద్దీన్ వద్ద దీని కనుమతి నందినాడతడు.

సమయముకొరకు వేచియున్నాడా పగబట్టిన కోడె త్రాచు.

అబుల్ మాలి తిరుగుబాటు వినిన అక్బరు తన వేట మానుకొని తన సేనాపతులను మాలిపైకి పంపి అక్బరు ఢిల్లీకి చేరాడు.

అక్బరు తన ఏనుగునధిష్టించి ఢిల్లీ బజారున నరుగుచున్నాడు. మాహాం అనాగా క్రొత్తపాఠశాల ప్రాంతమునకు వచ్చినది గజము. ఫలాద్ ఒక మేడపైఅంతస్థునుండి బాణమొక దానిని అక్బరు కంఠమునకు గురిపెట్టి వదిలినాడు.

అదృష్టమను నదొక్కటుండిన ఎంతటి అవినీతిపరుడయిన ఎంతటి విధర్మి, క్షుద్రుడయిన రక్షింపబడ గలడు.

ఆ అదృష్టమే అక్బరును రక్షించినది, గురిపెట్టిన బాణమాతనికంఠమునకు బదులు భుజమున దిగిపోయినది.

"అబ్బా" యనినాడక్బరు. రాజభటులు అపరాధికొరకు వెదికినారు.

అక్బరు బాణమును తన చేతితో నూడబెరికి వైచి త్వరత్వరగా రాజగృహమునకు వెడలిపోయినాడు. గాయమంత తీవ్రమయినది కాదు. బాణము విషసిక్తము కాకపోవుట ఫలాద్ తెలివితక్కువ తనము.

పలాద్ బంధింపబడి పాదుషా ఎదుటకు కొనిరాబడి నాడు.

అక్బరు కనులెఱ్ఱవారినవి.

“ఎవరు నీవు”

‘నేను షరిపుద్దీన్ హుసేన్ గూఢచారిని’

“నీ యజమానియే నిన్ను హత్యకు పురికొల్పినాడా!”

‘అతను కాదు’

“మఱెవ్వరి హత్యకు నిన్ను నియోగించినారు”

“పరమనీచుడయి, పరస్త్రీల శీలముల నపహరించి అనుభవించు అక్బరు నన్ను హత్యకు పురికొల్పినాడు” పలాద్ అరచినట్లనినాడు.

లోపలి భయమును బయటకు కన్పించనీయలేదు అక్బరు.

“నీవు పొరబడియుండవచ్చును. సేవకులనందర నావల కంపినాడు. అక్బరు కల్మాగ్ ఖడ్గపాణియై బంధితుని ప్రక్కన నిలిచాడు.

“నావలన నీకేమపకారము జరిగినది!” అక్బరు ప్రశ్నించినాడు.

“నా చెల్లెలు నీమూలమున శీలము కోల్పోయినది. ఆమె ననుభవించిన నీవు ఆ సౌందర్యవతిని కనికరించి అంతఃపురమున నయిన చేర్చలేదు” అతడు ప్రాణములపై నాశ వదలినాడు.

“అక్బర్! నీవు హృదయములేని రాక్షసుడవు. మానవుం

A number of Brahmins] who dedicated their lives in devotion and service of the idol refused to leave the temple or to think of flight; they were killed by the invaders. Two hundred black cows in the temple, were butchered by some of the Turks in the army of Quli Khan. In their fanatical frenzy" they took their boots and filled them with blood and cast it up on the roof and walls of the temple". The sacrilage roused the indignition of even Badaoni who says that "So many Brahmins, sojourners in the temple were killed that both friends and strangers heap a thousand thousand of curses on the head of Birbal, who reckoned himself a saint among Hindus"

Akbar by Justice
J. M. Shelot
Page 118

అక్బరులో భయమెక్కువైనది. తానొనర్చిన ఘోర కృత్యము లొక్కొక్కటి అతని కనులముందు మెదలుచుండుట అతని అంతరాత్మ అతడొనర్చిన అపరాధములకై పరిదేవన మొనర్చుటగా భాసించుచున్నది.

క్షణక్షణ మాతని కనుల ముందేదో ఓ ఘోరదృశ్యము కనిపించును. ఆదృశ్యమును గూర్చి విషయమును అంతరాత్మ యెత్తిచూపి ఆతనిని హేళన చేయును.

ఆ ఘోరకృత్యమున ఆహుతులైన వ్యక్తులాతని

ముందు నిలచి తమకు జరిగిన యన్యాయమునకు ఆతని బెదిరించి శపించుట కన్పించును.

మరణమెప్పుడు వచ్చునో తెలియదు కాని అగ్బరు మరణయాతన నిప్పుడే అనుభవించుచున్నాడు.

ప్రభువులైనా చక్రవర్తులైనా తామొనర్చిన పాపకార్యముల ఫలితముల ననుభవింపక తప్పదు. మత మేదైనను ఏ దైవమును కొలిచిననూ తమచే నొనర్పబడు ఘోరకృత్యములకు సర్వశక్తియుతుడగు భగవానుని ముందు తమ యపరాధముల నొప్పుకొనక తప్పదు.

తమ సామ్రాజ్య రక్షణమున కని, తమ స్వాతంత్ర్య పరిరక్షణమునకని, తమ భాగ్యభోగములకని ఏ సాకుతో చేసినను అపరాధ మపరాధమే. భయంకర క్రూర కృత్యములు భయంకర ఫలితములనే యొసంగును. అగ్నిని ఏ స్థితిలో స్పృశించినను అది కాల్చక మానదు.

సర్వసముడగు భగవానునికి అతని బిడ్డలగు మానవులందరు సమానులే. అందు తర తమభేదములు లేవు. ధని కులం, పేదల వివక్షతలేదు. పాదుషా గులాములు తారతమ్యమంతకంటే లేదు. వారొనర్చిన పాపపుణ్యముల ఫలితములు సమముగనే పక్షపాత రహితముగనే నాతడందరకం దియ్యగలడు.

కన్నుమూసిన వచ్చిన యాలోచన కంటిముందు దృశ్యమగుచున్నది, అగ్బరుపాదుషాకు. అతడిప్పుడు తోడు

లేని ఒంటరి జ్యోతి. భారతభూభాగములో కాబూలువరకు ఎదురులేక వీరచ్ఛత్రముగ పరిపాలించిన ఆ చక్రవర్తి ఇప్పుడు సానుభూతి చూపుటకొక్క ఆత్మీయుడైన లేని యనాథుడై తన గతజీవితపు భయంకర సంఘటనల నెమరువైచుచు పరిదేవన మొనర్చుచున్నాడు.

అగ్బరు కన్నులయెదుట పొడకట్టిన ఒక దేవాలయము.

అది నాగరకోటకు బయటనున్న అతి ప్రాచీనమైన ఆలయము. మహామాయా దేవాలయము. అతి ప్రాచీనమైనది.

ఆ దేశ హాహాకారములు. రాజపుత్రుల వీరహుంకారములు. వేలకొలది బ్రాహ్మణ భక్తుల దీన పరిదేవనములు ఆర్తనాదములు. మరణ యాతనాయుత మానవ కంఠస్వరములు. అబలల ఆర్తనాదములు.

అవేమి, అవి కపిలగోవులు, భారతభూమిని హిందూ ప్రజ లత్యంత పవిత్రముగ భావించి, పూజించు గోమాతలు, ఆలయమునకు చెందిన పూజ్య గోగణము రెండువందల గోవులు.

మహమ్మదీయ సైన్యము, ఆవులనుమాత్రము చెండి వేయుచున్నారు. గో రక్తము, గోమాంసము ఆలయము నలుమూలల విరజిమ్మబడుచున్నది. లోహిము ఖలీఖాన్ ఖడ్గహస్తుడై వికటముగ నవ్వుచున్నాడు. ఆ గోహత్యల

కాతని సంతోషము మిన్ను ముట్టుచున్నది. అబ్బా! ఆ రక్త ప్రవాహము. దేవాలయమంతయు రక్తపుమడుగున మునిగి పోయినది—

“కులేఖాన్” పెద్దగా అరిచాడు అక్బరు.

దానితో అతడు ఈలోకమున కరుదెంచినాడు.

• • •

ఆ నాడు అక్బరు నాగరకోటకు నాలుగుమైళ్ళ దూరమున సైన్యముతోనున్నాడు.

“రాజమహేశదాస్!”

మహేశదాసు లేచి మ్రొక్కినాడు.

“మహేశదాస్! ప్రపంచంలో ఇన్ని మతాలుండా లంటావా?” నవ్వుతూ అక్బరు అడిగాడు.

“తప్పక ఉండాలంటాను; హా ప్రభు” మహేశదాస్ అన్నాడు

“ఇన్ని ఎందుకుండాలి? ఒక్కటే మతమైతే చాలదా?” అక్బరడిగాడు.

“వివిధములైన భావాలు కల్గిన మానవులున్నారు ప్రపంచంలో, వారు సర్వశక్తియుతుడైన భగవంతుని వారి వారి భావనల కనుగుణంగా వారి యిచ్చవచ్చిన పేరు

లతో ప్రార్థనలు చేసికొంటారు, తమ కోరిన పేరుతో ప్రార్థించిన కోరిక సఫలం కానప్పుడా దేవుని వదలి మరొక పేరుతో మరొకమతంలో నున్న ఆ దేవుణ్ణి ప్రార్థిస్తారు"

అగ్బరుకా సమాధానానికి నవ్వు వచ్చింది.

"వివిధమతాలవలన ప్రపంచ చరిత్ర ఎట్లా తారుమారై కలుషితమైనదో కన్పించటం లేదా?"

"మతాలమీద అమాయక ప్రజల విశ్వాసం అచంచలమని చరిత్రననుసరించే మనం తెలిసికొనికూడ అదే సమస్యను పునఃప్రజ్వలింపజేయడం అజ్ఞానం అంటాను."

"అజ్ఞానం అంటే?" అగ్బరడిగాడు.

"జ్ఞానానికి మొదలు. అంటే అజ్ఞానం చివర జ్ఞానానికి మొదలు. వీటి చివరలెప్పుడూ వెలుగులే" మహేశదాసు అన్నాడు.

"ఇంతకూ మతం అవసరమంటారా మీరు?"

"మతం అంటే విశ్వాసం. అభిమతం అది, వారివారి భావాల కనుగుణంగా ఉండవలసిందే. నా మతమే గొప్పదంటే నా ఇష్టమే గొప్పది అని భావం, ఆ ఇష్టాన్ని ఇతరులమీద రుద్దడం అధర్మం. అన్యాయం. అందువలన మతం అనేది అంతరాత్మ ఇచ్ఛానుసారమే జరుగుతుంది. వారి యిష్టంలేకుండా ఒకరిమతం మార్చటమొకరివశం కాదు."

"ఇప్పుడు జరిగే మతాంతరీకరణలు!" విసుకుతో అన్నాడు అక్బరు.

"ఇవన్నీ శారీరకాలు, భయంతో అల్లా అని నాలిక పలికితే అంతరాత్మ శ్రీరాముణ్ని చూస్తుంటుంది. అది నిజమైన మతాంతరీకరణ కాదు" మహేశదాస్ అన్నాడు.

"మహేశదాస్! మీ భావాలు నాకు నచ్చినయ్. మీ కోక జాగీరు నిచ్చి ఎల్లకాలం మాతోటే గడపేటట్టు చేస్తాను" అక్బరన్నాడు.

"మనం జయించబోయే నాగరకోటను మహేశదాసుకు జాగీరుగా ఇస్తే బాగుంటుంది" అన్నాడు హుసేన్ ఖాన్.

"మంచివిషయం కులీఖాన్. సేనతో నాగరకోటను జయించి దానిని మహేశదాసుకు స్వాధీనం చేయండి. ఈ నాటినుండి మహేశదాసు నాగరకోట జాగీర్దారు" అన్నాడు అక్బరు.

మరునాడు కోటను ముట్టడించే ముందు అక్బరు నాగర్ కోటలోనికి కులీనాయబ్ ను రాయబారిగా పంపాడు.

కులీనాయబ్ వెంట రాజా జయచంద్ నాగర్ కోట మహారాజు అక్బరు సమ్ముఖానికి వచ్చాడు. వివిధములైన బహుమానాలతో. అక్బరాతనికి సరియైన మర్యాద నీయ లేదు.

ఆ రాజపుత్రుడది అవమానంగా భావించాడు.

"జయచంద్! నాగరకోట మా వశం కావాలి" అగ్బరన్నాడు.

"పాదుషావారు నన్ను పిలిపించినదిందుల కేనా! నేను తమతో స్నేహానికే ప్రాధాన్యమిచ్చాను." నా తాహతుకు తగిన బహుమానాలు పంపుతున్నాను" అప్పటికీ వినయంగా అన్నాడు జయచంద్.

"మీ రాకోట మా స్వాధీనంచేసి వెళ్ళిపోవతే" అగ్బ రాతన్ని రెచ్చగొట్టాడు,

"పోవ్మే దెచ్చటికి?" కోపంగా అన్నాడుజయచంద్.

"మీ యిష్టమువచ్చిన చోటికి. కాకపోతే అడవుల లోకి" వెటకారంగా అన్నాడు కులీఖాన్.

"అడవులలో, నగరాలలో మా మనుగడ నిశ్చ యించేది మీరు కాదు అదృష్టం కులీఖాన్! అది తెలిసికొన లేక అజ్ఞానంలోపడి కొట్టుకుంటున్నావు" అన్నాడు జయ చంద్.

"అజ్ఞానం అంటే?" మరల వెటకారంగా ప్రశ్నిం చాడు కులీఖాన్.

"మహేశదాసు జబాబుకు ఈ జవాబుకు దూర మెంత?" అని అనుకున్నాడు అగ్బరు.

"రాత్రి వెంట పగలు లాగా అజ్ఞానానికి జ్ఞానం అను బంధం" అన్నాడు రాజా జయచంద్.

ఇరువురి జవాబులు ఒక్కటేఅనుకున్నాడు కులీఖాన్

"ఈ జవాబుకే మహేశదాస్‌కు మీ నాగర్‌కోట జాగీరుగా ఇచ్చేశాను. అందువల్ల దాన్ని మీరు వదిలివేయాలి" అన్నాడు అక్బరు.

"అజ్ఞానానికి నిర్వచనం ఇవ్వాను మార్చి చెప్పాలో వాలి" అన్నాడు రాజా జయచంద్ కొంచెం కోపంగా వ్యంగ్యంగా కూడ.

"ఏమిటి ?" గద్దించినట్లడిగాడు అక్బరు.

ఒకే ప్రశ్నకు రెండు జవాబులు ఒకే విధమైనవి. ఒక జవాబుకు కోటను జాగీరివ్వడం. అదే జవాబుకు కోటను కోల్పోవడం ఈ నిర్ణయమే అజ్ఞానం. ఈ నిర్ణయం చేసిన వాడు జ్ఞాని ననుకొనే అజ్ఞాని" అన్నాడు స్థిరంగా రాజా జయచంద్.

ఈ జవాబు అహాన్ని దెబ్బతీసింది.

"నీవు పాదుషా స్నేహం కోరి వచ్చినవాడవు కావు." కోపంగా అన్నాడు అక్బరు.

"అవును పాదుషా స్నేహం సామాన్యమైన బంగారం రత్నాలు వజ్రాలతో కుదరదు. ఆ స్నేహానికి అవసరమైన వస్తువులు స్త్రీలు—మా రాజపుత్రవంశం తమ స్త్రీలను మ్లేచ్ఛు కీయరు మా స్త్రీలు మ్లేచ్ఛుల నీడనుకూడ సోకనివ్వరు" అన్నాడు అభిమాని రాజా జయచంద్ క్రోధంగా.

అక్బరు ఆగ్రహోదగ్రుడైనాడు.

"బంధించండి ఈ ద్రోహిని," అరిచాడు అక్బరు.

"అక్బర్! ద్రోహివి నీవు నా కోటను న్యాయంగా నీవు వశపరచుకోలేవు. అందువల్ల స్నేహమనే పేరుతో నమ్మివచ్చిన వాణ్ణి బంధించే క్షుద్రహృదయుడివి. కోటలో నా కుమారుడున్నాడు. ఈ కోట నీవశం కాదు."

"మహేశదాస్ దీనికంతకు ఈ మానవమారణహోమానికంతటికి కారణం నీవు. దీనిఫలితం ఎట్లా వుంటుందో!" అన్నాడు రాజా జయచంద్.

భటులాతని నొక గుడారంలో బంధించారు. కోట ముట్టడి మొదలైంది. సైన్యం కోటగోడలపై కెగబ్రాకేదు విషయమే కాదు. ఆ గోడలకడకు చేరడమే విధంగానో తెలియక తబ్బిబ్బులౌతున్నారు.

"ఎన్ని వంకలైన తిరగగల చీమకూడ ఆకోటగోడ దరిచేరడానికి పడిపోతాననే భయంతో వణకిపోతుంది." అన్నాడు ఆ సైన్యంలో పాటేఉన్న చరిత్రకారుడు బదాని. కులీఖాన్ ఆ ప్రయత్నం మీద కొంత సైన్యాన్ని కోటదగ్గరకు చేర్చగలిగాడు. కోటగోడపై వరుసగా పేర్చబడిన పెద్ద పెద్ద బండరాళ్ళు దొర్లించారు పైవారు-కులీఖాన్ చావుతప్పి తన స్థానానికి చేరాడు. నాగరకోట విలుకాండ్లలక్ష్యశుద్ధికి కులీఖాన్ సేన బలియైపోతున్నది. ఒక రాజపుత్రుని చేతినుండి వెలువడిన ఒక్కొక్క బాణము ఒక్కొక్క మొగలు సైనికుని పొట్టనబెట్టుకొనుచున్నది. కులీఖాన్ ఆలోచించి ఆ దినమునకు ముట్టడిని ఉపసంహరించాడు.

అక్బరు ఆలోచించి కోటలోని యువరాజున కొక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరముతో కులీ నాయబు కోటలోనికిపోయినాడు.

యువరాజు ఉదయచంద్!

ఇచ్చట మీ తండ్రి జయచంద్ మా బందీ. మీ కోట రెండు దినములలో మాకు స్వాధీనము చేయవలయును. తండ్రి బందీయైనను మొగలు సైన్యమును ప్రతిఘటించిన నీ ధైర్యమునకు మేము మెచ్చుకొనినాము. ఈ కోటను స్వాధీనమొనర్చిన నిన్ను మరొక జాగీరు దారునిగా నిర్ణయించగలము. లేక ఈ విధముగనే ప్రతిఘటింప నిశ్చయించిన రెండు దినముల తరువాత మీ తండ్రిని చిత్రవధచేసి ఆ శిరస్సును నీకు పంపగలము. తండ్రి ప్రాణమునో కోటనో దేనిని కాపాడుకొనుటో నిర్ణయించుకొనుము.

—అక్బరు పాదుషా

ఉత్తరమును చదివిన ఉదయచంద్ అయోమయ స్థితియందు పడినాడు. తండ్రిప్రాణ మొకవైపు తమ స్వాతంత్ర్య మొకవైపు. ఏది వదలుకొనుట? తనకు జన్మనిచ్చిన తండ్రి తనను రూపుదిద్దిన మాతృ భూమి దేనిని వదులుటయో అతడు నిర్ణయించుకొనే తరుణము. పితృప్రేమ దేశప్రేమ సంఘర్షణ ఆ యువకుని ఆందోళన పరిచినది.

తన సమాధానమును రేపు వినిపింతుసని కులీనాయబ్ ను పంపినాడాతడు.

గూఢచారి నొకని మొగలు సైన్యమున తన తండ్రి యెచట బంధింపబడినాడో చూచివచ్చుటకై యంపినాడు చీకటిపడుసరికి గూఢచారి వార్త దెల్పినాడు.

మొగల్ సైన్యమునకు వెనుక వైపున దూరముగా నున్న గుడారములో అతడు బంధింపబడినాడు.

ఉదయచంద్ అత్యధిక సాహసన కార్యమునకు పూను కొనినాడు.

తండ్రిని రక్షించుకొనజాలనితనయుడు తనయుడుకాడు. తనప్రాణముచే పణముగబెట్టి తండ్రిని రక్షింపదలచినాడు ఉదయచంద్.

నాగరకోట బయట ఒక క్రోసెడు దూరములోను న్నది, మహామాయాదేవి యాలయము. అది ఒక చిన్న కోట బురుజులు కల్గియున్నది. దేవాలయముఖ మండపము ప్రక్క నొక విఘ్నేశ్వర విగ్రహమున్న గదిలోనే అమ్మ వారి ఆభరణములు విలువైన వస్తువులుంచి తాళము వేయు దురు. ఆ గదితాళములలో నొకటి ఆలయ ధర్మకర్తవద్దను మరొకటి నాగరకోట రాజువద్ద నుండును. కోటవంటి ఆ దేవాలయ ప్రాకార తాళముకూడ నొకటి రాజువద్ద కలదు,

ఉదయచంద్ మెుతికలవంటి సైనికుల నొకవందమంది నెన్నుకొనినాడు. అపాయ సమయములందు తమ్ముతాము రక్షించుకొనుటకు కోటకు రహస్యద్వారము లుండును. అట్టిదే ఒకద్వారము రాజాంతఃపురము నుండి మహామాయా

దే. ఆలయమందలి విఘ్నేశ్వర పీఠము క్రిందికి కలదు. మహారాజుకు మహారాణికి మాత్రమీ విషయము తెలియును. కుమారునితో తల్లి ఎప్పుడో ఆ రహస్యద్వార విషయమై చూచాయగ చెప్పినది.

ఉదయచంద్ తల్లి నగడి ఆ ద్వార విషయము తెల్సి కొని తన నూర్గురు పరిజనులతో ఆలయములోనికి చేరినాడు.

రాత్రి రెండు యామములు గడచినవి. చీమ చిటు కన్న విన్పించు నిశ్శబ్దము. ఈ నూర్గురు పటాలము పదినెవి మిదేదుల ఉదయచంద్ నాయకత్వమున అడవియందలి పెద్ద పులులవలె నిశ్శబ్దముగ నడచినారు. దూరముగా నడచి అడవిలోనుండి జయచంద్‌ను బంధించిన గుడారము వైపు నకు వచ్చినారు.

అప్పుడే పహారావారు మారినారు. క్రొత్త పహారా వారు వచ్చినారు. జయచంద్ సైన్యము నిశ్శబ్దముగ గుడారముపై దాడి చేసినవి. పహారా సైనికులిర్వురు నిశ్శబ్దముగ వధింపబడినారు.

ఉదయచంద్ లోనికరిగి తండ్రిని లేపినాడు.

కుమారుని కంఠస్వరము విన్న జయచంద్ ఆశ్చర్య మే పొందినాడు. ఆ సాహసమున కాతని కన్నులనీరు నిండి నది.

తండ్రిని వెంటగొని బయటకు వచ్చిన ఉదయచంద్ కొద్దిదూరమునన్న మరొక గుడారములోనికి పోయినాడు కొద్దిపాటి బలిజనుంతో. రాజ మహేశదాసును బంధించి తమ వెంట తెచ్చినారు భటులు. వెంటనే జయచంద్ ఉదయ చంద్‌లు మహేశదాసును వెంట నిడుకొని బయలుదేరుసరికే మహారాజనులు కాంచి కేకలువైచినారు. వెంటబడిన మొగలు సైన్యమును దేవాలయమునుండు ఉదయచంద్ నూరుగురు సైన్యమెదుర్కొనినది.

నాగరకోట మహారాజ యువరాజులు మహేశదాసును బందీగా గ్రహించి దేవాలయములోని కరిగి లోపల తలుపులు వేసినారు.

ఇంతలో కులీఖాయబ్ సైన్యములతో నట ప్రత్యక్షమయినాడు. రాజు యువరాజులు దేవాలయములో నున్నారని కులీఖాన్ తెలిసికొన్నాడు. మహేశదాసు బందీయైనాడని తెలిసి అతడు మండిపడినాడు.

మొగల్ సైన్యము దేవాలయముపై ముట్టడి యొనర్చినది. ప్రహరీలోపల ఆ దేవి అర్చకులు మూడువందలున్నారు.

తమ దైవతమునకగు అపచారమున కాబ్రాహ్మణ సమూహము జ్వలించెడు అగ్నులేయైనారు.

చేతికందిన ఆయుధములతో యుద్ధసన్నద్ధులైనారు, వారు మహారాజుకోట లోనికరుగగ రాజపుత్ర సైన్యమును

రహస్య ద్వారమున దేవాలయములోని కంపినాడు. వారు దేవాలయపు గోడల నాక్రమించినారు. ఆయుధ సన్నద్ధులైన మూడువందల బ్రాహ్మణులు దేవాలయమును గర్భాలయ మును కాచుచున్నారు.

కోటవంటి దేవాలయ ప్రహరీ భాగమును రాజపుత్ర సైనికులు కాపాడుచుండుట కులీఖాన్‌కు ఆశ్చర్యక్రోధముల నినుమడింప చేసినది.

తన సైన్యముల నాతడు పురికొల్పినాడు. ఎన్ని హిందూ దేవాలయముల నాశనమొనర్చిన అల్లా కంతటి దగ్గరవారౌదురని వారిలోని మతపరమైన పైశాచిక ద్వేష మును రగుల్కొల్పినాడు కులీఖాన్. మొగలు సైన్యము విజృంభించినది.

దేవాలయమున దాగిన రాజ యువరాజులను హాత మార్చుమైన రాజామహేశదాసును కొని రావలయునని కులీ ఖాన్‌కు ఆజ్ఞాపించినాడు అక్బర్.

దేవాలయముపై ముట్టడితీవ్రతరమయినది. మొగలు సైన్యము దేవాలయపు గోడలవద్ద కదుదెంచుటే దుర్ఘట కార్యమయినది. చివరకు తుపాకిమందు నాశ్రయింపక వారికి తప్పలేదు. చప్టావంటి బల్లలను గోడలవరకు వైచి దాని క్రింద నుండి కొందరు సైనికులు ప్రహరీగోడలక్రింద తుపాకిమందునుకూరి ముట్టడించినారు.

మేఘ గర్జననునుకరించిన ధ్వనితో తుపాకిమందు పేలి

నది. దేవాలయపు గోడ నాలుగుబారలవరకూ కూలిపోయి నది. మొగలుసైన్యమటు ప్రవాహమయినది. ప్రతిఘటించిన రాజపుత్రులు వీరవిహారమొనర్చి తమజీవమునకు తమ నమ్మకమునకు ప్రతీకయిన దేవాలయరక్షణ యజ్ఞమున సమిథలయి వీరస్వర్గమలంకరించినారు. చివరి రాజపుత్రుడు తన చివరి రక్తపుబొట్టువరకు పోరాడి మరణించి నాడు.

ఇక మిగిలినవారు లోపలి దేవాలయమును రక్షించు బ్రాహ్మణులు.

బ్రాహ్మణులను గాంచుసరికి తురకల రక్తము పొంగినది. రక్తము వారిలో పైశాచిక ఆసురీ భావములను ఉద్వృత్తగ పొంగించినది.

సాయుధ సైనికులు యుద్ధమన్న నేమో యెరుగని బ్రాహ్మణులపై బడినారు.

ఆ క్షణమున ఆ బ్రాహ్మణ సమూహమునను ప్రతియొక్కడు ఒక పరశురాముడు. ఒక నరసింహావతారము. చేతికందిన మొగలు సైనికులను చీల్చి చెండినారు.

రాజపుత్ర సైనికులతోడి యుద్ధముకన్న ఈ పౌరోహిత్యభాగుల బ్రాహ్మణులతో పెనగుట యుద్ధములందారితేరిన మహమ్మదీయ సైనికులకు దుర్భరమయినది. ఇటు కొలది మంది యుద్ధమొనర్చుచుండగనే కొందరు మహమ్మదీయ సైనికులకు గోశాలలో కట్టివేయబడిన రెండువందల కపిల గోవులు కంటబడినవి.

"గోహత్య మహమ్మదీయునకు పండుగ, నోరులేని గోవులను ఖడ్గముతో పొడిచిచంపుట వారికి వినోదకార్యము.

గోవులు హిందువుల దైవతము. అతిథి, ఆత్మ, దైవవిగ్రహము. గోవులను భారతీయులు ఈశ్వర స్వరూపములుగా పూజింతురు. హిందువులకు గోదానము, పవిత్రదానము, గోప్రదక్షిణము భూప్రదక్షిణము గోదర్శనము సమస్తదేవతా దర్శనము. భారతీయ ఋషుల పరమధనము గోధనము. హిందువయిన వాడు తన ప్రాణమునయిన పణముగాబెట్టి గోవును రక్షించుకొనుటకు ప్రయత్నింపగలడు. ప్రయత్నింపనివాడు హిందువుకాడు. హిందుగోశబ్దముల సంబంధమది.

ఆ గోవులను సంహరించి ఆమాంసమును భక్షించువారు మ్లేచ్ఛులు.

మహమ్మదీయులా గోవులపై ఖడ్గములతో తలపడినారు. అమాయకజీవులు అంబారావము లొనర్చి వాపోవుచున్నవి.

గోమాంసము ఖండములను, గోరక్తమును దెచ్చి యుద్ధమొనర్చు బ్రాహ్మణులపై గుమ్మరించినారు, గోరక్తమును దాకుట అత్యంత పాపకార్యము. బ్రాహ్మణునకు, ఇంతటి జుగుప్సాకార్యమునకు రోసిన బ్రాహ్మణునకు యుద్ధమునూటమరచుట, మొగలు ఖడ్గమునకు ఎరయగుట జరిగిపోయినది. ఆలవికాని బ్రాహ్మణసైన్యము యుద్ధభూ

మిని వోడిపోయినారు. రెండు వందల కపిలగోవులను మూడు వందల బ్రాహ్మణ సంఘమును ఆనాటి యుద్ధభూమికి మహా మాయాదేవి యెదుట బలియైనారు.

అగ్బరు చెప్పుకొనెడి పరమత సహిష్ణుత ఈ సంఘటనతో రక్తపంకిలమయినది, నిజమయిన పరమత సహిష్ణుడిట్టి కార్యములకు తలపడడు.

లోన బంధింపబడిన దేవాలయము మొగలుసేనలు వశమయినది. కులీఖాన్ తలుపులను బద్దలు గొట్టించినాడు. లోన నేమున్నది? రాజు యువరాజులను బంధించి మహేశదాసును సగౌరవముగ గొనిపోవుదమనుకొనిన కులీఖాన్ ఆశ యడియాస అయినది. వారేమయినారో తెలియక విభ్రాంతి నందినాతడు.

అగ్బరు కావార్త నెఱింగించుటకై కులీఖాన్ స్వయముగ పోయినాడు.

అప్పటికే రాజాజయచంద్ వద్దనుండి జాబును దెచ్చినాడొక చారుడు.

అగ్బరుపాదుషాకు.

మీ సామ్రాజ్య విస్తరణా కాంక్షకు స్వతంత్రముగా ఎవరిజోలియు లేక బ్రతికెను చిన్నరాజ్యములను బలిచేయుట శోచనీయము. నీవెవ్వరి కొరకై ఈ రాజ్యముపై కత్తి దూసితివో ఆమీ ప్రాణస్నేహితుడు మహేశదాస్ మా బందీ. మాకులదేవత మహా మాయాదేవి యాలయమున మీ

సైనికులొనర్చిన సామూహిక గోహత్యలు, బ్రాహ్మణ హత్యలు మా రక్తము నుడికించుచున్నవి. సర్వరాజపుత్ర లోక మీ హత్యలఁగాంచి మీపై కత్తిదూయకమానదు. పరమత సహిష్ణుతయను ముసుగుతో మీరొనర్చు కిరాతక కృత్యములకీ హత్యలు సాక్ష్యములయి చరిత్రలో లిఖింపబడగలవు మీ సాహచర్యమున మహేశదాస్ సంకరుడయినాడు. మహామాయా దేవాలయమున కెట్టి యిక్కట్టు సంభవించినను మీ మహేశదాస్ తలను మీకు కానుకగా పంపగలము ఈకోట ముట్టడినివదలి మీ రాజధానీనగరము మీకు, మీ సైన్యములు చేరువరకు మా భటులు ఏబది మంది మీ వెంటవత్తురు. మీరు రాజధాని చేరినట్టు తెలియగనే మీ ప్రాణస్నేహితుని ప్రాణములతో వదలివేసెదము. ఈ ప్రాణస్నేహితత్వము అసత్యమయిన మాకోటపై ముట్టడి జరుపవచ్చును. మహేశదాసు తలను మీకంపిన తరువాత రాజపుత్రులు సంగరరంగమున మరణించుటకు సంసిద్ధులు. రాజపుత్రుడు మీవలె అసత్యము పలకడు.

ఇట్లు,

రాజా జయచంద్.

ఈ ఉత్తరము అక్బరున కశని పాతమైనది. అతడన్నివిధముల వంచితుడయినాడు. తనకు స్నేహితునిగా బహుమతులు గొనివచ్చినవానిని వంచించి బంధించి చివరకాతనికే లొంగిపోవలసివచ్చుట అక్బరున కవమానమైనది.

కాని చేయునదేమి? తన స్నేహితునకు ఆకోటను జాగిరుగా నిచ్చి బీర్‌బలు అను బిరుదునిచ్చినాడు, కాని జాగీరు లేక అతనికి బీర్‌బలు బిరుదముమాత్రము మిగిలినది బీర్‌బలు బిరుదాంకితుడయిన మహేశదాసును రక్షించుటకొరకు అగ్బరుకోట ముట్టడి నెత్తివేసినాడు మూడు నెలల కాలము న్నాడు బీరబలు ఆకోటలో. ఆ మహారాజు ఔదార్య సాహసములు బీర్‌బలు హృదయమును దోచినవి.

తిరిగి అగ్బరు ఆకోటను వశపరచుకొనుట జరుగలేదు. కాని బీర్‌బలు బ్రాహ్మణ శాపగ్రస్తుడైనాడు.

గుడిపై దాడిజరిగిన మరునాడు నగరకోటలో రాజసభ జరిగినది. సభయందున్నాడు బీర్‌బలు, సభలోని కరుడించినాడు రాజగురువు మహామాయాదేవి ప్రభాంభక్తుడు ఆ ముఖమున బ్రహ్మతేజముట్టిపడుచున, ది.

మహారాజు లేచి నమస్కరించినాడు, ఆశీర్వదించిన రాజగురువు బీర్‌బలువైపు తిరిగాడు.

“మహేశదాస్! ఈ గోబ్రాహ్మణ హత్యలకు నీవు కారణభూతుడవు- ఈ పాపము నిన్ను కట్టి కుడుపక మానదు దిక్కులేక మరణించిన గోవులు మిమ్ము శపించుచున్నవి. నీవును, నీచక్రవర్తియు దిక్కులేని మరణమునే పొందుదురు” అనినాడు.

అతని ఆవేశము ఉపశమించినది.

నెమ్మదిగా యనినాడు రాజగురువు.

"మహేశదాసు! అది మహా మాయాదేవి విన్పించిన శాపవాక్కు" అని వెనుదిరిగి వెడలిపోయినాడా యోగి పుంగవుడు

సభలోని వారందరు నిర్వాక్కులు నిర్విణ్ణులైనారు,

## 8

"When the gates were opened by golden keys" or in other words Akbar corrupted the Khandesh officers by heavy payments—

History of India by Garret & Sitarama Kobili.

The solemn assurances given to him and to the garrison by the Emperor himself did not save him from being dispatched to the fortress of Gwalior as a prisoner. Akbar's act was a complete betrayal of the agreement to which he was party worse it was a breach of solemn assurance he had personally given.

Based on the letters of Fr. Jerome Xavier who was with Akbar at the time it is less partisan and therefore deserving of acceptance. Fr. Xavier's version establishes that the fort was taken by whole sale bribery of the leaders of the garrison.

Akbar by J. M. Shelot
Page 293

"నీవసత్యవాదివి అక్బర్! చేసిన వాగ్దానము నిలువబెట్టుకొనజాలని అల్పహృదయుడవు. తుచ్ఛ సామ్రాజ్య

దాహముతో కోటి మానవుల మోసగించిన అధర్మపరుడవు. దుష్టహృదయుడవు అక్బర్!" ఎవరో అరచినట్లున్న వా మాటలు. అక్బరు చెవులలో మారు మ్రోగినవి.

అవును తాను ఎన్నో వాగ్దాన భంగములు గావించినాడు. అవన్నియు తన సామ్రాజ్యమును నిలుపుకొనుటకై చేసినవి. అసిర్ ఘర్ వృత్తాంతము ఒక్కసారి అక్బరు హృదయమున రెపరెప లాడినది.

రాజా ఆలీఖాన్ ఎదుట నిలచినట్లయినది.

"అక్బర్! అహమ్మద్ నగర యుద్ధమున నీ ప్రాణములు రక్షించినాను"

"అవును రక్షించినావు" అక్బరనినాడు.

"నీవు జయించుకొనుటకు యుద్ధమున నా ప్రాణములు ధారవోసినాను. ఆనాటి యుద్ధమున నేను ఆదుకొనకుండిన నీవీ సరికి యమలోకమున పాలకాపువై యుండెడివాడవు"

"చక్రవర్తిని, సామ్రాజ్యమును రక్షించుట నీ ధర్మము ఆ ధర్మ నిర్వహణమున నీ ప్రాణము లర్పించినావు" అక్బరనినాడు.

"విశ్వాసహీనుడవై నా రాజ్యముపై దాడియొనర్చినావు. అన్యాయముగ నా కుమారుని బంధించి పొట్టనబెట్టుకొనినావు. దయా దాక్షిణ్యములు విశ్వాసములు నీ యందు లేవు అక్బర్! స్వార్థపైశాచిక సామ్రాజ్య దాహమే నీలో మిగిలినది. ఆనాటి నా అబిసీనియన్ సేనాపతి సిద్దీమాలిక్

నిన్నన్న మాటలు నీపై శాపమైనవి. ఆ శాపమిప్పుడు పూర్తిగా వచ్చినది" అనినాడు రాజా అలీఖాన్-

"నిజమే" యనుకొనినాడు అక్బరు.

ఆసీర ఘర్ ముట్టడినాడు!

ఖాన్ ఆజమ్ తన సేనలతో అసీర్ ఘర్ కోటకు నలువైపుల మోహరించినాడు.

షేక్ ఫరీద్, అబుల్ ఫజల్ కూడ ఆ సైన్యమున సేనాపతులు.

కోటలోని మిరాన్ బహదూరు తీవ్రముగ ప్రతిఘటించినాడీ ముట్టడిని.

అసీర్ ఘర్ కోట భారతదేశమున దక్షిణ హిందూదేశమునుండి ఉత్తరమునకు పోవుమార్గమున నున్నది. ఆ కాలమున ఆ కోట భారతదేశమున నొక దుర్భేద్యమయినదిగా ప్రపంచమందలి వింతయైన కోటలలో నొకటిగా పరిగణింపబడినది. సాత్పూరా పర్వతమందలి ఒక శిఖరమున తొమ్మిది వందల అడుగులఎత్తున నిర్మింపబడినదీ దుర్గము, ఆ దుర్గమునకు చుట్టు వెలుపల మఱిమూడు కోటలున్నవి. చివరి ప్రాకారము మాలి తరువాత అంతర్మాలి. మూడవ కోట. కోటి ఈ మూడు ప్రాకారముల జయించి పట్టుకొనిన తరువాతనే అసీర్ ఘర్ ముఖ్యదుర్గమును జయించుట. ఇరువందల యెకరముల భూమిపై ఇది నిర్మింపబడినది. అంత ఎత్తునను చక్కని నీటి సదుపాయములున్నవి. కోటకు

నాల్గువైపుల నాల్గు పెద్ద తటాకములున్నవి. రెండు సంవత్సరములకా కోటలోని నీరు సరిపోవును. తుపాకులు ఫిరంగులు అమర్చుటకు సదుపాయములతో నున్నది ఆకోట.

ముఖ్యదుర్గమున కనుబంధముగ చాల క్రిందుగ నొక దుర్గమున్నది. అదిమాలిఘర్, ఆదుర్గమును జయింపనిదే ఏవిధమునను ముఖ్యదుర్గము అందుబాటులోనికి రాదు.

బహదూరు లోపల తన సైన్యము ముప్పదివేల నుంచినాడు, పదివేల సైన్యము మాలిదుర్గముననున్నది. అబుల్ ఫజల్, షేక్ ఫరీదులు రెండు నెలల ముట్టడితో మాలిదుర్గమును వశపరుచుకొనినారు.

బహదూర్ సేనాపతులలో ముఖ్యులు జియాఖాన్ సిద్దీమాలిక్. అబిసీనియన్ సేనాపతి సిద్దీమాలిక్ వృద్ధుడు, రాజభక్తి పరుడు. రాజా ఆలీఖాన్ కాలమునుండి ఆ రాజ్యమునే కొలిచి విశ్వాస పాత్రుడుగా పరిగణింపబడినాడు.

ఇంతలో అహమ్మద్ నగరమున చాంద్‌బీబీ హత్య చేయబడినది. అహమ్మద్ నగరకోట మొగలలువశమయినది. ఆకోటలో జరిగిన పైచిక కృత్యములు స్త్రీల మాన భంగములు సామూహిక హత్యలు అసీర్‌ఘర్ కోటలోని వారి ధైర్యమును సడలించినవి.

రాజపుత్రుడు సలీమ్ తిరుగుబాటుమొనర్చి బీహార్ ఖజానాలోని ముప్పది లక్షలరూపాయలు వశపరచుకొని ఆ రాజ్యమును వశపరచుకొనినట్లు ఆగ్ఱకునకు వార్త వచ్చె

నది. తిరుగులేని చక్రవర్తిగా చలామణియగుచున్న అక్బరుకీ వార్త హృదయమునే పగిలించినది. తన పుత్రుడే తనకు ఎదురు తిరుగుట, ఇంటనే గెలువజాలని తాను భారతదేశము నంతను జయింపబూనుట హాస్యాస్పదముగ కన్పించినది. ఇచ్చట అసీర్ ఘర్ తో కాలవిలంబన మొనర్చిన ఆ తీవ్రాలోచనా పరుడు సలీమ్ ఆగ్రాకోటపైకి కూడ రావచ్చును. అతనికి తనపై ఎప్పుడూ ద్వేషమే. అది తన దురదృష్టము.



అబుల్ ఫజల్ తో ఆలోచించినాడు అక్బరు. అసీర్ ఘర్ ను వశపరచుకొనుటకు కనీస మొక సంవత్సరమైనను ముట్టడి యవసరమను నిర్ణయమునకు వచ్చినాడు అక్బరు, అబుల్ ఫజల్.



ఏదో వివిధముగ సంధినొనర్చుకొని వెడలిపోవుట మంచిదియనినాడు అబుల్ ఫజుల్.



అక్బరు ఉత్తరమును వ్రాసి సేనాపతి మహాబజ్ ఖాన్ ను రాయబారిగా పంపినాడు అసీర్ ఘర్ కోటకు.

మీరాన్ బహదూర్ మహాబజ్ ఖానును సగౌరవముగ కోటలోనికి ఆహ్వానించి మర్యాదలొనర్చినారు.

మహాబజ్ ఉత్తరమిచ్చినాడు.

రాజా మీరాన్ బహదూర్ వారికి మొగలు చక్రవర్తి వ్రాయు లేఖార్థములు.

మీ తండ్రి రాజా అలీఖాన్ మాకు కూర్చినమిత్రుడు.

అతడు సామ్రాజ్య సేవకు ప్రాణములిచ్చిన విశ్వాస పాత్రుడైన స్నేహితుడు. అతడు అహమ్మద్ నగరయుద్ధమున మా ప్రాణములను కాపాడుట మేము మరచిపోజాలము.

దురదృష్టమున మీరు సామ్రాజ్యవ్యతిరేక కార్యములకు తోడ్పడుట సంభవించినది. దానిని తీవ్రమైన అపరాధముగ మేము భావించుచున్నాము. ఇప్పటికైన మించిపోయినది లేదు. సామ్రాజ్య వ్యతిరేకతను విడనాడి మీరు మా సన్నిధి కరుదెంచి సామంతులుగా నుండుట కంగీకరించిన మీరు క్షమింపబడుదురు. మీకోటను మీ రాజ్యమును మీరే ఏలుకొన వచ్చును. అందులకు మే మనుమతించుటకు మా కెట్టి యభ్యంతరమును లేదు. మొగలు సామ్రాజ్య మెప్పుడును తోటి మహమ్మదీయ రాజ్యముల యభివృద్ధిని గోరును. మహమ్మదీయుల పురోభివృద్ధికే ఈ రాజ్యము స్థాపింపబడినదని గ్రహింపగలరు.

అక్బరు పాదుషా

అక్బరు స్వహస్త లిఖితమైన ఆ ఉత్తరమును అత్యుత్సాహముతో చదివినాడు రాజమిరాన్ బహదూర్. జియాఖాను చదివినాడు దానిని. సిద్దీ మాలిక్ చదివినాడు.

"ఏమందురు సేనాపతులు!" ప్రశ్నించినాడు బహదూరు.

ఇంతకన్న సముచితముగ నవకాశమునకు అసాధ్యకార్యము. నేడో రేపో, మనకోటను వదలుకొన వలసినదే" యనినాడు జియాఖాను.

“మహారాజా? అక్బరు పాదుషా ఈ జాబును మన్నించునా? ఈ వాగ్దానము నెరవేర్చునాయని నా సందేహము” సిద్ధిమాలిక్ అనినాడు.

“స్వహస్తముతో వ్రాసియిచ్చిన వాగ్దానమునే మన్నింపడా సేనాపతీ?” మిరాన్ బహదూరు అనినాడు శంకగ.

“లోకపూజ్యుడైన అక్బరు చక్రవర్తినే వాగ్దాన భంగమొనర్చు వ్యక్తిగా ఊహించు మీ సాహసము మెచ్చదగినది” కోపంతో అనినాడు మహాబజ్ ఖానుడు.

“అట్లూహించుట అపరాధమే. కాని జరిగిన చరిత్ర పునరావృత్తము గాదని నిర్ధారణమేమి?” సిద్ధిమాలిక్ అడిగినాడు.

“కాశ్మీరులోని యూసుఫ్ ఖాను విషయమేమి! లాజా భగవాన్ దాసు వంటివాని చేత పంపబడిన వాగ్దానమును కూడ లెక్కచేయక అతని పుత్రుని బంధింపలేదా? అతని ప్రాణములకు తన ప్రాణమిచ్చెదనని యూసఫ్ కు భగవాన్ దాసు అక్బరు అనుమతితో చేసిన వాగ్దానమును త్రోసిపుచ్చి యూసఫ్ను చంపినందులకు కదా భగవాన్ దాసు దర్బారులోనే తన్ను తానుపొడిచికొనినది. ఆత్మహత్య చేసికొన సంకల్పించినది. రాజా విజయచంద్ విషయమేమైనది?” సూటిగ అడిగినాడు సిద్ధిమాలిక్.

మహాబజ్ ఖానుడు నీళ్ళునమలినాడు.

మిరాన్ బహదూరు మనసు శంకాకళంకితమైనది.

తానిప్పుడే మొనర్పవలయును? అక్బరును దర్శించుటా? ఊరకుండుటా?

"మీరు తిరిగి అసీర్‌ఘర్ కోటకు చేరువరకు నా రక్షణమున నుందురు బహదూరు! మీ కెట్టి ఆపదయు కల్గకుండ కాపాడు భారము నాది" అనినాడు మహాబజ్‌ఖాను.

"అక్బరు నెదిరించి మీరు మా మహారాజును కాపాడెదరా!" తీవ్రముగ ప్రశ్నించినాడు సిద్దీమాలిక్.

"కురాన్‌పై ప్రమాణమొనర్చి తెల్పెదను, నిన్ను నేను కాపాడగలను" అనినాడు మహాబజ్ ఖాన్.

"మీరుకూడ మా వెంటరండు జియాఖాన్" తమ వైపు పల్కిన సేనాపతిని ఆహ్వానించినాడు మహాబజ్‌ఖాను.

మీరాన్ బహదూరు అక్బరును సందర్శించుటకే మొగ్గినాడు.

"ప్రభూ! తమకు అంగరక్షకుడుగా నా కుమారుని ముకారిజ్‌ఖానుని వెంటగొనిపొండు."

బరహాన్‌పూరునందలి అక్బరును దర్శించుటకు మిరాన్ బహదూరు వెలలేని కానుకలను గొనివచ్చినాడు. తనమెడ యందొక తెల్లనివస్త్రము తన లొంగుబాటుకు చిహ్నముగ నతడు ధరించినాడు.

మబహాజ్‌ఖాను మిరాన్ బహదూరును దర్బారునకు కొనివచ్చినాడు.

అక్బరాతనికి స్వాగతమీయలేదు. మిరాన్ బహదూరు హృదయము విచారమున దోగినది.

అక్బరు అప్పటికి స్వస్థతనందినాడు,

"మిరాన్ బహదూర్!" క్రోధోద్వేగమున అక్బరు గొంతుక వణికినది.

"సామ్రాజ్యమును ధిక్కరించునంతటి వాడవా నీవు"

తాను అక్బరు మాయమాటలచే ఎట్లు మోసపోయినాడో తెలిసికొనిన మిరాన్‌ను విచారక్రోధములు పెనవేసికొనినవి.

"నా రాజ్యమెప్పుడును మొగలులకు లోబడలేదు. నేను సామ్రాజ్యమునకు సామంతుడను కాను" కోపముగా ననినాడు.

"ఇప్పుడు నీవు మొగలుపాదుషా బందీవను విషయము తెలిసికొనలేదా?" వికటముగ నవ్వినవాడు అక్బరు."

"ఇది పౌరుషమున్న మగవాడు చేసెడి కార్యము కాదు, స్నేహముగా మెలగుదువను వాగ్దానమొనర్చినావు. వాగ్దాన భంగమొనర్చిన నీవు నిజమగు మహమ్మదీయుడవే కావు. నీలో పవిత్రమగు మొగలు రక్తము ప్రవహించుటలేదు."

"నోరుమూయుము మూర్ఖుడా! లోకపూజ్యుడగు మొగలు పాదుషా యెదుట మాట్లాడుట నేర్చుకొనుము." అనినాడు అబుల్ ఫజల్.

"ఎవరు లోకపూజ్యులు? ఆడినమాటతప్పిదొంగవలె మోసగించువాడా పూజ్యుడు? ఇట్టివారిని సమర్థించు నీవంటి

వారికి సక్రమమగు చావు దొరకదని ఖురాను చెప్పుచు న్నది," అనినాడు బహదూరు.

"బహదూరు! వెంటనే కోట మావశముకావలయును. నీ రక్షణదళ నాయకునకు కోటను వశపరచునట్లు ఉత్తరము వ్రాసి పంపుము" అక్బరనినాడు.

"అక్బర్! నీవు నిజమగు పౌరుష పరాక్రమములు కలవాడవైన నాతో యుద్ధమొనర్చి జయింపుము. నాకోటను నీవశమొనర్చి జీవితకాలము నీకు దాసునగానుందును. నీ వోడితివా సైన్యముతో వెనుతిరిగిపొమ్ము." అనినాడు మిరాన్ బహద్దరు, క్షణక్షణమున కతనిలోని ఆవేశము హెచ్చినది.

"పాదుషాకు పరాక్రమమున్న దొంగదారు లేల వెదకును? లోకపూజ్యుడవైన అక్బరు పాదుషా! నీ కొరకు ఆగ్రానగరమున నీ కుమారుడు సలీము నరకమును సృష్టించు చున్నాడు" అనినాడు నవ్వుచు ముకారిబ్ ఖాను.

ఆ మాటలకు అక్బరు లోలోన వణకిపోయినాడు. ఈతనికన్ని విషయములు తెలియును అనుకొనినాడు. ఈ మాటలకు కొలువంతయు ఆశ్చర్యమే పొందినది.

"నాకీ విషయమెట్లు తెలియునని ఆశ్చర్యమందు చున్నావా పాదుషా! ఇక నాల్గుదినములిటులే నీవు గడపిన నీ రాజధానియే నీకు కారాగారము కాకతప్పదు." అనినాడు ముకారిబ్ ఖాను అదే తీవ్రతతో.

"ఈతడొక ద్రోహి! చంపివేయు డీతని. తలనరికి మారీఘర్ కోటపై శూలమునకు గ్రుచ్చి నిలుపుము" వణకిపోవుచు ఆజ్ఞాపించినాడు అగ్బరు. పైశాచికతత్వ మాతనిలో ప్రకాశించినది.

సేవకులా యువకుని తల వెంటనే నరికివేసినారు. తలా మొండేము బయటకు కొనిపోబడినవి.

"మిరాన్ వెంటనే నీవు కోటను వశపరచకున్న నీకు నదియేగతి సంభవించును" అగ్బరనినాడు.

"అందరము మరణించువారమే అగ్బరు! కొంచెము ముందు వెనక. యిష్టమువచ్చినట్లు చేయించు కొనుము" మాటాడక యూరకున్నాడు మిరాన్.

"బంధించి కారాగారమున త్రోయుడీనీచుని. వెంటనే సేవకు లాతని బంధించి కొనిపోయినారు. అతడు గ్వాలియర్ మృత్యుకారాగారమునకు చేర్పబడినాడు.

"జియాఖాన్!" అతని స్వరము స్వస్థతనంది మృదువుగా ధ్వనించినది:

జియాఖాను నిలచి సలామొనర్చినాడు.

"నీవు వెనుకముందు ఆలోచించగలవాడవు. కోట వెంటనే నా వశము కావలయును."

"సర్వ సేనాపతి ప్రధానమంత్రి సిద్దిమాలిక్ ఉన్నాడు ప్రభూ! అతనొప్పుకొనవలయునుగదా?"

"అత డొప్పుకొనకున్నను నీ వొనర్పగలవు. కోటను

వశపరచి మొగలు చక్రవర్తిదయకు పాత్రుడవు కమ్ము! కోటకు నీవే భవిష్యదధికారిగా నిర్ణయించుచున్నాను.

"జియాదాసు అక్బరువేసిన బంగారు సంకెళ్ళకు బందీయైనాడు. ప్రపంచమున జరుగు ఘోరహత్యలకు యుద్ధములకు, మానవ మారణహోమములకు, ఈర్ష్యాద్వేషములకు, కుట్రలకు కుచ్ఛితములకు కారణమైనవి రెండే రెండు ఒకటి కనకము, రెండవది కాంత. ఈ రెంటికి లోబడనివాడు ఋషి తుల్యుడు.

ఆ కనకమే జియాఖానును అక్బరు బానిసగా నొనర్చినది. తాను పుట్టి పెరిగి తన స్వేచ్ఛా స్వాతంత్ర్యము కాటపట్టగు మాతృ దేశమును తన నింతవరకు పోషించిన ప్రభువును పరులకు బానిసలుగా నొనర్చుటకు ప్రేరేపించినది.

అతడు కోట నే విధముగనైనను వశపరచుట కొప్పుకొని తా నెరుగనంతటి విలువగల బహుమానముల పుచ్చుకొని తిరిగి కోటలోనికి పోయినాడు.

జియాఖాను కోటలోనికి పోవుటతోడనే తనవారితో కలసి మంతనములు జరిపినాడు.

తామిక కోటను మొగలుల బారిని పడకుండ ఆపజాలము. జననష్టము లేకుండ కోటను వశపరచుట మంచిదని తెల్పినాడు.

సిద్దీమాలిక్ అందుల కిష్టపడలేదు. కాని తానవరి కొరకు పోరాడుటయో తెలియలేదాతనికి.

కుమారుని మరణ మా వృద్ధ నాయకుని జవసత్వము లను పీల్చివై చినది. అయినను అతడు మొగలు సేనల ప్రతిఘటించుటకే నిశ్చయించినాడు.

అతడు ఏడుగురు రాజవారసులగు యువరాజులను పిలచి బహదూరుతరువాత రాజ్యమునకు రాదలచిన వాడెవ్వడు? ఎవ్వడీ యుద్ధమును నడుపుట కాజ్ఞ యిడునో తెలుప మని కోరినాడు.

యువరాజులందరు యుద్ధమన భయమందినారు. జియాఖానుతో కుట్రనొనర్చిన మిగిలిన సేనాపతులందరు యుద్ధమును వ్యతిరేకించినారు.

పగ తీర్చుకొనుటకైన యలవికాని నిరాశాతప్త హృదయుడై అబిసీనియను సేనాపతి ప్రాణత్యాగ మొనర్ప నిశ్చయించుకొనినాడు.

అతడు స్నాన మొనర్చినాడు, మరణ సమయమున కప్పెడు పదునాలుగుమూరల పొడవు వస్త్రములను ధరించి దర్బారున కరుదెంచినాడు.

"ఈ కోట శత్రువుల చేతపడుట నా కిష్టము కాదు. ఆ సర్వనాశన కార్యము సేనాతిపగా నే నొనర్పజాలను."

"నా కుమారుని మృత్యువునకు కారకుడైన అక్బరు కొలది కాలముననే మరణించును" అతడవశుడైనాడు. కుమారుని స్మృతి అతనిలో విచారము లేపినది.

అతడు తనతో దెచ్చుకొన్న విషము నొక్క గుటకలో మ్రింగివైచినాడు.

"అక్బర్!" అరచినాడతను. "ఈ విషము- నన్ను మరణింపజేసిన ఈ విషమే నీకు మృత్యువు నాపాదించును. నేను స్వామి భక్తుడనైన నా వాక్యము తప్పదు" అనుచు అతః ప్రాణములను వదలినాడు.

జియాఃఖాన్ సువర్ణమును పాదుషాకు అప్పగించినాడు.

కోటలో మొగలు సైన్యములు ప్రవేశించినవి. కాని మరునాడు తెల్లవారుసరికి దురాశాపరుడైన జియాఖాను శవము అసిర్ ఘర్ కోట యగడ్తలో తేలినది.

ఈ హత్యయు అక్బరు అనుజ్ఞతోడనే జరిగినదని తెలిసిన దెవరికి?

# 9

అర్ధరాత్రియైనది. సర్వప్రకృతియు నిద్రయుందవశమై యున్నది. విరహులు; దొంగలు, హంతకులు నిదురలేక తమలక్ష్యసాధన కొఱకై విచారించుచున్నారు.

ఆకసము మేఘాచ్ఛాదితమై చుక్కల వెలుగులను కూడ కప్పివైచి ఆశాలేశము లేనదరిద్రుని హృదయము వలె అంధకారబంధురమైనది.

వర్షచిహ్నముగా మెఱుపులు సాగినాయ్. మెరుపు వెంట ఉరుములు ఆవుల వెంట లేగలలాగ సాగినయ్.

ఆ అర్ధరాత్రి అక్బరు పాదుషా నిదురకు దూరమై నిరాశాతప్త హృదయంతో బంధింపడిన శార్దూలం వలె ఆ భవనంలో ఉన్నాడు.

పెద్ద మెరుపు మెరిసినది.

ప్రక్కనున్న బంగారు పళ్ళెమందుంచిన కైజారు తళుక్కున మెరసినది.

ఆ కైజారు ప్రకాశమాతని హృదయమునకు తాకినది. పెళ పెళమని యొక ఉరుము రిమిసది. ఆ మనసు నా ఉరుమొక కుదుపు కుదిపినది.

ఆ వజ్రాలు దాపిన బాకు ఎప్పుడో తనహృదయమున దిగిపోవలసినది, కాని తన ప్రియురాలు జియారాణి తన నా ప్రాణాపాయము నుండి రక్షించినది.

భర్త ప్రాణములకొరకు తన ప్రాణములీయ సిద్ధపడిన దాహిందూ వనిత తనరాణి జియారాణి.

ఆనాడామె యడ్డుపడకుండిన నేడీ హృదయవిదారకమగు ఆవేదన తనకు కల్గెడిదికాదు.

తనకుమారుడే తనకీనాడు ఆ కైజారునే పంపినాడు మరణ బహుమానముగ.

ఈ కైజారునకు తన ప్రాణములపై అంతమోజు ఎందుకో ?

చివరకామహాభిమాని ఏరమాత రాణి దుర్గావతి విసరిన ఆ కైజారే తన ప్రాణము తీయునేమో ?

చేజిక్కిన శత్రువు ప్రాణమును రక్షించిన ఆ కరుణామయుని తాను మరణము పాల్జేసినాడు.

తనలోని దురాశా పిశాచము నాడట్లాడించినది. అనగా ఆనాడు తన్నట్లు నడిపినది. ఆ పగలమారి వాక్యము లకు లోపడి ప్రాణదాత ప్రాణములను దీసినాడు తను,

గొండ్వానా రాజసభ జరుగుచున్నది. రాజా వీర నారాయణ సింహాసనమందున్నాడు. ప్రక్కనున్న సింహాసన ముపై యానాడు గొండ్వానా ప్రజలచే మహాకాళి వతారమని భావింపబడుచున్న మహారాణి దుర్గావతి ఆసీ నయైయున్నది. మరొక ఉన్నతాసనమున మహామంత్రి సుధీ రుడున్నాడు.

ప్రతీహారి లోనికివచ్చి యెవ్వరో దర్శనమున కరు దెంచినారని తెల్పి మహారాజు ననుజ్ఞతో లోనికి గొని వచ్చెను.

“రాజా రామచంద్ర! ఏన్నా మహారాజు. ఏమి ఈ దీనావస్థ? ఏమయినది? పాదచారులై తామరుదెంచుట యేమి?” రాణి దుర్గావతి ఆతురతతో ప్రశ్నించినది.

ఆ మొగలు పాదుషా క్రూరదృష్టి తమపై ప్రసరించి నదా మహారాజా!” వీరనారాయణ ప్రశ్నించినాడు. అతని నొక సింహాసనమున గూర్చుండబెట్టుచు.

“మహారాణీ! మహమ్మదీయుని కుటిల రాజనీతికి బలి యైపోయినది నా రాజ్యము అసఫ్‌ఖానుడు నన్ను వెంటాడి

వేటాడుచున్నాడు. నేనా మ్లేచ్ఛుని అధికారమున బానిసనై పడియుండవలయునట"

"అనగా అర్థము?" సుధీరుడడిగినాడు (చరిత్రలోని పేరు)

"నేను కోటను వారికర్పించి ఆగ్రాయందలి కచ్చేరీలో గులామునై సలాము లొనర్పవలయును. నాకుమార్తె అగ్బరు జనానాలో చేరవలయునట మహారాణి ఆజీవితమెట్లు గడపగలను! మీ కడనొక సైనికుడుగా నుండుట నా కంత కన్న ఇష్టమైన కార్యము."

"అంతటి మాటలనకుడు మహారాజా" మహారాణి యనినది.

"మహారాణీ" తాము భవాని యవతారమని మా నమ్మకం. ఇప్పుడు తమకన్న ఈదీనునికి రక్షణ నీయగల్గిన వ్యక్తి యెవ్వరున్నారు." రాజా రామచంద్రి కన్నుల నీరు దిగినది.

"ఆ అక్బరు పాదుషా సర్వమత సమత్వము మూర్తీభవించిన మహాత్ముడట. యుద్ధోన్మాది కానేకాడట. ఇతర ధనములపై ఆశ యేమాత్రమెరుగని సర్వసంగ పరిత్యాగి యట. పరమత సహనమునకు సూచనగా అందమైన రాజపుత్రి స్త్రీలను మాత్రమే వివాహమొనర్చుకొనుట గోవుల వంటి హిందువుల రక్షణకొరకు మాత్రమే ఒక్కొక్క రాజ్యమునే తన సామ్రాజ్యమున కలపుకొనుచున్నారట" యనినాడు మంత్రి సుధీరుడు.

"తమకోటనంత సులువుగా నేవిధముగా పట్టివేయ గలిగాడు మహారాజా! తాము ప్రతిఘటించలేదా! ఆలోచనగా అడిగింది మహారాణి దుర్గావతి.

"మహారాణీ! అతికుటిలమయిన పద్ధతిలో నా కోటను ఆక్రమించాడు; తుచ్ఛబుద్ధులైన సేవకులకు బంగారము లంచమిచ్చినాడు ఒక సేనాపతి కుమార్తెకు వివాహమొనర్చుకొన వాగ్దానమొనర్చినాడు. మరొక సేనానికి నా రాజ్యము కట్టబెట్టుటకే ప్రతిజ్ఞ నొనర్చినాడు. ఆ కుట్రలో సైన్యమును వశపరుచుకొని కోటను లోగొనినాడు. కుట్ర జరిపి రాజ్యమునకు రాదలచిన సేనానిని మడియించినాడు నేను పారిపోయివచ్చినాను. నా ఉనికి తమకుకూడ ఆపదలను కొని రావచ్చు" అన్నాడు రాజా రామచంద్ర.

"మన హిందూ ధర్మంలోని అంతర్యమదేనయ్యా! నా రక్షణ కోరివచ్చిన మిమ్ము నా ప్రాణాల నయినా పణంగా బెట్టి రక్షించి తీరుతాను. ఆ ధర్మాన్ని త్యజించిన నాడు మనకు నిలుకడలేదు." అన్నది మహారాణి దుర్గావతి.

"మహారాణీ! ఒక్క మనవి. శాంతి సుభిక్షాలతో జీవించే గొండ్వానా ప్రజలు నా ఒక్కనికొరకు ఆపదలపాలు గావడం న్యాయముకాదు. అది కోరడం ధర్మంకూడకాదు. తమరు నాకు సైన్య సహకారం చేయండి. నా కోటను నేను రక్షించుకుంటాను, రక్షించుకొనలేకపోతే మాతృభూమి రక్షణలో ప్రాణాలనయిన అర్పించినానే సంతృప్తి మిగులు

తుంది. ఆ అనుమతి దయచేయండి" అన్నాడు రాజా రామ చంద్ర.

"సామ్రాజ్యదాహంతో తపించి పోయే అక్బరు గోండ్వానాపై ఎప్పుడో కన్ను వేశాడు. ఈ రాజ్యమందలి సంపద కన్ను కుట్టించినది. ఇప్పుడు మిమ్ము మేము వదలినా అతడీ రాజ్యముపై దాడి చేయడమనేది నిర్వివాదము. మనం తీర్చలేని కోరిక కోరడం, ప్రతీకారంగా దాడి చేయడమనేది అతని రాజనీతి, అతని రక్తదాహం అతనికి చంగిజ్ ఖానునుంచి వారసత్వంగా వచ్చినది. ఎటులయినా తప్పని ఈ యుద్ధం కొరకై మీరు బాధపడవద్దు" అన్నది దుర్గావతి.

"రాణా! రామొకపని చేయుడు. మహమ్మదీయుని వలన బాధచెందిన రాజపుత్రులలో కాన్ని మీరుకూడగట్టుడు. మా రాయబారిగా రాజపుత్రరాజులసందరను సందర్శించి ఒక హిందూ సమాఖ్య ఎంతఅవసరమో వివరించి వారినొక త్రాటిపైకి వచ్చే కృషి చేయండి. అప్పుడే అక్బరు ఆటలు సాగవు. అటు బప్పరావల్ వంశస్థుడు రాణా ప్రతాప్ అక్బరుకు లోబడువాడుకాడు. ఇట్లొక సమాఖ్య నిర్మించ గలిగితే అక్బరు ఆట కడుతుంది. ఆ ప్రయత్నం చేయండి" అన్నాడు మహామంత్రి సుధీర్.

"మహారాణీ! ఈ కార్యభారాన్ని నా ప్రాణాన్ని ధారపోసి నెరవేరుస్తాను. కాని నాలో క్షణక్షణమొక ఆలో

చన పెరిగిపోతున్నది. అది మన పౌరుషానికి తగిన పద్ధతికాక పోయినా మోసానికి మోసమే ఉపయోగమని అనుకుంటు న్నాను" ఆలోచనగా అన్నాడు రామచంద్ర.

ఏమిటన్నట్లు చూచింది మహారాణి.

కొంచెం వెనుకాడి అన్నాడు అతను.

"అక్బరునే హతమారిస్తే వెనువెంటనే నన్ను చంపి వేస్తారు. కాని సర్వరాజపుత్రలోకం సుఖపడుతుంది. ఇది నా లోచన. దీని మంచిచెడ్డలు విచారించండి మహారాణీ" అడిగాడు రామచంద్ర.

"అది మన ధర్మంగాదు మహారాజా! అక్బరుచావు కన్న మీ ప్రాణం ముఖ్యం. కాలం కలిసివచ్చి నప్పుడు అతన్ని మనం చేయగలిగింది లేదు. అదృష్ట దురదృష్టాలను నిర్ణయించేకాలం కొరకు మన ఎదురు చూడవలసి ఉంటుంది. హత్య చేయడమనేది సక్రమకార్యం కాదు" అన్నది దుర్గావతి.

"మహారాణీ! ఈఆలోచనను వదలుకొంటాను. రేపే తమరు నిర్ణయించిన కార్యక్రమంపై బయలుదేరుతాను" అన్నాడు రాజారామచంద్ర.

పన్నామహారాజు రాజారామచంద్రకు మహారాణి దుర్గావతి ఆశ్రయమిచ్చినందులకు తనకోపాన్ని వెలిగ్రక్కు తూ అగ్బరు పాదుషా దూతను పంపాడు గోండ్వానా రాజ్యానికి.

ఆ మరునాడు సభకుపిలిపింపబడినాడు మహమ్మదీయ దూత.

సలామొనర్చి నిలువబడినాడు. మహమ్మదీయ సర్దారుడు ఆదంఖాను. రాజా వీరనారాయణుకు లేఖ నందించాడాతడు.

తల్లి అనుజ్ఞతో ఆతడా లేఖను మహాసంత్రి కొసగినాడు మహారాజా వీరనారాయణుకు.

"మేము జయించిన పన్నారాజు రామచంద్ర మా స్నేహితులు, పన్నా సేనాపతిని హత్యచేసి పారిపోయినాడు. హత్యానేరము మోపబడిన అపరాధియాతడు. మా రాజ్యానికి సంబంధించిన అపరాధికి మీరు ఆశ్రయమిచ్చినారు. అది ఈ మొగలు పాదుషా విషయంలో మీరు చేయవలసిన పని కాదు. అతనిని ప్రాణాలతో వెంటనే మా సేనాపతి వశం చేయండి. తన వెంట అతడు కొనివచ్చిన అతని కుటుంబము అతని సంపదకూడ మా స్వాధీనము కావలె. ఏవో కారణములుచూపించి కాలమును వ్యర్థపుచ్చినా లేక వ్యతిరేకించినా మీ గోండ్వానా కోటయే భూమిపై నుండదు. మీ స్నేహమును కోరినందువనే ఈ విషయమై హెచ్చరించు చున్నాను.

అక్బరు పాదుషా.

లేఖను వినిన మహారాణి కన్నులు జేవురించినవి.

"రాజా రామచంద్రను వారి కుటుంబంతో సహా

మాకు అప్పగించండి. మేము వెళ్ళిపోతాము" అన్నాడు అధికారాన్ని చూపిస్తూ ఆదంఖాన్.

"నీవు రాయబారానికి వచ్చిన కేవలదూతవు. లేని ఎడల నిన్నిప్పటికే యమభటుల కప్పగించే వాడను" అన్నాడు అధికార స్వరాన్ని గ్రహించిన వీరనారాయణ కోపంతో. సభ నవ్వులతో నిండింది, ఆదంఖాను ఉడికిపోయి నాడు.

"ఈ హేళనకు ఫలితాన్ని మీరనుభవించకతప్పదు. పులివంటి అగ్బరు పాదుషా సేనాపతిని వెక్కిరించడం మీ పతనానికి ప్రారంభం" అన్నాడు ఆదంఖాన్.

"మా మహారాణి వారికి పులివేటపై మక్కువ ఎక్కువ" అన్నాడు నవ్వుతూ మంత్రి సుధీర్.

"దూతగా వచ్చిననీకు దురుసుతనం కూడదు ఆదంఖాన్" అన్నాడు తిరిగి మహామంత్రి,

"ఓహో ఇతడేనా ఆదంఖాన్! బైరాంఖానుకు పట్టిన గతే త్వరలో ఇతనికికూడ పట్టబోతున్నట్లు విన్నాం" అన్నాడు భోజకేతు మరో సేనాపతి.

"లేదు లేదు. ఇతని తల్లి మాహాం అనాగా ఇతన్ని ఎట్లాగైనా కాపాడగలదులే" అన్నాడు మిజస్ భీకారి ఇంకో సేనాపతి.

తిరిగి సభ ఫక్కుమన్నది.

ఆదంఖాన్ గొంతు నెవరో కత్తి మొనతో నొక్క

నట్లయినది. గుండెలో ఈటె దిగినంత బాధ పడ్డాడు తా నెంతటి అవమానకర స్థితిలో జీవితాన్ని నడుపుతున్నది, తనను, తన తల్లిని గూర్చి ఇతడు ఇట్లాలోచించుచున్నా రను నది తెలుసుకున్నాడు ఆదంఖాను.

"మా పాదుషాకు తమరు యిచ్చే జవాబేమిటి?" ఖాను అడిగాడు. ఆతడిలో మునుపటి ఉద్ధృతం, అధికారం లేదు.

జవాబు తయారుచేసి యిస్తాం, అంటూ ఉత్తరాన్ని వ్రాయించింది రాణి దుర్గావతి మహామంత్రిచేత.

మహారాణి దుర్గావతి ఆ జవాబును సభనులో చదివి వినుపించింది.

మొగలు పాదుషా అగ్బరునకు.

ఇది మా మాతృదేశం. ఈదేశాన్ని మా పూర్వులు పరిపాలించారు. భారతీయుల అనైక్యత నాధారం చేసుకొని మీ తాతలు తండ్రులు రాజ్యాన్నిక్కడ స్థాపించ కల్గినారు, విదేశీయులయిన మీరిక్కడ మా భూములపై అధికారము నెరపుతున్నా మే ము మీపై దండెత్తి రావడంలేదు. యుద్ధాలపేరుతో మానవ మారణహోమాన్ని నెరపడం మాకు అంగీకారం కాదు. ఈ మా సహనాన్ని మీరు అసమర్థతగా భావించితే అది మా తప్పుగాదు. ఏ మతస్థుడితోనైనా శాంతితో సహజీవనం నెరపడం మా హైందవీయ జీవన విధానం. ఇతరుల మతాలను చిన్నబుచ్చి అవమానించడం మా సంప్రదాయమే కాదు. ఈ ధర్మాచరణాను

రక్తిస్తే మీ మహమ్మదీయు లింతదనుక ఈ మా మాతృ దేశంలో ఉండడానికి కారణభూతమైన దనే విషయం గుర్తింప నిరాకరించడం మీ దురదృష్టం. అతి సహనపరు లయిన మా భారతీయుల హైందవ రక్తాన్ని ఆస్వాదించ డానికి మీరు ఉవ్విళ్ళూరుతూ మా రాజ్యాన్ని బహిరం గంగా మా మతాన్ని లోలోపల కాజేయడానికి వేసిన ఎత్తు లను మా ప్రజలెప్పుడో కనుగొన్నారు. మీ కోరిక తీర్చ డానికే భారతవీరుడును సహించడు. మమ్మాశ్రయించిన శత్రువైనా రక్షించడానికి మేము వెనుదీయము. రాజా రామచంద్ర మా కాత్మీయుడు అన్యాయంగా అతని రాజ్యాన్ని కాజేసిన మీరాతని ప్రాణాలను కోరడం మీ లోని రాక్షసత్వానికి రక్తదాహానికి చిహ్నాలు. అధర్మము నకు వెరచినంతగా యే భారతీయుడు యుద్ధమునకు వెరువడు. మీ బెదరింపునకు తగిన జవాబు యుద్ధభూమిలో మీకు లభిస్తుంది.

ఇట్లు,
రాజా వీరనారాయణ

ఈ ప్రత్యుత్తరం విన్న సభ హర్షపులకిత మైనది. సభికుల హర్షధ్వానాలతో సభ మార్మ్రోగింది.

“ఆదంఖాను! ఈ ఉత్తరం మీ అక్బరు పాదుషాకు ఇవ్వు, రక్తపిపాసి కాక నిజమైన వీరుడైతే అక్బరు శాంతితో

ఒకరిజోలిలేక జీవించే మా పైకి రాడు. కుటిల తంత్రాలతో మహా గడ్డపై కాలు మోపితే అతన్ని గడ్డి కరిపించక మానము. ఇక నీవు వెళ్ళవచ్చు" అన్నది రాణి దుర్గావతి.

జాబు చదివిన అక్బరు పాదుషా అవమానమే పొందినాడు ఒక స్త్రీ వలన తనకింతటి ధిక్కారమా? "గోండ్వానా కోట మట్టిపాలు కావలసిందే!"

"అసఫ్‌ఖాన్" అరచినట్లే పిలిచాడు అక్బరు.

"జహాపనా! చాలా కాలమే పట్టవచ్చు" అన్నాడు ఆసప్ ఖాన్.

"సరే సేనలను ఆయత్తపరచు. మేము స్వయంగా నడుపుతాము ఈ దండయాత్రను. గోండ్వానాకోట భూమిపై మిగులరాదు. ఆ గర్వి దుర్గావతి మా అంతఃపురం చేరవలసిందే."

కాంతివంతమైన దీపం చుట్టూ క్రమ్ముకునే పురుగుళ్ళ దండలాగా మహమ్మదీయ సేనావాహిని గోండ్వానా కోటను ముట్టడించినది. ఫిరంగి గుండుకు అందని దూరంలో అక్బరు తన గుడారాన్ని ఏర్పరచుకున్నాడు. ఏ విధముగానైనా గోండ్వాను ఆ సంపదలతో ఆవరించడమే అక్బరు ఆశయం. అందు ధర్మాధర్మ విచక్షణ లేదు.

గోండ్వానా కోట ముట్టడింపబడినది మొదలు ఫిరంగులు గుండ్లవర్షం కురిపించినయ్. కోట చెక్కు చెదరలేదు. అభేద్యమైన కోట గోడలు అంత సులువుగా అలవికానివని తెలుసుకున్నాడు.

కోటను వశపరచుకొనడానికి చేసిన ప్రయత్నం విఫలం కావడంతో అక్బరు దుర్గావతి నేవిధంగానైనా కోట బయటకు రప్పించడానికి ఆలోచించాడు. అసఫ్‌ఖానుని ఆలోచన అతనికి నచ్చింది.

వారంరోజులు గడచినయ్. అసఫ్‌ఖాను కోటముట్టడి జరుపుతుండగా అక్బరు కోటలోనికి రహస్య ద్వారములున్న వేమో వెదుకడానికి కొద్దిపాటి బలగంతో బయలుదేరాడు. ఆనాడే తిరిగివచ్చిన రాజా రామచంద్ర తన బలగంతో కోటలోనికి రాత్రికి చేరవచ్చుననే ఊహతో ఆ కొండలలో కోటలోనికున్న రహస్యమార్గం దగ్గరగా తలదాచుకు న్నాడు.

ఈ మార్గము విషయమే అక్బరు వినినాడు. చివర కాతడు మార్గాన్ని కనిపెట్టగలిగాడు. అక్కడి రక్షక సైనికులు చంపబడ్డారు. అక్బరు ఆనందానికి మేరలేదు. రహస్యంగా ఒక సైనికుని తన స్థావరానికి అదనపు సేనకొరకు పంపించాడు.

అతడి ఆనందమెంతోసేపు నిలువలేదు. అక్కడే ఉన్న రాజా రామచంద్ర హఠాత్తుగా అక్బరుపై తన సేనతో దాడిచేశాడు, అక్బరు బందీయైనాడు. రహస్యమార్గం తెరువబడి అక్బరు బందీగా కోటలోకి చేర్చబడ్డాడు.

అతడి సైన్యం పారిపోయి అసఫుఖానువద్దకు వచ్చారు. మహోత్సాహి జిమా రాణి యుద్ధాన్ని ఆపడానికి ఆజ్ఞచేసింది

అసఫ్‌ఖానుకు. అయిష్టంతో అసఫ్‌ఖాను యుద్ధాన్ని ఆపు చేశాడు. కోటలోనుండి ఎప్పుడే దుర్వార్త వినవచ్చునో యని సైన్యము కల్లోలమైపోవుచున్నది.

అక్బరుసే మొనర్చుటాయను ప్రశ్న వేధించగా మహారాణి సుధీర్ వీరనారాయణలు మంతనములు సలుపు చున్నారు.

ఒక రాజపుత్రి స్త్రీ తమ దర్శనమపేక్షించి వచ్చిన దని పరిజనులు తెల్పగా లోనికి ప్రవేశపెట్టమన్నది మహా రాణి.

ఆమె మహారాణి యెదుట నిలువబడినది.

వచ్చిన స్త్రీ మహారాణికి నమస్కరించి దుఃఖంతో ఆమె పాదాలపై పడిపోయినది,

మహారాణి మాతృహృదయం మీా దుఃఖభారాన్ని సహింపలేకపోయింది.

"నీకు వచ్చిన ఆపదయేమమ్మా! చేతనైతే తీర్చడా నికి ప్రయత్నం చేస్తాను" అన్నది దుర్గావతి.

"నేను ఆర్తురాలిని మహారాణీ! రక్షించమని కోరడా నికి కూడ అర్హత లేనిదాన్ని, అయినా ఇప్పుడు మిమ్మల్ని శరణుగోరుతున్నాను" అన్నదిజయారాణి.

"ఇంతకూ ఎవరమ్మా నీవు? నీ పేరేమిటి?"

నా పేరు వినదగినది కాదు. కాని స్త్రీగా నా ధర్మా న్ని నేను నిర్వర్తింప దలచాను. హిందూ యువతికి భర్త

దైవం, అతనిరక్షణ ఆమె కర్తవ్యం, నా దైవాన్ని రక్షించి నా మాంగల్యం నిల్పండి మహారాణి!''

"తప్పకుండా నీ భర్తను రక్షించడానికి ప్రయత్నిస్తాను,''

"మహారాణివారు త్వరపడి యీ యుద్ధసమయంలో మాట యివ్వడం మంచిది కాదేమో!'' మంత్రి అన్నాడు,

"సమయమేదైనా హిందూస్త్రీకి భర్త రక్షణ కర్తవ్యంకదా! ఆమె మాంగల్యాన్ని రక్షించగల్గి నేనేవిధంగా తిరస్కరించగలను మహామంత్రి'' అన్నది మహారాణి.

"ఈమె అగ్బరు పట్టపురాణియని నా అనుమానం మహారాణీ,''

"బీహారీమల్లు కుమార్తె జియారాణియా? ఏమమ్మా నిజమా?'' అడిగింది దుర్గావతి.

"అవును మహారాణి నన్ను నా ఆవేదనను అర్థం చేసుకోనండి. అనువుగా నేను మీ యెదుట నిలువదగిన పవిత్రత లేనిదాన్ని''

"జియారాణి? నీభర్త సామ్రాజ్యకాంక్ష యుద్ధపిపాస రక్తదాహం నీవంటి ఎందరు స్త్రీల మాంగల్యాలను మంటగల్పుతున్నదో గమనించావా? ఆస్త్రీలను రక్షించడానికి నీ వొనర్చినదేమిటి? మొగలాయీ అంతఃపురంలోని భాగ్యభోగాల కాశించి నిన్ను నీ తండ్రి అగ్బరు కిచ్చాడు. కాని భారతజాతిని హిందూమతాన్ని నిర్వీర్యం చేయడానికి

అక్బరు పన్నిన కుట్రలో నీ వివాహము పొంది ప్రస్తావన యని గమనించావా!"

"మహారాణీ! నేను అన్ని విషయాలు ఎరుగుదును. భార్యగా అతని మీది భక్తి, హిందువుగా అతని మీది ద్వేషం దినదినం నన్ను కాల్చివేస్తున్నవి. నరనరాన హైందవ వీయరక్తం ప్రవహిస్తున్నది. కాని ఈ శరీరం స్త్రీగా పతి భక్తిని చూపుతున్నది. ఈ సంఘర్షణలో నా జవసత్వాలే శిథిలమై పోయినవి మహారాణీ" ఆమె యేడ్చింది.

"జియూరాణీ! నీ భర్తలోని కాముకత ఎంతటి వెర్రి తలలు వేసిందో అతని జనానాలోని స్త్రీలను చూస్తే తెలుస్తుంది. మతసహనం ముసుగుతో అతడు చేస్తున్న వారి సమూహాన్ని చూస్తే కనుకోవచ్చు నా కోటలోని కాంతా కాంచనాలే ఈ యుద్ధంలోని అతని యేకైక లక్ష్యాలు."

"ఏమైనా మహారాణి! నేను స్త్రీని నా ప్రాణాలను పుచ్చుకొని నా భర్త ప్రాణాలను రక్షించండి." కోరింది జియూరాణి.

"ఒక్క నీ భర్త ప్రాణం రక్షింపబడితే వేలమంది స్త్రీల భర్తల ప్రాణాలు నాతడు పొట్టన బెట్టుకోడని నిశ్చయమేమిటి జియూరాణీ! అతని కోటవైపు తిరిగి చూడకుండ మీరు చేయగల్గితే మీ భర్తకు ప్రాణదానం చేస్తాం." అన్నది దుర్గావతి.

"ఆ విషయమై నేను ప్రయత్నిస్తాను మహారాణీ!

ప్రాణదానం చేసిన మీపైకి తిరిగి నాభర్త రాదలచితే నా శవాన్ని దాటి మాత్రమే కోటలో అడుగుబెట్టగల్గుతాడు, అది నా చివరిప్రయత్నమౌతుంది" అన్నది జియారాణి.

"మీభర్తను ప్రాణాలతో వదలుతాం జియారాణి! కాని అతడు ఒక స్త్రీ మూలంగానే ప్రాణాలను రక్షించుకొనినాడని గ్రహించవలెను. మీరిక వెళ్ళిరండి."

"మహారాణీ! నీవు హైందవ నారీలోకానికి మకుటమవు స్వతంత్రేచ్ఛ నశించిన జీవచ్ఛవాలం మేము. మన మతం దేవాలయాలు, స్త్రీలు అవమానపరచబడినప్పుడు మా హృదయాలలో జ్వలించే అగ్నిగుండాల నార్పగల్గిన దెవరు? పైకి బాధకూడ పడలేని అస్వతంత్ర జీవులం, లోపల భగభగలాడుచు పైకి శాంతంగా ఉండే అగ్నిపర్వతాలము మేము. నన్ను అర్థం చేసుకో. స్త్రీగా నా విధిని నేను నిర్వర్తిస్తాను" సుడులు తిరిగిన కన్నీటిని తుడుచుకుంటూ మహారాణికి నమస్కరించి వెళ్ళిపోయింది జియారాణి అనే సూర్యమ్ ఈ జమాని.

"ఈ సమయంలో అగ్బరును వదలివేయడం భారత దేశానికే అపచారమమ్మా" అన్నాడు వీరనారాయణ.

"అవును నాయనా! కాని రాజపుత్రులు ఆడినమాట తప్పరు. సర్వనాశనమైనా ఈ విడుదల జరిగి తీరవలసిందే. ఈ విడుదల అగ్బరులో పరివర్తన తేరాదా!" అన్నది మహారాణి.

"దెబ్బతినిన తాచు పగబడుతుంది. అంతే జరిగేది. నీమాట ప్రకారమే జరుగనీవమ్మా" అన్నాడు వీరనారాయణ.

"భగవంతుని ఇచ్ఛానుసారమే ఈ లోకం నడచి పోతుంది నాయనా! మనం నిమిత్తమాత్రులం." అన్నది దుర్గావతి.

మఱునాటి సభకు బందీగా కొనిరాబడ్డాడు అగ్బరు.

"ఒకరి జోలిలేక శాంతియుతంగా బ్రతికే నారాజ్యం పైకి ఎత్తివచ్చి నిష్కారణంగా దండయాత్ర జరిపిన నీవు ద్రోహివి. దీనికేమని సమాధానం చెప్పుకుంటావు?" అడిగాడు రాజా వీరనారాయణ

"రాజ్యం గెల్చుకోవడం వీరధర్మం. యుద్ధమొనర్చడం వీరలక్షణం" అన్నాడు అగ్బరు తెచ్చుకొనిన ధైర్యంతో. "మానవమారణ హోమాన్ని నీమతమమే సహించదు. ఇతర రాజ్యాలపైన దురాక్రమణ జరపడం వీరలక్షణం కాదు. ఇంతకూ నీవు వీరుడవా అగ్బర్?" అడిగాడు వీరనారాయణ.

అగ్బరాయువకునికి సమాధానం చెప్పలేదు.

ఇంతలో ఒక వీరుడు కవచంతో శరీరమంతా ఆచ్ఛాదింపబడి సభలోనికి వచ్చాడు.

"అగ్బర్ ! నీవు వీరుడవన్నావు. ఆహ్వానింపబడిన వీరుడు ద్వంద్వయుద్ధాన్ని తిరస్కరించడు. మన ఇరువురము

ద్వంద్వయుద్ధము చేద్దాము. రాజ్యగర్వంతో మత దురహంకారంతో మా స్త్రీలను నౌరోజు ఉర్సు పేరుతో అవమానించావు-ఆనాడే పృథ్వీరాయల భార్య చేతిలో మరణించవలసిన వాడవు. పారిపోయి ప్రాణాలు దక్కించుకొన్నావు. కుటిలంగా కుట్రలతో ఇతర రాజ్యాలను మ్రింగ జూచే నీవిప్పుడైనా గౌరవంగా మరణించు. నాతో ఖడ్గయుద్ధం చెయ్యి. నీవు గెలిస్తే నీకు ప్రాణదానం చేస్తాను. నీవు ఓడితే ఇక రాజపుత్ర రాజ్యాలజోలికి రానని ప్రమాణం చేసి పిరికి పందవలె ప్రాణంకొరకు మహారాణి నాశ్రయించు" అన్నాడా వీరుడు. అది తప్పదని తెలిసి అక్బరు సంసిద్ధుడైనాడు.

అక్బరుకు ఒక సేవకుడు కవచము, డాలు, ఖడ్గము ఇచ్చాడు. అక్బరు ద్వంద్వయుద్ధానికి ఆయత్తుడైనాడు.

అదృష్టమయితే వరించింది. గాని అక్బరుకు మరే మంచిగుణాలు లేవు. ఖడ్గచాలనం లాంటివి అతనికి బాగా తెలియదు. పరాక్రమం మంతకన్న లేదు. ధైర్యం శూన్యం. కాని అతనికున్న దొక్కటే కలిసివచ్చిన కాలం అదృష్టం.

అక్బరుకు ఖడ్గచాలనంలో నిపుణత శూన్యమని పది క్షణాలలో తేలిపోయింది. ఎదిరి వీరుని ఖడ్గఘాటికి అక్బరు తట్టుకొనలేక పోతున్నాడు. తనకిక మరణం తప్పదనుకొనే సరికాతనికి నిరాశా ప్రేరితమైన పరాక్రమం వచ్చింది. అతడు విజృంభించాడు.

ఒకటి రెండు క్షణాలలో అక్బరు చేతిలోని ఖడ్గము ఎగిరిపోయి దూరంగా పడిపోయినది. వీరుని చేతిలో ఖడ్గం అక్బరు వక్షస్థలం మీాది రక్తాన్ని కొద్దిగా రుచిచూచింది.

నిర్వీణ్ణుడై నిర్జీవంగా నిలుచబడినాడు అక్బరు పాదుషా.

మృత్యుదేవతా వికటాట్టహాసం అతని చెవులకు విని పించింది. అతని కన్నుల అశ్రులుబికినయ్. భయంతో వణకు తున్నాడాతడు.

"ఛీ పిరికిపందా! నీవొక వీరుడవనుకున్నాను. ఇటు వంటి పిరికి పందల రక్తం నా వీరఖడ్గం చవి చూడకూడదు. నీ కిప్పుడు మృత్యు భయం తెలిసింది. నీ రాజ్యాధికార దాహం మూలంగా ఎందరు వ్యక్తులు బాధలకు గురియౌ తున్నారో గ్రహించు" అంటూ ఆ వ్యక్తి తన ముఖాన్ని ఆచ్ఛాదించిన కవచాన్ని తీసివేశాడు.

అతడు రాజా రామచంద్ర.

"నీవు నన్ను జయించావా అక్బర్? మరి రెండు జన్మలెత్తినా అది నీ వలన కాదు. కుచ్ఛితులైన సేనాపతు లకు లంచములిచ్చి కోటలను వశపరుచుకొనుట జయము గొనుటకాదు. ధర్మాధర్మములను కరుణను విడనాడి పిశా చిచే ఆడింపబడెడి నీ వొక రాక్షసుడవు" అన్నాడు రామచంద్ర.

అందరు జనుల యెదుట తనకు జరిగిన అవమాన మాతని ప్రాణములను దహించినది.

"నీ భార్య జియారాణి మమ్ము శరణు వేడినది. ఆమె మాంగల్యమును నిల్పుటకు శాసనోసర్చినాము మేము. స్త్రీల విషయంలోని నీచ హృదయాన్ని మార్చుకొని మెలగు. శాంతికాముకులైన హైందవ వీరులను రెచ్చగొట్టి సర్వనాశనం కాబోకుపో." అన్నది రాణి దుర్గావతి.

"అదుగో కురాన్ అక్బర్! దానితో ప్రతిజ్ఞ చేయి. ఈ గోండ్వానా రాజ్యం వైపు కన్నెత్తి చూడనని" అన్నాడు మహామంత్రి సుధీర్.

"నీ భార్య కొనర్చిన వాగ్దానం నిన్ను రక్షించింది. నీవు వీరుడవు యోధుడవు కూడ కాదు. నీకు ప్రాణదానం చేస్తున్నాను. వెళ్ళు ప్రాణదాతలమీద కత్తిదూసే నీచత్వం నీలో లేదనే నమ్మకంతో నిన్ను విడిచి వేస్తున్నాము" అన్నాడు రాజా వీరనారాయణ.

అక్బరు కురానుతో ప్రయాణం చేసి ప్రాణం దక్కించుకున్నాడు.

అవమాన భారంతో ఇల్లు చేరాడు.

"అనాగా! నా అవమానం తీరేదేవిధం లేదా? ఒక స్త్రీ నన్నావిధంగా అవమానించి అనుశాసించటం నానరనరాన్ని మండిస్తున్నది. ఈ అవమానం తీరేదేవిధంగా అనాగా?" అతి నిర్వేదంతో మండే గుండెలతో అన్నాడు అక్బరు.

"దానికి ఒక్కటే మార్గం జహాపనా! అభిమానధనం మని పిల్వబడే గోండ్వానా రాజపుత్ర యువతులను

పట్టి తెచ్చి అనుభవించటమే. మీ ఆవేదన ఉపశమించడాని కదే మందు." ఆనాడు దుర్గావతి సభలో తనకు జరిగిన అవ మానాన్ని నెమరు వేసుకొన్న అనాగా.

"నా హృదయాన్ని అర్థంచేసి కొనగల్గిన దానవు నీ వొక్కతవే అనాగా"

"అంతే జహాపనా! ఆ స్త్రీల కావిధంగా అవమానం కావలసిందే. గోండ్వానాకోట మట్టిపాలు కావలసినదే!" అన్నది కుటిల తంత్రాలలో అందెవేసిన అనాగా.

"వారు మనకు దొరికే దేవిధంగా?" అక్బరు అడిగినాడు.

"తిరిగి కోటమీద దాడి చేయ వలసినదే. అప్పుడే వారు మనచేత చిక్కుతారు"

"ఛీ కురానుమీద ప్రమాణంచేసి తిరిగి ఆ రాజ్యం మీద దాడి చేయుడమా?" అసహ్యంగా అన్నాడు అక్బరు.

"ప్రాణాపాయ విషయాలలో చేసిన ప్రమాణాలకు విలువేమిటి? అదీగాక మీకు కురానుకు సంబంధమేమిటి? మీరు దీన్ ఇలాహి మనుష్యులు" అన్నది అనాగా.

"నేను కోటలో అడుగుపెట్టను అనాగా!" అన్నాడు అక్బరు.

"అసఫ్ ఖాన్‌కు ఆజ్ఞాపించండి. అతడా కార్యాన్ని జరిపిస్తాడు"

అప్పుడే లోనికి రాబోవుచూ ఆగి ఆ సంభాషణలు వినిన జియారాణి లోపలికి వచ్చింది.

"అనాగా ! నీవు స్త్రీవి కాదు. స్త్రీరూపంలో జన్మించిన పిశాచానివి" అన్నది క్రోధంగా జియారాణి.

"తమ అభిజాత్యాన్ని చూచుకొని విర్రవీగే ఆ రాజపుత్రి స్త్రీలు అవమానం పాలు కావలసిందే" అన్నది అనాగా.

"ఛీ నీ కుటిలత పాదుపాకు నూతిపోశావు. నీలో స్త్రీత్వం, మాతృత్వం లేదు"

"జయా! రాజకీయాల జోక్యం నీ కనవసరం. ఈ విషయంలో నీ ప్రమేయం లేదు" అన్నాడు అక్బరు.

"జహాపనా ! రాణీ దుర్గావతి తమకు ప్రాణదానం చేసింది. ప్రాణాలు రక్షించినవారి ప్రాణాలు తీయమని మిమ్మల్ని ప్రోత్సహిస్తున్నది కుటిల. అంతకంటే నీచ కార్య మింకేమిటి జహాపనా ? గోండ్వానా కోటపైకి మొగలు సైన్యమిక రాదని హామిఇచ్చి మిమ్మల్ని రక్షించుకున్నాను నేను. అప్పుడీ అనాగా ఏమైంది ప్రభూ!" జియారాణి ప్రశ్నించింది.

"రాజకీయాలలో హామీలకు విలువలేదు. నా అవమానానికి ప్రతీకారం జరిగి తీరవలసిందే" అన్నాడు అక్బరు.

"జహాపనా ! ఒక్క విషయం చెప్పగలను.

గోండ్వానా కోట లోనికి మీరు నా శవం పైగా దాటి వెళ్ళవలసినదే. నేను రాజపుత్ర స్త్రీని, భర్తగా మిమ్మల్ని ప్రేమిస్తాను. దైవంగా ఆరాధిస్తాను, కాని మాన ధనులైన నాతోటి సోదరీమణులకు కలగబోయే మానహానికి నే నోర్చను. వారు నా మాంగల్యానికి హామీ నీయక పోతే మీరా రానాడే... ...అంతమాట నా నోట పల్కించ కండి ప్రభూ!" వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ లోనికి వెళ్ళి నది జియారాణి.

  

ఈ పర్యాయం విశ్వాసహీనుడు అగ్బరు తనకు ప్రాణ దాన మొనర్చిన ఆ ఉదార హృదయుల మీద అతి తీవ్రంగా దాడి జరిపించాడు. తన సమస్త బలాన్ని మోహరించి తల పడ్డాడు, అసఫ్ ఖాను.

గొండ్వానా తన శక్తికొలది ప్రతిఘటించినది. కుటిల మార్గంతో దుర్గాన్ని సాధించాడు అగ్బరు. దుర్గావతి కోట బయటకు వచ్చి అసఫ్ ఖానునితో తలపడింది.

కోటలోని రాజపుత్రి స్త్రీలు తమ శీలాన్ని నిలుపు కొనడానికి జోహారు చేయనిశ్చయించారు.

అగ్ని ప్రజ్వలించింది. సర్వ సముడు అగ్నిహోత్రుడు పవిత్రమైన వారి దేహములనుతనలో లయించుకొని మరింత పవిత్రుడైనాడు.

అగ్బరును విడిచిపుచ్చుట మెంత తెలివితక్కువ

తనమో గ్రహించింది దుర్గావతి. అగ్బరును చంపి తాను చావ నిశ్చయించింది ఆ వీరనారి.

ఖడ్గాన్ని చేత ధరించి అక్బరు పట్టమహిషి జియా రాణి కోట ద్వారంలో నిలువబడింది.

తాను జయించిన కోటలోనికి ప్రయాణమై వచ్చాడు అగ్బరు.

కోటలోపలకి అడుగువేయబోయే అసఫ్ఖానుకు జియా రాణి కంఠస్వరం వినిపించింది.

"ఆగండి అక్కడ. లేదా నాతో కత్తికలిపి నన్ను జయించి ఈ కోటలో అడుగు వేయండి!" అన్నది జియా రాణి.

ఆమె మహారాణి మూర్యఖు-ఇ- జమాని. తల పైకెత్తి ఆమెవైపు చూడలేదు, సేనాపతులు.

వారందరు అవనత శిరస్కులైనారు.

"వెళ్ళండి మీరందరు మీ మీ స్థానాలకు మీ ప్రభువు ప్రాణాలు నిలిపినవారిప్రాణాలను తీయటం మానవ ధర్మం కాదు."

ఈ వార్త విన్న అగ్బరు అచటికి చేరాడు.

"ఏమిటిది జియా! నీ కేమైనా పిచ్చెక్కిందా?" అన్నాడు అగ్బరు "నేను బాగుగానే ఉన్నాను జహాపనా! అపవిత్ర రాజపుత్రవనితల శీలాన్ని మీ కామానికి బలి పెట్టనీయను. నేను మురణించిచనిది నా భర్తను మీ కోట

లోనికి అడుగు పెట్టనీయనని దుర్గావతికి నేను వాగ్దానం చేశాను అది చెల్లి తీరవలసిందే"

"ఇది సామ్రాజ్య సంబంధ విషయము నీ వాగ్దానాల కిక్కడ విలువ లేదు. లే! అడ్డం తొలగు. మొగలు చక్రవర్తిగా సిన్నాజ్ఞాపిస్తున్నాను."

అన్నాడు అక్బరు.

"అది జరిగేది కాదు జహాపనా? నేను మరణించనిది నా సోదరీమణులను మీరేమీ చేయలేరు, మీ ఖడ్గంతో నా కంఠం తెగవేయండి. తరువాత కోటలోనికి వెళ్ళండి." అంటూ అక్బరుముందు మోకరిల్లినది జియారాణి.

అంతఃపురము అక్కడ మారువేషంలో నిలచి చూస్తున్న దుర్గావతి.

"అక్బర్! ఇదిగో నీ పాపానికి ఫలితం విశ్వాసఘాతకుడైన నీవీ ప్రపంచంలో జీవించి ఉండగూడదు. ఏ స్త్రీల కొఱకు నీవింతటి దుష్కృత్యానికి పాల్పడ్డావో అరుగో వారు పవిత్రులై అగ్నిహోత్రున్ని పవిత్రుణ్ణి చేస్తున్నారు చూడు."

అంటూ వజ్రాలు తాపిన తన కైజారును అక్బరు వైపుకు విసిరింది దుర్గావతి.

"జహాపనా!" అంటూ బాకుకు అడ్డంవచ్చి అక్బరును కౌగిలించుకొన్నది జియారాణీ. దుర్గాబాయి విసిరిన ఖడ్గం జియారాణి వీపున దిగి వక్షమున తొంగిచూచినది విషసిక్త

మైన చురియతో తన హృదయాన్ని పొడుకొని ఆత్మహత్య చేసికొన్నది మహారాణి దుర్గావతి.

తన ప్రాణాన్ని రెండవ పర్యాయం రక్షించిన జియా రాణి రక్తసిక్తమైన శరీరాన్ని తీసికొని వెను దిరిగినాడు అక్బరు. జియారాణి ప్రతిన నెఱవేరింది, కాని కోట దోచుకొనబడింది. కోటలో అక్బరుకు నూరజాడీల బంగారమే దొరికింది.

# 10

Rupamati reknowned throughout the world for her beauty and charm.

Amongst the spoils that fell into the hands of Adamkhan was Baj Bahadur's Hindu Mistress the beautiful Rupamati. Adam Khan having saught to gain possession of her she escaped further dishonour by taking poison. The loves of Bazbahadur and Rupamathi form a favourite subject for the Indian poets.

V. Smith.

"కల్‌మాగ్!"

కల్‌మాగ్ వంగి సలాముచేసి నిలచాడు "ఏమిటి ఆజ్ఞ" అన్నాడు. "రూపమతి పేరు విన్నావా కల్‌మాగ్"

అగ్బరు అడిగాడు. "ఆ పేరు వినని వాడు ఈ దేశంలో ఎవ రుంటారు జహాపనా? ఆమె పేరు ఖండఖండాంతరాలలో కూడ మోగిపోతున్నది" అన్నాడు కల్‌మాగ్.

"అంత ఖ్యాతి ఆమె కెందుకు వచ్చింది?" అక్బరు అడిగాడు.

"ఆమె అందం జహాపనా! ఈ కాలంలో హిందూ స్థానంలో అంత సౌందర్యవతి లేదనుకుంటారు. హిందూస్థానమే కాదు ప్రపంచంలోనే అంతటి సౌందర్యవతి ఉండక పోవచ్చు" కల్‌మాంగ్ అన్నాడు. అగ్బరులోని కాముకతను రెచ్చగొడుతూ.

"నీవు ఆమెను చూచావా కల్‌మాగ్!"

"చూచాను జహాపనా! ఒక పర్యాయం ఆమెను వారణాసిలో చూశాను. ఆ అందాన్ని వర్ణించడం నావశ మయ్యేది కాదు జహాపనా!"

"బాజ్ బహదూరు అంతగాడా!" చక్రవర్తి అడి గాడు.

"అంత అందగాడు గాదుకానీ, సంగీతవేత్త. ఇప్పుడు ప్రపంచంలోనే అంతటి హిందూస్థానీ గాయకుడు లేడం టారు" అన్నాడు కల్‌మాంగ్.

"మన తాన్‌సేన్‌కన్న గొప్ప పాటకుడా!"

"కావచ్చు జహాపనా! ఆ బాజ్‌బహదూర్‌కి రాజ్య పాలనమీద ఆసక్తిలేదు, సంగీతం, తాగుడు, రూపమతి

ఈ మూడు విషయాలే అతని జ్ఞప్తిలో ఉంటవంటారుఅక్కడి ప్రజలు."

"నిజమా కల్ మాంగ్? అది నిజమైతే మాల్వా మన వశం కావచ్చు"

"మనం దండెత్తితే వశంకాని రాజ్యమేది ప్రభూ! మనం కోరితే బాజ్ బహదూర్ దేనినైనా ఇవ్వగలడు"

"రూపమతిని కోరితే?" నవ్వుతూ అడిగాడు అక్బరు.

"అదొక్కటే అక్కడ అసాధ్యమైనది కావచ్చు, రూపమతి బాజ్‌ను ప్రేమించునంతగా ఇంకెవరినీ ప్రేమించదట, ఆ ప్రేమికుల జంటనుగూర్చి ప్రజలావిధంగా చెప్పుకుంటారు."

"రూపమతి బాజ్ వివాహమాడిన భార్యా?" అడిగాడు అక్బరు.

"కాకపోవచ్చు. కాని వారి హితం అంతకన్న ఎక్కువంటారు. ఒకరికొకరు ప్రాణం. తమ ప్రాణాలను వదలడానికైనా ఇష్టపడతారుగాని ఒకరినొకరు విడువడానికి ఇష్టపడరంటారు ప్రభూ!" అన్నాడు కల్ మాంగ్.

"దండెత్తిపోతే ఆమెను చూడటం అసంభవం. మరి ఏ విధంగా ఆ రూపమతిని చూడగలుగుతాం!" ఆలోచనగా అన్నాడు అక్బరు.

ఇరువురు ఆలోచనలో పడ్డారు.

నా కోర్కె ఉపాయంతో తీరుతున్నది జహాపనా! అయితే అది ఆచరణ సాధ్యం కాకపోవచ్చు." కల్‌మాగ్ అన్నాడు.

"ఏమిటది?"

"రూపమతి సంగీతమంటే ఇష్టపడుతుంది. బాజ్‌కు అంతకంటే ఇష్టం. తాన్‌సేన్‌ను అక్కడకు పంపితే రూపమతి దర్శనం కావచ్చు" కల్‌మాగ్ అన్నాడు.

"మరి నేనే విధంగా చూడటం? అక్బరు అడిగాడు.

తాన్‌సేన్ వెంట మారువేషంలో వెళ్ళడమే. అప్పుడామెను చూడవచ్చు. ఆమె పాటకూడా వినవచ్చు" అన్నాడు కల్‌మాగ్.

ఈ సూచన అక్బరుకు బాగుగా నచ్చింది. క్షణక్షణానికీ ఆమెను చూచి తనదానినిగా చేసికోవలెననే కోరిక అతనిలో వేరు దన్ని నిలచింది.

"తాన్‌సేన్‌ను పిలిపించాడు అక్బరు.

"మధురగాయకుడు బాజ్ బహాదూరును విన్నారా మీరు" అక్బరు అడిగాడు.

"విన్నాను ప్రభూ! ఆ మధుర సంగీతం విని తీరవలసిందే"

"మీ కంటే మధురతరంగా పాడగలడా అతడు తాన్‌సేన్?"

"నేను ఒప్పుకోక తప్పదు జహాపనా! శాస్త్రసంగీతం విషయమేమైనా ప్రేక్షకుల మనసులు పరవశమయ్యేట్లు

గానం చేయడంలో అతని కతడేసాటి ప్రభూ! ఆ సంగీతంలో పరవశించి మన మే దివ్య లోకాలనో సందర్శించ గలుగు తాము" అన్నాడు తాన్‌సేన్.

"అంతేనా? అక్కడి రాజనర్తకి నాట్యం చూస్తే మన జన్మలేతరిస్తవి." అన్నాడు అక్బరు ఆంతరంగిక సేవకుడు స్నేహితుడు అంగరక్షకుడు, కొన్ని విషయాలలో సలహాదారుడు కల్‌మూగ్.

"రూపమతి విషయమా కల్‌మూగ్?" తాన్‌సేన్ అన్నాడు.

"ఏం రూపవతి అంతటి నర్తకియా?" అక్బరు అడిగాడు.

"సంగీత నాట్యాలు పెనవేసికొనిన సౌందర్యమూర్తి ఆ రూపమతి. ఏ దేవలోకపు అప్సరసయో తపస్సుచెడి మర్త్యలోకంలో జన్మించి ఉండవచ్చు. సంగీత నాట్యాలలో కలిసి ఆమెను మించగల్గినవ్యక్తి ఈ హిందూస్థానంలో ఉండకపోవచ్చు. సౌందర్యంలో ఆమె ప్రపంచ ప్రసిద్ధిపొందినదే" అన్నాడు తాన్‌సేన్.

"మేము బహదూర్ సంగీతం వినాలి. రూపమతి నాట్యాన్ని చూడవలె తానుసేను మీరు మాల్వాకు ప్రయాణం కట్టండి. మీ వెంట మేమూ వస్తాము." అన్నాడు అక్బరు.

"ప్రభువులు ఆలోచించండి. అది అపాయంతో

కూడిన కార్యం. ఒకవేళ మీరు బయటపడిపోతే తన స్త్రీని చూపినందులకు మిమ్మల్ని బాజ్ బహదూర్ వదలు తాడా? ఈ విషయమై పూర్తిగా ఆలోచించి నిర్ణయానికి రండి."

అబుల్ ఫజల్‌ను ఆ విధమైన అక్బరు ప్రయాణాన్ని ఒప్పుకొనలేదు. కాని అక్బరు తన మూర్ఖపుపట్టు విడువలేదు. కాముకు డేకార్య మొనర్చుటకైనను లజ్జా భయముల వీడునుగదా?

చివరకు చక్రవర్తి తాన్‌సేన్ అబులు ఫజలు కలు మాగలు నల్గురు మాల్వాకు వెళ్ళడానికి నిర్ణయించుకు న్నారు.

మొగలు చక్రవర్తి ఉత్తరముతో తాన్‌సేన్ బాజ్ బహదూర్ ఆస్థానమునకు బయలుదేరినాడు. ఇతని శిష్యు డుగా అక్బరు అబులు ఫజలుకూడ తన మంత్రి హోదాతో బయలుదేరినారు. కల్‌మాగ్ వారికి అంగరక్షకుడు.

ప్రతిభావంతుడైన గాయకుడుగా పేరందిన తాన్ సేన్‌ను బాజ్ బహదూరు సర్వమర్యాదలతో స్వాగతమిచ్చి ఆదరించారు. మొగలాయీ సామ్రాజ్యపు మంత్రి హోదా లో అబుల్ ఫజలుకు మర్యాద జరిగిందీ.

మొగలు పాదుషా సరస సంగీతవేత్తయైన బాజ్ బహదూరుకు పంపిన బహుమానములు సమర్పించాడు అబులు ఫజలు.

ఇన్ని బహుమానములు అక్బరు తనకేల పంపినాడో బాజుబహాదూర్‌నకు అర్థముకాలేదు.

"అబులు ఫజలు! మొదలు పాదుషాకు నాపై ఇంతటి ప్రేమ కల్గడానికి కారణం ఊహించలేక పోతున్నాను" అన్నాడు బాజు.

"సుల్తాన్ వారి సంగీత పాండిత్యము వారినట్లు పురి కొల్పి ఉండవచ్చును." అబులు ఫజలు అన్నాడు.

"తానుసేనువంటి సంగీతవేత్తను పోషించు అక్బరు చక్రవర్తి సంగీతానురాగాన్ని మేము ప్రశంసించక తప్పదు. తానుసేను! రేపు మా సభ తమ గానామృతాన్ని గ్రోల డానికి సిద్ధపడుతుంది.

"తాము ప్రపంచ ప్రసిద్ధినందిన గాయకులు. తమ ఆస్థానమున పోషించబడు సంగీత విద్వాంసులే అందుకు తార్కాణము, తమ మహారాణి రూపమతీదేవివారు సంగీత నాట్యములు పెనవేసుకొనిన సరస్వతీ రూపిణియని విన్నాను. తమముందు మేము ప్రశంసింపక తప్పదు. తమముందు మేము పాడుటయన..." ఊరుకున్నాడు తానుసేను.

ఆ పొగడ్త బాజు బహాదూర్‌ను ఆకాశపు పరిధులకు ఎత్తివేచినది. ముఖస్తుతికి లొంగనివెవరూ!"

"తాన్‌సేన్ మీ పాట వినుటకు రూపమతి ఉవ్విళ్ళూరుచున్నది.

"సుల్తానుజీ! మన్నించండి విద్యయెంత నేర్చినా ఇంకా నేర్వవలసి వుంటుంది. తమరు రచించిన గీతాలకు తమ దేవేరి చేసే నాట్యమత్యద్భుతమని వినినాము. తమపాటవిను భాగ్యముతోపాటు మాకానాట్యము చూచెడు అవకాశము కల్పించండి. ఇది తమకు తప్పుగా తోచితే మన్నించండి" అన్నాడు తానుసేను.

"తాన్ సేన్! సంగీతపాటకుడుగా, నీలోని భావాన్ని నేను అర్థమొనర్చుకొనగలను. ఒక విద్వాంసుడు ఇంకొక విద్వాంసుని విద్వత్తును చూచి గ్రహించి ఆనందించవలెనను కోర్కె సహజమైనది. ఆగ్రానగరమున నీ పాట నొక పర్యాయము నేను వినినాను, ఆ పాటకొరకే అక్కడకు వచ్చినది" అన్నాడు బాజ్. ఆశ్చర్యమందినారు అగ్బరు పరిభృతులు.

"తమరు దయాస్వరూపులు. మా కోరిక మన్నించినందులకు కృతజ్ఞులము." అన్నాడు తాన్ సేన్.

"ఇందులకొక షరతున్నది. మా రూపమతి అంగీకరింపవలె. బలవంతముపై చేయుపని రాణించదు, ఆమె నంగీకరింపచేయుటకు ప్రయత్నింతును. ఇక మీరు విశ్రాంతి తీసికొనుడు" అని సెలవిచ్చిపంపినాడు బాజ్ బహదూరు వారికి. రూపమతిని చూచుటకు వేగిరపడుచున్నది అగ్బరు హృదయము. జనులచే మరునాడు సారంగపూర్ రాజసభ క్రిక్కిరిసి పోయినది. నాల్గు వందలమంది సంగీత విద్వాంసులా సభ నలంకరించినారు అగ్బర్ కల్మాగ్లు తమ శరీ

రములం దస్వస్థతగానున్నదని విడిదియుండే నిలిచినారు. సభయం దెవ్వరైన గురుతించిన కష్టము వచ్చునని వారి ఆలోచన.

తాన్ సేన్ సంగీతవాహిని వారిని పరవశుల సంసర్చి నది. స్వర్గ ద్వారములకడకు కొంపోయి విడచినది. తానెప్పు డూ పాడనంతటి తియ్యగా పాడినాడానాడు తాన్ సేన్. బాజ్ బహాదూ కూడ తానంతటి సంగీతము తెలిసినవా "డాయని ఆత్మపరిశీలన మొనర్చుకొనినాడు. తెర వెనుక నుండి విసిన రూపమతి తన జన్మము ధన్యమైనటుల భావించి నది ఆ అమాయకురాలు. సభ్యులు సమ్మోహితులు, శిశు వులు పాటకు ఆకర్షింపబడినట్లు తాన్ సేన్ పాటకు వారు ఆకర్షితులైనారు.

బాజుబహాదూర్ తానుసేనును అత్యంతముగ బహూ కరించినాడు. సభ ముగిసినది.

•   •   •

"రూపా! తానుసేను ఒక్క కోరిక కోరినాడు, అది తీర్చుటెట్లాయని ఆలోచించుచున్నాను.

"ఆ సంగీత సరస్వతి కోరిన అనుగ్రహింపగూడదని దేమి ప్రభూ! మన కలవియైనదయిన యిచ్చివేయుదము" అన్నది రూపమతి.

"అది నీకిష్టమైనదే రూపా? నీ వంగీకరించిన ఆతని కోర్కె తీర్చగలను."

"తాము కోరిక తీర్చుటకు నే నంగీకరించు టేమి ప్రభూ!"

"ఆ కోరిక యట్టిదిరూపా! నేను పాడుచుండగా నీ నాట్య మత్యద్భుతమని యాతడు వినినాడట. ఆకోరిక దీరుట యదృష్టముగా భావింతునని న్నాడు. అది తప్పుగా భావించిన నీ పాటనైన వినవలయునట." అనినాడు బాజు,

"ఇదేమికోరిక ప్రభూ! నేను వారిముందు నాట్యమాడుటా! ఈ జీవితంలో తామొక్కరిఎదుట దప్ప మరి ఎవరి యెదుటను నాట్యమాడనను నాప్రతిజ్ఞ మరచినారా? తాము" విచారముగా ననినది రూపమతి.

"అతడు సంగీత విద్యావేత్త. నీవు నాట్య కళానిధివి అతని గురువుగా భావించి నీవిద్య నాతని యెదుట ప్రదర్శించుట తప్పుగాదు రూపా!" యనినాడు. బాజు బహదూర్.

"తమకై మీదుగట్టిన ఈనాట్య మింకొకరి ఎదుట ప్రదర్శింపను. తమ రాజ్ఞాపించిన గాన మొనర్పగలను," అని నది రూపమతి.

"రూపా నీవు నా భాగ్యదేవతవు. నీవంటి భార్యను గల్గిన నేనెంతటి యదృష్టవంతుడనో ఊహించ లేకున్నాను. నీ సౌందర్యం ఈ దేశముననే ప్రఖ్యాతినందినది. ఇంతటి సౌందర్యరాసి భార్యగా గల్గిననేనెంత గర్వించ వలయును." అనుచు ఆమెను కవుగిలించుకొనినాడు బాజు.

"సౌందర్యరాశి నెవ్వరు మీనుండి కొనిపోకుండ ఈ చేతుల నెప్పటికి ఇట్లే యుంచుడు ప్రభూ! ఈ సౌందర్యమంతయు మీదిగనే యొనర్చుకొనుడు." అనినది, ఆలింగనమున కరగిపోవుచు రూపమతి.

"మనలను వేరుచేయగల్గినదెవ్వరు రూపా! మరణ మొక్కటి మాత్రమే మనలను వేరుచేయగలదు." అనినాడు బాజు.

"లేదు ప్రభూ! ఆ మరణముకూడ మనలను వేర్పరు పరాదు. ఇది నా కోరిక మన ఇర్వురి మరణ మొక్కసారియే, అదియు మనలను వేరుచేయజాలదు" అనుచు కిలకల నవ్వినది రూపమతి.

మరునాడు బాజు బహదూరు సంగీత మందిరమున సమావేశమైనారు వారు.

బాజు బహదూర్ సింహాసన మధిష్ఠించినాడు. అగ్బరు ఖాన్ సేనులు ఒకచోట అబుల్ ఫజలు కలుమాగ్ లు మరొకచోట ప్రేక్షకులనే కూరుచున్నారు.

పరిచారిక యొకర్తు వాద్యముల సవరించి పోయింది. ప్రేక్షక ద్వారమునుండి రూపమతి దివినుండి భువికవతరించు శంపాలతవలె చూపరుల కన్నుల మిరుమిట్లుగొల్పుచు అట కవతరించినది.

ఆమె సౌందర్యమా ప్రేక్షకుల నాకట్టుకొనినది.

అగ్బరా సౌందర్యరాశితో తన అంతఃపుర కాంతలను పోల్చుకొనినాడు. అతని హృదయము బాజుపై ఈర్ష్యాద్వేషములతో మూలిగినది. ఆ మూర్తీభవించిన సౌందర్యమును కన్నులతో గ్రోలుచున్నాడా కామాయత్త చిత్తుడు.

రూపమతి గౌరవమునకై వారు లేచినిలచినారు.

ఆమె వారికి హిందూ పద్ధతిన నమస్కరించినది.

ఆమె ఆసీనకాగానే వారు తమ స్థానములందు కూర్చొనారు.

భర్త అనుజ్ఞ నభ్యర్థించినది రూపమతి కన్నులతో. చిరునవ్వుతో అనుమతి నిచ్చినాడు బాజు బహాదూరు.

సర్వలోకాలను సమ్మోహింపజేసే సంగీత మాసంగీత భవనాన్ని ముంచెత్తినది. సంగీత రసాస్వాదనలో మునిగి నారు తాన్ సేన్, అబుల్ ఫజలులు. సంగీతసార మెరుగని అక్బరు ఆమె సౌందర్య రసాస్వాదనలో పరవశించినాడు.

అతడు తన రూపమును చూచుటేగాని తన సంగీత మును వినుటలేదని రూపమతి గ్రహించినది. ఆమె బొమ ముడిపడినది. అది గ్రహించిన అక్బరు తల వంచికొనినాడు. తిరిగి ఆమె వైపు చూడలేదు. ఆ సంగీతమునమునిగి తాన్ సేన్ ఈ లోకమునే మరచినాడు.

రూపమతి గాన మాగినది. సంగీతమననేమో ఎరుగని అక్బరునకు కూడ వెలితి కల్పించినది.

బాజ్ బహాదూరు తన అసమాన సంగీత ప్రతిభను వెల్లడించుచు తాను రచించిన గీతములనే పాడినాడు.

తాన్ సేన్ ఆ గీత మాధుర్యమును కొనియాడినాడు. సంగీతములో తమ నానందపరచిన రూపమతీ బాజ్ బహా దూరులను కొనియాడినాడు అక్బరు సార్వభౌముని తర

ఘున వారికి అంతటి మధుర సంగీతాన్ని విన్పించినందులకు అభినందించినాడు.

బాజ్ బహాదూర్ తాన్‌సేన్‌కు వెలలేని కానుక లిచ్చాడు. తన మెడలోని రత్నహారమును తాన్‌సేన్‌కు కానుకగా ఇచ్చినది రూపమతి. సంతోషముతో స్వీకరించి నాడు తాన్‌సేన్.

వారు బాజ్ వద్ద సెలవు తీసికొని వెనుదిరిగినారు.

మరునాడు ఉదయము తాన్‌సేన్ విడిది చేసికొనిన భవనపు కావలివాడు ఒక పెట్టెను రూపమతీదేవి వద్దకు కొనివచ్చినాడు.

"ఎచ్చట నీ పెట్టె?"

"రాత్రి తాన్‌సేన్ మిగిలిన వారు వెళ్ళుతూ లోపల ఒక పెట్టె రూపమతీ దేవి వారిది ఉన్నది. తెల్లవారి వారికి చేర్చు అని చెప్పినారు. నేను ఉదయము దీనిని చూచి తెచ్చి నాను" అనినాడు సేవకుడు.

"నీ కీ మాటలు చెప్పిన దెవరు?" రూపమతి యడిగి నది.

"తాన్‌సేన్ ప్రక్కనున్న యాతడు. వీరందరకు అతడే

అధికారిగ నాకు తోచినది. అతని మాటయువిన వీరందరు భయము కన్పరచెడివారు" అనినాడు సేవకుడు.

రూపమతికి యనుమానము కలిగినది.

ఆమె ఆ పెట్టెను లోనున్న సుల్తానుకడకు తీసుక పోయినది.

"ఏమిది రూపా?" అడిగినాడు బాజ్.

"వారు పోవుచు రూపమతి కిమ్మని పోయినారంట. కావలివాడు కొనివచ్చినాడు. నా కేమో శంకగా నున్నది" "తాన్‌సేన్ ప్రక్కనున్న వ్యక్తినిగూర్చియే నా యనుమానము" అనినది రూపమతి.

బాజు పెట్టెను తెరచినాడు. లోపలనొక చిన్న బంగారు పెట్టెయున్నది. బాజ్ ఆశ్చర్యమును పొందినాడు.

బంగారు పెట్టెను తెరిచినా డాతడు. అందొక వజ్రాలహార మున్నది. ఒక ఉత్తరమున్నది.

ఉత్తరమును విప్పినాడు. బాజ్ బహాదూర్.

ప్రియరూపమతి ?

ఈనాటికి నిన్ను చూచెడు కోర్కెతీరినందుల కానంద

మైనది. కాని నిను వదిలిపోవుటవలన విషాదమంతకు వేయి రెట్లున్నది. లోక మోహనమైన నీ రూపము నా హృదయ ఫలకమున స్థిరముగ ముద్రింపబడినది. ఇది చెరిపివేయవల యునన్న అలవికానిది. నా హృదయము నీ యధీ మైనది. మొగల్ పాదుషా అక్బరు చక్రవర్తి నీ యాదముకు దాసుడై నీ పొందుకోరుచున్నాడు. కరుణించి అతనిని పాలించెదవో లేక తిరస్కరించి విషాదము పాలొనర్చె దవో? యుద్ధమొనర్చి నిను కొనిపోవ వలయునను కొంటిని. కాని అంతటి కార్యము జరుగుట యనవసరము, సుల్తాన్ బాజ్ బహదూరు కార్యము నంతవరకు రానీయడు. నీవు కోరిన అతడే నిను కొనివచ్చి నా కర్పింపగలడు. అతని రాజ్యమునకు మొగలు సామ్రాజ్యము అభయమిచ్చు గలదు. బాజ్ బహదూర్ మాల్వా రాజ్యము శాంతి సుభిక్షము లతో నుండవలయునని నీవు అక్బరు జనానాకు చేరుట యవ సరము. బాజ్ బహదూర్ ఈ విషయమున కర్తవ్యవి మూఢుడు కాకుండుగాక. రూపమతి! నీరూపము నా కనుల ముందు కదిలియాడి నా హృదయమును కల్లోల పరచుచు న్నది,

ఇట్లు

నీకరుణగోరు—అక్బరు పాదుషా.

ఉత్తరము పూర్తియగుసరికి బాజ్ బహాదూర్ కన్ను లెర్రబారినవి.

"ద్రోహులు, దొంగలవలె వచ్చిన నీచులు. పరుల భార్యలపై నింతటి కాముకత" పండ్లుపటపట లాడించినాడు బాజ్ బహాదూర్.

"ఎంతటి మోస మొనర్చినారు ధూర్తులు. చక్రవర్తులు మంత్రులు, అంతటి కళారాధకుడు తాన్‌సేన్ ఈ కపటమున కెట్లంగీకరించినారో!" రూపమతి యనినది.

"ఆ రాక్షసత్వము మూర్తీభవించిన అగ్బరు ఆజ్ఞకు ఎదురాడిన బ్రతుకవలదా? ఇష్టమున్నను లేకపోయినను అతడంగీకరింపక తప్పియుండదు. మనకేమాత్రమైన శంక కలిగిన బాగుండెడిది. ఆ క్షుద్రకాముని నిక్కడే హతమార్చి యుండెడివాడను" అనినాడు బాజ్.

"మన రాజ్యమునకే ధూమకేతువెక్కడ దాపురించి నాడు ప్రభూ నా మూలమున తమకింతటి యాపద కలుగుట నా దౌర్భాగ్యము. నా సౌందర్యమే ఇంతటి యాపదలు కలిగించినది. పాపిష్టి విధాత నాకీ యంద మేల ఇచ్చినాడు" రూపమతి కన్నుల నీరుబికినది.

"రూపా! నీ కొరకే రాజ్యమునేకాదు. నా ప్రాణము సైతము బలిబెట్టగలను. నీవనినట్లు మృత్యువుకూడ మనలను వేరు చేయలేదు. సైన్యాన్ని సిద్ధంచేసి అగ్బరుతో పోరాడగలను. అపజయమైతే మరణము. ఇరువుర మొకపర్యాయము

స్వర్గము చేరి అక్కడ అమరసుఖము అనుభవించుదాము" అనినాడు బాజ్ బహాదూర్.

"అట్లు కాదు ప్రభూ! నేను సామాన్య నర్తకిని. నా కింతటి అపూర్వ గౌరవాన్ని ప్రసాదించారు. నా కొరకై రాజ్యము, ప్రజలు శత్రువులపాలు గావడం కూడదు. అట్లని నేను మిమ్ము వదలిపోవటం అసంభవము. ఇది నా కలవిగానిది ప్రభూ! ప్రస్తుతమీ యుద్ధమును నివారించ గలిగినది నా మరణమొక్కటే. ఆ తరువాత అక్బరు ఇటువైపు కన్నెత్తిచూడడు," అనినది దుఃఖముతో రూపమతి.

"నీ మరణమా! రూపా! నీవొక వెర్రిదానవు. అక్బరు కాముకుడే కాదు. కామ క్రోధములు పెనవేసుకొనిన హృదయమాతనిది. నీ మీది కామము ఈ రాజ్యముమీది మమకారము రెండునూ అతనినిట్లు ప్రేరేపించినవి. ఈ రాజ్యమాతని వశమగువరకాతడు నిద్రింపడు" అనినాడు బాజ్.

"ఈ వజ్రాలహారము నాకు ఉరిత్రాడువలె కన్పించుచున్నది ప్రభూ! దీని నెటకైన చేర్పించుడు" అనినదిదానిని చూచుటకే అసహ్యించుకొనిన రూపమతి.

"రూపా కొలది కాలములో యుద్ధము తప్పదు. సైన్య సమీకరణ మొనర్పవలయును. నీ వింకొక కోటలోని కరుగుట మంచిది" అనినాడు బాజ్.

"లేదు ప్రభూ! యుద్ధమగువరకు మీ వెంటనుండుటే

నేను కోరునది. సంగీత నాట్యములందారితేరిన రూపమతి విలువిద్య యందెంతటిప్రావీణ్యకతలదియో మీరు చూచెదరు" అనినది రూపమతి.

బాజ్ నవ్వుచు తన అంగీకారమును వెలిబుచ్చినాడు.

*  *  *

ఆదంఖాన్-పీర్ మహమ్మదులు సారంగపూర్ కోటను ముట్టడించినారు. కొలదికాలము తర్వాతవిరాశాతప్త హృదయుడైన అగ్బరు మాల్వా రాజ్యమును స్మశానమొనర్చి వచ్చుటకు ఆజ్ఞయిచ్చి పంపినాడు వారిని.

కోట ముట్టడి జరిగినది, బాజ్ రూపమతులు ఇరువురూ శక్తికొలది ప్రతిఘటించి నిలిచినారు.

మొగలాయి ఫిరంగులు కోటగోడలను భేదించినవి. మొగలాయీలు కోటలోనికి వెల్లువవలె ప్రవహించినారు.

మెరికలవంటి అంగరక్షకులు 5 వందలమందితో బాజ్ మొగలు సైన్యమున మెరుపువలె ప్రవేశించి రూపమతితో సహా పారిపోయినాడు.

పీర్ మహమ్మద్ తన సేవలతో వారిని వెంబడించినాడు. బాజ్ మొత్తముసేనతో నర్మదానది పరిసరముననున్న అడవులలో దాగినాడు. పీర్ మహమ్మద్ బాజ్ కనుపించక వెనుదిరిగి రాజధానీ నగరమును వశమొనర్చుకొని ఆ రాత్రి యంతయు ఆ ప్రజల వధతో కాలము వెళ్ళబుచ్చినాడు.

ఆ నాడు వారొనర్చిన ఘోరకృత్యముల కంతమే లేదు. తనకు త్వరలో మృత్యు వాసన్నమైయున్నదని తెలియని మూర్ఖుడా పీర్ మహమ్మదు. ఆ ఒక్క రాత్రిలోనే నాల్గు వేలమందిని హత్యనొనర్చినాడు. ఆ క్రూరుడచటి బందీలపసి బిడ్డలను గాని స్త్రీలనుగాని హత్య జేయకవదల లేదు.

దురాశా ప్రేరితుడైన ఆదంఖాను ఖజానాను దోచుకొన్నాడు. అంతఃపుర కాంతల నగలే ఒక ఏనుగు మోయగలిగినన్ని ఉండినవట.

బాజ్ అంతఃపుర కాంతలు హిందూపద్ధతిన జోహారు చేసినారు.

ఆదం వారిలో రూపమతి చెల్లెలును మరొక స్త్రీని రక్షింపగలిగినాడు.

పీర్ మహమ్మద్ నర్మద అడవులలో బాజ్‌ను వెదకుచు బయలుదేరినాడు. అతని వెంట బల్‌హాన్ ఫ్రూరుఖజానా యున్నది. అది కనిపెట్టిన బాజ్ తన దండుతో కొద్ది సేన కలిగిన పీర్‌పై దాడి కొనసాగించినాడు. పాపమూ ముందు రాత్రి పీర్ మహమ్మదు చేసిన దారుణ కృత్యముల ఫలితమిది. ఎందరో స్త్రీ బాలవృద్ధుల శాపమాతనికి తగిలినది.

పీర్ మహమ్మదు సైన్యమంతయు నర్మద దాట గోరినది. వారు గుర్రములపై నున్నారు. బాజ్ సైన్యము వారిని పొదివినది. అందరు గుర్రములపై నదిలోనికి దిగినారు. నది పారుచున్నది.

పీరు మహమ్మద్ గుర్రము పారిపోవుటగాంచి బాజ్ బహాదూరు తన ఒంటెను నర్మదలోనికి దించినాడు. రూపమతియు ఆ ఒంటెపైననే యున్నది. ఆమె గురిచూచి బాణమును వదలినది. పారిపోవు పీరు మహమ్మద్ వీపున దిగిపోయినది. హాహాకార మొనర్చుచు పీర్ మహమ్మద్ నర్మదానదిలో గుర్రముపైనుండి పడిపోయినాడు.

చల్లని తన తరంగహస్తములతో తన్నాశ్రయించిన పీరు మహమ్మదు శరీరమును తన గర్భము నందిముడ్చుకొని నది పక్షపాతములేని నర్మద.

వారు సంతోషముతో ఒడ్డునకు వచ్చినారు. బాజ్ తన గుర్రము నెక్కినాడు. కొద్దిక్షణములలో వారి ఆనందము మటుమాయమైనది.

ఆదంఖాను పీర్ మహమ్మదునకు సహాయముగా తన సైన్యముతో వచ్చినాడు.

అదిగాంచిన బాజు అడవులలోనికి గుర్రము నుదాయించినాడు. కాని రూపమతి ఎక్కిన ఉష్ట్రము మాత్రము చుట్టుముట్టబడినది.

రూపమతి బందీయైనది.

ఆదంఖాను ఆమెను తన గుడారమునకు చేర్చినాడు.

ఆ సౌందర్య మాతనికి పిచ్చెక్కించినది అహంకారము నినుమడింప జేసినది.

ఆమెకొరకే అక్బర్ యుద్ధమును నడిపినాడని ఆదం

ఖాను జరుగును. కాని అతని కవేమియు జ్ఞప్తిలేదు. ఆమె ననుభవించుటే అతనికి కావలసినది.

ఆనాటిరాత్రి ఆదం ఆమెకడ కరిగినాడు. తనను వివాహమాడు మనినాడు. ఆమె ఛీ యనినది. అతడు క్రేక పడినాడు రూపమతి తన్నాతడు చెరుచునను కొనినది. వెంటనే మొలయందలి కైజారుతో వక్షమున బొడుచుకొని ఒరిగి పోయినదా లావణ్యమూర్తి భూమిపైన.

ఆదంఖానుని కన్నులపొర లప్పటికే యూడినవి.

అక్బరు పాదుషా యుద్ధమొనర్చినది రూపమతికొరకు. తన అత్యాచారమునకు ఆమె బలియైనది. ఇది అక్బరు సహించునా!

రూపమతి ఆత్మహత్య వృత్తాంతము అక్బరున కెరిగించినాడు. ఆదంఖాను తానొర్చిన అత్యాచార మెవ్వరికిని తెలియదనుకొనినాడు. కాని అప్పటికే ఆ విషయము కొందరకు తెలిసిపోయినది.

అజ్మీరునందున్న అనాగాకు ఈ విషయమై తెలిసినది. ఆమె హుటాహుటి సారంగపూరునకు పయనమైనది.

అక్కడ కరుదెంచిన అక్బరు రూపమతి మరణము నకు నిజముగనే విచారించినాడు. రూపమతి చెల్లెలు బాజు బహదూరు చిన్న చెల్లెలు ఇరువురు ఆదంఖానుచే దాచబడినారు. తాను దాచుకొనిన సంపదనంతను బలవంతముగ ఆదంఖానుచే తప్పించినాడు అక్బరు.

తాను దాచిన స్త్రీలను మాత్రము ఆదంఖాను అగ్బరున కప్పగింపలేదు. అది తెలిసిన అక్బరుషంషుద్దీన్ అటాకాను ఆ స్త్రీలకొరకు పంపినాడు.

ఆదంఖాను వ్యతిరేకించినాడు, అటాకా ఆ స్త్రీలను వదలిపోవుటకు ఇష్టపడలేదు. వారిని అప్పగించిన ఆదంఖానుకు శిక్షతప్పదు. రూపమతి ఆత్మహత్యా వృత్తాంతము అటాకా డనే అటాకాకు తెలిసినది.

భయంకర కూ్రరరాక్షసి అనాగా తన కుమారునికి శిక్ష తప్పించుటకై ఆరాత్రియే అప్సరసలవంటి సౌందర్యవంతులు తాజు, రూపమతుల చెల్లెండ్ర నిరువురనుచంపి వైచినది. మరునాడు వారి విషయమే తమకు తెలియదని బొంకినారు తల్లి కుమారు లిరువురు.

అటాకా విచారముతో అగ్బరుకడ కరిగి సర్వ విషయములు నివేదించినాడు. రూపమతి ఆత్మహత్య విషమై విన్న అగ్బరు ఆగ్రహమునకు మేరలేదు. అత డాదంను పిలిపించి దూషించి నిరసించినాడు. హంతకుడనినాడు. సేనాపతి పదవినుండి తొలగించాడు.

ఆదం అటాకాపై కత్తిగట్టినాడు.

తరువాత కొలది రోజులకు ఆగ్రారాకు భవనమున పలువురుసభ్యుల ముందు ఆదంఖాను షంషుద్దీను అటాకాను హత్యయొనర్చినాడు. అది తెలసి నిద్రలేచిన అగ్బరు ఆదంఖానును బంధింపజేసి అంతఃపురము మెట్లపైనుండి తలక్రిందులుగా లాగించి చంపించినాడు.

మాల్యానగర ప్రజల హత్యలకు ఆరు నెలలు తిరుగక ముందే ఫలిత మనుభవించినారు వీరు ఆదంలు.

## [illegible]

As early as 1591 when Akbar had an attack of colic Badaoni testifies that there was a romour in court circles that his eldest son had given him poison.

"Baba Shaikji" the Emperor is said to have exclaimed at the time 'Since all this Sultanate will devolve on thee, why hast thou made this attack on me"?

Badaoni II Tr. Lowe. 390.

తన కుమారుని ద్వేషమునకు కారణము తన చర్య లేనా లేక అతనిలోని దురాశయా!

తానొనర్చిన దేమి? ఖుస్రూను రాజును చేయుట యేమి? మురాద్ బ్రతికివుండిన సలీమ్‌ను తాను పాదుషాగా నొనర్చువాడా? మురాద్‌పై తాను చూపించిన అధిక ప్రేమయే సలీమ్‌ను రెచ్చగొట్టినది. పెద్దవానిని నిరసించి చిన్నవానికి రాజ్యమీయ బూనుట అపరాధమే.

తాను సలీము ప్రేమను విఫల మొనర్చినాడు. మీ హిరున్నిసాను అత డెంతగా ప్రేమించినాడో? రాజ్యవ్యవస్థ కది తగనిది కావచ్చు. వారి ప్రేమను నిరాకరించుటకు తానెవ్వరు? అభిమాని సలీమ్ ప్రార్థించినను వినలేదు. ఆనాడు సలీమ్‌ను తాను ప్రేమించలేదా బైరామ్ ఖానుకు

తనవలన కల్గిన దుర్గతియే ఇప్పుడు షేర్ ఖానుకు సంభవించునా? కుమారునికి మెహిరున్నిసా జ్ఞప్తికి వచ్చినప్పుడెల్లనాపై ద్వేషము పెరుగుచున్నది కాబోలు? విషప్రయోగ మప్పుడాతడే యొనర్చి యుండుననుకొనిన వార్తలు నిజమేనేమో? విఫల ప్రేమకు నాప్రేమను విఫలమొనర్చిన వారిని మన్నించునా! వారి ప్రేమ అక్బరునకు జ్ఞప్తికి వచ్చినది.

........ ... ... ... ....

జహాపనా!

"ఏమి సలీమా!" తాగిన మైకముతో అనినాడు అక్బరు.

"మన సలీము విషయము" సలీమా యనినది.

"సలీము విషయమేమి? అతడు దినదినము తాగుడు మైకమున మునిగిపోవుచున్నాడట."

"మురాద్ కన్న నయమే జహాపనా!"

"మరి షేకు బాబా విషయము!" షేకు బాబా జహాంగీరును అక్బరు పిలచెడి పేరు.

"అతని ప్రేమ విషయము ప్రభూ!"

"సలీము ప్రేమించినాడా? ఎవరిని సలీమా!" అడిగినాడు అక్బరు."

తనప్రేమ విఫలము కాకుండ చూడుమని నన్ను ప్రార్థించినాడు యువరాజు" అనినది సలీమా.

"ప్రేమవిషయమై నీ కనుభవమున్నదని అతనికి తెలి యును సలీమా. అందుచే నీ సహాయముకోరి ఉండవచ్చును" తమ ప్రేమ విషయమై జ్ఞప్తికివచ్చి అనినాడు అక్బరు.

"ప్రేమించుట ప్రభువుల కలవాటే కదా!"

"ఇంతకూ ఎవ్వరా ప్రేమికురాలు? షేకు బాబా మనసు నంతిగా దోచిన వనిత మన గౌరవ సంప్రదాయము లకు తగినదేనా?"

"మనకు తగినవారు మన అధికారమునకు తూగగలి గినవారు ఈ హిందూస్థానమున నెవ్వరున్నారు జహాపనా?"

"చిత్తూరు రాణాకుమార్తెను షేకుబాబా కడుగవలె నని యున్నది సలీమా! వారొక్కరే ఇప్పుడు మొగలు సామ్రాజ్యమును వ్యతిరేకించుచున్న రాజపుత్రులు. ఈ వివాహమైన మేవాడ మొగలురాజ్యములకు బంధుత్వమే ర్పడును. లేనియెడల మేవాడ మొగలుసామ్రాజ్యమున కలసి పోగలదు. ఇదినా ఆలోచన సలీమా."

"అవి రాజకీయమైన వివాహములు ప్రభూ! ఇది ప్రేమకు సంబంధించినది."

"ఇంతకూ ఆ వ్యక్తియెవరు?"

"మన పరిజనులలోని వ్యక్తియే కాని ప్రపంచమునే మోహింపజేయు గలిగిన అందమామెది, సలీము తన ప్రేమకు తగిన వ్యక్తి నెన్నుకొనినాడు ప్రభూ" సలీమా యనినది.

"అందమొక్కటి చాలదు. వ్యక్తిత్వము, వంశము.

నా వలన నీ అనుమాన మేమో అర్థమగుట లేదు, ఆమె ఎవరు?"

"ఫిరూన్ బేగ్ కుమార్తె మిహిరున్నీసా" సలీమా యనినది. అక్బరు ముఖము ముడతలు పడినది.

"ఫిరూన్ బేగ్ ఆ కాబూలు సర్దారుడా? భావి మొగలు పాదుషా ఒక అనామకుని కుమార్తెను పెండ్లాడునా?"

"పాదుషా వారు తలచుకొనిన ఆ అనామకుడు కొలది రోజులలోనే పేరు ప్రఖ్యాతులు గలవాడు కావచ్చును" సలీమా యనినది.

"వలదు సలీమా ఈ వివాహము జరుగునది కాదు. తన తాహతుకు తగని పోకడలు పోవుచున్నాడు ఫిరూన్ బేగ్."

"అతనికి విషయ మింతవరకు తెలియదు జహాపనా! ఆ ప్రేమికులను విడదీయుట మంచిది కాదు. తమను ప్రేమించు నాటికి నా తండ్రి అధికార మెంత జహాపనా? ప్రేమ యనునది వ్యక్తిగతమైనది. ఈ విషయమై మీరాలోచించుట అవసరము. సలీము పట్టుదలగల యువకుడు. అతడు బాధ చెందుట రాజ్యమునకే మంచిది కాదు" సలీమా యనినది.

"అట్లని నాడా సలీము?"

"అతడన లేదు. నేననుచున్నాను. విఫల ప్రేమికుని హృదయము విషబీజముల కాలవాలము."

"ఆ వ్యక్తియే కన్పించక పోయిన ఆ ప్రేమయే అణగిపోవును" అక్బరు ముఖమున కుటిలమైన చిరునవ్వు విరిసినది.

"అంతపని వలదు జహాపనా! అది సలీమును రెచ్చగొట్టక మానదు. అంతటి అందము నేలగలిపివైచుట మానవతకు చిహ్నము కాదు."

"సలీము ఈ విషయమై పట్టుదల మానుకొనవలయును" అగ్బరనినాడు.

సలీమా ముఖమున అసహ్యము పొడసూపింది.

తన భర్తలో ఎంతటి క్రౌర్యము ఇమిడి యున్నదో ఊహించుకొనిన ఆమె హృదయము దడదడలాడినది.

"సలీమా! షేకుబాబా మనస్సు మార్చుటకు ప్రయత్నించుము. అతనికి సంబంధమును వదలివేయుట అవసరమని తెలుపుము" అన్నాడు అగ్బరు.

సలీమా బేగం వెడలిపోయినది.

ఆమె కొరకై ఆమె తెచ్చువార్తకొరకు ఎదురు చూచినాడు సలీమ్ అంతఃపురమున.

సలీమా అతనివద్దకు వచ్చినది.

"ఏమన్నాడమ్మా పాదుషా వారు?" ఆతృతతో అడిగినాడు సలీము.

ఆమె మాటాడలేదు. ఆ ముఖమున విచార రేఖలు తొంగి చూచినవి.

"ఆ హృదయము కఠిన పాషాణము సలీమ్. దానిని మార్చుట మనవశమైనదికాదు" అనినది సలీమా.

"పాదుషా వారేమనినారు?" అతని స్వరము గంభీరమైనది.

"అనుటకేమున్నది? ఇది మన హోదాకు తగిన సంబంధము కాదనినారు, అనామకుని బిడ్డను యువరాజు వివాహమాడుట కూడదనినారు."

"అవును. నేను యువరాజును. ప్రేమించిన యువతిని పెండ్లాడుటకు అసమర్థుడనైన యువరాజును."

"పాదుషా వారిందు రాజకీయముల నూహించుచున్నారు సలీమ్."

"ప్రేమకు రాజకీయములకు పొంతన కుదురునటెక్కడమ్మా! నా వివాహముతో ఆయన రాజ్యములను సంపాదింపదలచుకొన్నాడు. ఈ వివాహమే జరగనినాడు... సలీమ్ ఊరకుండడు."

"నీకు పట్టుదలవద్దు సలీమ్. పాదుషా వారి ఆలోచనలు మరింత క్రూరముగా నున్నవి."

"పాదుషా వారేమి చేయునమ్మా? నన్ను నిర్బంధించి కారాగారమున నుంచును. లేకనన్ను చంపించును అంతియే. మిహీరున్నిసా నాది. కానినాడు నేను" అదే కోపోద్రేకముతో అనినాడు సలీమ్.

"అదికాదు పాదుషా వారియాలోచన? మిహీరున్నిసానే

ఆతడేమైనా చేయించునేమో యని నా యనుమానము" సలీమా యనినది.

సలీమ్ నిర్విణ్ణుడైనాడు.

"అమ్మా! మిహిరున్నీసాను పాదుషావారు చంపించిన ఈ సలీమ్‌ను మీరు మరిచూడరు. ఈ మొగలువంశమే లేకుండ రూపు మాపివేయుదును. ఈ విషయమే పాదుషా వారికి తెల్పు."

"వద్దు సలీమ్. మీ తండ్రి కుమారుల పట్టుదలలు రాజ్యమునకే మోసము తెచ్చునవి" అనినది సలీమా.

"లేదమ్మా! ఈ రాజ్యము సర్వనాశనమైన నాకిష్టమే. లేక రాజ్యమునే వదలివేయుమన్న వదలెదను మిహిరున్నీసాను వదలను. వదలను. వదలలేను."

అగ్బరు దేంచినాడటకు.

సలీము సమస్కరించి నిలచినాడు. అతని ముఖము కోపముచే ఎర్రనైనది.

"షేకు బాబా! నీకు వదలజాలనిదేది?" చిరునవ్వుతో అడిగినాడు అగ్బరు.

"మిహిరున్నీసను జహాపనా! ఆమెను ప్రాణాధికముగ ప్రేమించినాను. మా ప్రేమను మన్నించి ఆశీర్వదించండి జహాపనా!" వినయముగ ప్రార్థించినాడు సలీమ్.

"నీ ప్రేమ ఆస్థానముతీతమైనది. దానిని మన్నించుట రాజ్యానికే ముప్పు" అనినాడు అగ్బరు

"నాకీ రాజ్యమే అవసరంలేదు జహాపనా! నా మిహిరును నాకు అనుగ్రహించండి మురాదునే మీ వారసునిగా నిర్ణయించుకోనండి" ఉద్వేగంగా అన్నాడు సలీమ్.

"సలీమ్ అనవసరమైన విషయాలు మాట్లాడకు. మీ వివాహం దైవ నిర్ణయం కాదు. ఈ వివాహం జరుగరాదు,"

"జహాపనా !" కోపంగా అన్నాడు సలీమ్

"నా వివాహాన్ని నిర్ణయించుకొనే హక్కును నిరాకరించారు. నా మిహిరును ఈలోకంనుంచే పంపుతానన్నారు అమ్మతో. అది జరిగిననాడు మీ సలీమ్ మీకు ఉండడు. మీకు సలీమ్‌పై ప్రేమలేదని నాకు తెలుసు. సలీమేకాదు ఈ మొగలు వంశమే ఉండదు. మిహిరున్నిసా మరణించిన నాడు ఈ సలీమ్ రాక్షసుడౌతాడని మాత్రం గ్రహించండి. ఏనాటికయినా మిహిరున్నీసా నాదికాక తప్పదు. సెలవు" అంటూ పాదుషావారి ఆజ్ఞలేకుండానే అంతఃపురం వదలి వెళ్ళినాడు సలీమ్.

సలీమా అనునయవాక్యములతో అక్బరు స్వస్థచిత్తుడైనాడు, మిహిరున్నీసాను వెంటనిడుకొని సలీమ్ గుల్ బదన్ బేగమ్ అంతఃపురమున కరిగినాడు.

అక్బరు మేనత్త గుల్ బదన బేగమ్. అంతఃపురముపై అధికారమంతయు ఆమెదే. ఆమె అనుజ్ఞ లేనిదే అంతఃపురమున గాలికూడ చొరకూడదు. అక్బరుపై ఆమెప్రభావము ఎక్కువ. సలీమనిన ఆమెకు అధికమైన ప్రేమ.

మిహిరున్నిసా అందముఆమెను ఆకర్షించినది ఆమెను స్వీకరించి ప్రాణాపాయము జరగకుండ రక్షింతునని సలీము నకు వాగ్దాన మొనర్చినది గుల్ బదన్ బేగమ్.

తండ్రి కుమారులమధ్య ఈ జగడము చిలికి చిలికి గాలివాన యగునేమోనని భయమన్నదామె.

చివరకామె భయమే నిజమైనది.

అగ్బరామె మాటలనుకూడ తిరస్కరించినాడు కాని మిహిరున్నీసా ప్రాణములను రక్షింతునని మాట మొసగి నాడు.

* * *

"అబుల్ ఫజల్ ! ఈ విషయమెట్లు సరిజేయుట"

"ఏవిషయము జహాపనా?" అబుల్ ఫజల్ అడిగినాడు. యువరాజు మిహిరున్నీసాను వివాహమాడెదననుచున్నాడు ఆ వివాహము నా కంగీకారముకాదు. సలీమ్ ఆమె కొరకై రాజ్యమే వదలెదననుచున్నాడు. ఎట్లీ సమస్యను పరిష్కరించుట !"

"ఆ ప్రేమికులను విడదీయుటేల జహాపనా?" అబుల్ ఫజల్ అనినాడు జంకుగా.

"ఇది జరుగదు అని మేము నిశ్చయించినాము. సలీమ్ చిత్తూరు రాకుమార్తెను చేపట్టవలెనని మా ఆకాంక్ష" అనినాడు అగ్బరు.

"మిహిరున్నిసాకు మరెవరితో నయిన వివాహము

జరిపించితే సరిపోతుంది జహాపనా ఎక్కడో దూరమైనచోట ఆతనికి ఉద్యోగమిచ్చి పంపివేయవచ్చు" అబుల్ ఫజల్ అనినాడు.

అక్బరుకా ఆలోచన బాగుగానున్నది.

"చక్కని ఆలోచన మిత్రమా ? ఆ అందగత్తెకు తగిన వరుడెవడు ?" అక్బరు అడిగినాడు.

"జహాపనా ! సలీమున కిప్పుడు కుడిభుజముగా నున్నాడు ఆలీకు సలీము. ఇంతటివాడుగా మారాడానికి కారణమతడేనని నాకు అనుమానము. అతడు తార్డిబేగ్ కు కూడ దగ్గఱవాడు. అతని సలీము నుండి విడదీయుట అవసరము. ఇప్పుడీ మిహిరున్నిసాను అతనికిచ్చి వివాహము జరిపించిన సలీమున కాతనితో సంబంధము పూర్తిగా తెగిపోవును" అనినాడు అబుల్ ఫజలు.

"ఒకే బాణముతో రెండుపక్షులు బాగుగానున్నది మిత్రుడా!" అనినాడు అక్బరు. అతడొక నిర్ణయమున కరుదెంచినాడు.

o o o

"మిహిర్ ! మన ప్రేమ కింతటి విఘాతము కల్గునను కొనలేదు, పాదుషా హృదయము శిలతో మలచబడినది మిహిర్. ఈ రాద్యమునే వరులుటకు సిద్ధపడినా అతడిష్టపడలేదు మిహిర్ !"

సలీమ్ కన్నీరుగార్చుచు మిహిరున్నిసాను కౌగిలిలో పొదుపుకొనినాడు.

"నిన్ను వదిలి వేరొకనిని వివాహ మాడుదునా సలీమ్! ఇంతకన్న మరణము మేలు. నీవు లేని నాకీ జీవితమే అవసరము లేదు సలీమ్"

"అంతమాట అనకు మిహిర్! నిన్ను రక్షించుటకొరకు నేను నీ వివాహమునకు ఒప్పుకున్నాను. ఏనాటికయినా నీవు నా రాణివి కాక తప్పదు. నీకు నేను పెట్టుకొనిన పేరు ప్రపంచంలో వెలుగక తప్పదు నూర్ జహాన్"

"నేనెంత దురదృష్టవంతురాల్ని సలీమ్ ఒకరికి మనసు నిచ్చి మరొకని భర్తగా జూడటం ఎంతటి అసహ్యమైనది. ఆ బ్రతుకు ఏమి బ్రతుకు సలీమ్!"

"ఇది మనకు తప్పదు మిహిర్. ఈ ఎడబాటు భగవన్నిర్ణయము. నేను ఎప్పటికీ నీ వాడనే ఇది నా ఇష్టముపై జరుగుచున్న వివాహము. ఇది మా అమ్మ సలీమాబేగం చెప్పిన ఉపాయం మిహిర్!"

"నీకొరకే నా ప్రాణాలను నిల్పుకుంటాను సలీమ్. నీ కొరకే పరాయివాని భార్యనౌతాను, పాదుషా వారికి మనయందు కరుణలేకపోయినది,"

"యుద్ధాలతో కరుడుగట్టిన ఆ గుండెలో కరుణకు స్థానంలేదు మిహిర్. ఈ అనాగరిక కార్యానికి పాదుషా ఫలితమనుభవించక తప్పదు. నా స్నేహితుని నాకువిరోధిగా

మార్చడానికి అబుల్ ఫజల్ పన్నాగము పన్నినాడు. దాని ఫలితము నాతడు చవిచూడగలడు. ఇక నీ సలీమునిప్పుడే నీవుచూడలేవు నూర్జహాన్! తిరిగినిన్ను అంతఃపురానికి తెచ్చు కొనునప్పుడే పునర్దర్శనం" సలీమ్ అన్నాడు.

"నన్ను మరువనని ప్రమాణం చెయ్యి సలీమ్" మిహిర్‌న్నిసా దుంఖించుచు అడిగినది.

"ఎన్ని సంవత్సరాలకయినా నిన్ను నారాణిగా చేసి కొంటాను మిహిర్! ఈ సలీమ్‌ను మాత్రం మరువకు"

ఆమె చెక్కిళ్ళను ముద్దుపెట్టుకొని కవుగిలివదలికారే కన్నీటిని తుడుచుకుంటూ అక్కడనుండి వెళ్ళిపోయినాడు. సలీమ్.

తెరవెనుకనుండి ఈ సంభాషణను విన్న గుల్ బదన్ బేగం కన్నీర్ను తుడుచుకొన్నది.

సలీం హృదయమున నాటబడిన ద్వేషబీజము ఎన్ని విధాలైన విషవృక్షాలను పుట్టింపజేయునాయని ఆమె ఆంతో ళన.

తరువాత మిహిరున్నిసాను అలీకులీకిచ్చి అగ్బరు ఒత్తిడిపై ఘియాస్ బేగ వివాహం చేశాడు. బెంగాలులో ఒక చిన్న సేనాపతిగా అతను పంపబడ్డాను. అంతటితో సలీమ్ ప్రేమను అణచివేసి అతనిద్వేషాన్ని పెంచుకున్నాడు అగ్బరు.

తరువాత కొలదిరోజులకే అగ్బరు జబ్బు పడ్డాడు.

"నీ ప్రజలేమను కొనుచున్నారో ఎరుగుదువా అగ్బర్! రాణా ప్రతాప్‌ను జయించలేక అతని విగ్రహమును తోట యందుంచి అగ్బరు ఆ దేశభక్తుల నవమానించి తృప్తిజెందు చున్నాడని."

"లేదు ప్రతాప్. నీమీది గౌరవమే నన్నట్లు చేయించినది, మాతృదేశ స్వాతంత్ర్య రక్షణకై బహుక్లేశముల పాలై రాజ్యసుఖములకైన నోచుకొనక మరణించిన నీవు దేశ భక్తుడవు సామ్రాజ్యదాహముతో హిందూదేశమునంతను యుద్ధములతో ఓడించి పాలించిన నేను గడించినదేమి? ప్రతాప్! సర్వమొగల్ సామ్రాజ్య చక్రవర్తినని గర్వించి చేసిన దుష్కార్యముల ఫలిత మిప్పుడే అనుభవించుచు న్నాను, నా చివరిక్షణములలో నొక్క మంచిమాట, ఒక్క సానుభూతి వాక్యము, ఒక్క ప్రేమతో గూడిన కన్నీటిబొట్టు చివరకు అయోధ్యయునిదైన అనువారు లేక మరణించ బోవుట మాత్రమే మిగిలినది. నా పుత్రుడే నాకు అవిగో పంపినాడు బహుమతులు విషపాత్రికైజారులు. అవే చివ రలో ఈ జయించిన సామ్రాజ్యములో నా వెంటనంటినవి.

దుఃఖముతో విలపించినాడు అగ్బర్.

ప్రతాప్ లేడచట.

మేవాడ రాజ్యమునకు ప్రతాప్ రాజైనాడు, అతని రెండవ తమ్ముడు జగమల్‌సింగు ఆ రాజ్యము తనకు తన తండ్రి యొసగినాడనినాడు. అన్నపై శత్రుత్వము వహించిన

జగమల్ అగ్బరు చక్రవ ర్తిని శరణుజొచ్చినాడు. అవకాశ మున కెదురుచూచు అగ్బరు వెంటనే ఆతని కభయమిచ్చి అతనికి బజాజ్‌పూర్‌ను జాగీరుగా నొసగి సామంతునిగా నొనర్చికొనినాడు.

అగ్బరు మానసింగును మేవారు రాజ్యమునకు తన రాయబారిగా పంపినాడు అనేక బహుమానములతో బయలు దేరినాడు మానసింగు.

అగ్బరొనర్చిన రాజకీయ కుటయిది.

తనకు నామమాత్రముగ లోబడి మొగలు సామ్రా జ్యమును అధిపతిగా అంగీకరింపుమని ఆ రాయబారము.

ఈ రాయబారము నెట్లైన రాణాప్రతాప్ తిరస్కరిం చును. అది మానసింగునకు అవమానము. అవమానము పొందిన రాజపుత్రుడు పామునలె పనిచేయును. అందువలన ఆ రాయబారమునకు మానసింగునే పంపినా డగ్బరు.

రాణాప్రతాప్ వంశమే సర్వరాజపుత్ర లోకముపై అధికారము కలిగిన వంశము..

తనకొరకై వచ్చిన మానసింగును ప్రతాప్ కోటబయటి ద్వారము కద్ద కెదురేగి స్వాగతమిచ్చి కొనివచ్చినాడు.

ప్రతాపసింహుడు తనకంతటి గౌరవమీయగలడని యనుకొనని మానసింగ్ అతని ప్రవర్తనకు ముగ్ధుడైనాడు. అతడు అగ్బరు చక్రవర్తికి లోబడుటకే సుముఖుడుగా నున్నాడనికూడ తలంచినాడు.

సర్వ రాజపుత్ర నాయకులట సమావేశమైనారు. అగ్బరు చక్రవర్తి పంపిన మణిమయాంబరములు వజ్రములు మొదలగు వస్తువులన్నియు మానసింగు ప్రతాప సింహునకు సమర్పించినాడు.

"తమ పట్టాభిషేకోత్సవపు కానుకలుగాని వన్నియు మొగలు చక్రవర్తి రాణావారికి పంపిన బహుమానములు" మానసింగ్ చెప్పినాడు.

"మానసింహ మహారాజా! ఈ బహుమానములెల్ల మా కెందులకు పంపినాడగ్బరు సార్వభౌముడు? వీరునకు పంప వలసిన బహుమాన మొక్కటే. అది ఖడ్గము. అదియు అగ్బరు చక్రవర్తి పంపినాడు, దానిని మాత్రము స్వీకరింతును."

"తను స్నేహమునుకోరి చక్రవర్తి పంపిన నజరానాలు త్రిప్పిపంపుట స్నేహ సంప్రదాయము కాదు." మానసింగ్ అనినాడు.

"తమ చేతనే యీ రాయబారమంపుటలోని అంతర్యమును తాము గ్రహించినారా మహారాజా!"

ఏమనునట్లు చూచినాడు మాన్‌సింగ్.

"తమరు తెచ్చిన బహుమానములను నేను తిరస్కరించిన అది తమ కవమానము. నేను వానిని స్వీకరిపననునది అగ్బరు చక్రవర్తి నిశ్చయము. నావలన తమ కవమానము జరిగిన మిమ్మే నాపైకి మోహరింపజేయుట అతని ఉద్దేశము.

మొగల్ సామ్రాజ్యమున ఈ రాజపుత్రు నెదుర్కొనగలిగిన సాహసముగలిగిన మగవాడు మీరుదప్ప మరెవరున్నారు! సాటి రాజపుత్రునితో కయ్యమునకు మీరు దిగరేమో యను అక్బరులోని శంక ఆతనిచే ఈ ఎత్తు వేయించినది." అనినాడు ప్రతాప్.

అది నిజమే ననిపించిన దాతనికి. ప్రతాప్ ఆలోచనా పద్ధతి కాతడు ముగ్ధుడైనాడు.

"మరొక మహమ్మదీయ సర్దారు దఖుపెంచిన ఈ బహుమానముల త్రిప్పి పంపెడువాడనే కాని తమయందలి గౌరవముతో దీనిని స్వీకరించుచున్నాను. ఇంతకీ అక్బరు సందేశమేమి మహారాజా?" రాణాప్రతాపసింహు డడిగినాడు.

మాన్‌సింగ్ ఒక్క క్షణ మాగినాడు.

"రాణా వారు నామమాత్రముగ మొగలాయీ సామ్రాజ్యాధిపత్యమును అంగీకరింపవలెను" మాన్‌సింగ్ అనినాడు.

"అంతియేనా మాన్‌సింగ్! మేమింకొక విషయము వినినాము. అది నీ రాయబారమున చేర్పబడలేదా?" రాజా చంద్రసేనుడనినాడు. ఆనాటి మొగలుల ప్రతిఘటించి నిలచిన వారిలో నాతడొక ముఖ్యుడు. రాజా పురాణమల్‌కు ఆశ్రయమిచ్చిన మాల్దేవు కుమారుడు.

"ఏమది?" ఎదురుప్రశ్న వేసినాడు మాన్‌సింగ్.

'రాణావారి కుమార్తెను యువరాజు సలీమునకు వివాహమొనర్ప వలయునని" చంద్రసేను డనినాడు.

'అదియు నా రాయబారములోని భాగమే" మాన్ సింగ్ ఒప్పుకొనినాడు.

"ఈ రాయబారము కొని తెచ్చుటకు నీకు మనసెట్లు వచ్చినది మాన్‌సింగ్ అవును సలీమ్ నీకు రక్తసంబంధికుడు కదా! పిల్లనడుగక నీవేల మానెదవు?" హేళనగా ననినాడు చంద్రసేనుడు.

ఈ హేళనకు మానసింహుడు ఉడికిపోయినాడు.

"ఇది నిజమా మాన్‌సింగు మహారాజా?" ప్రతాపసింహుడడిగినాడు.

"నిజమే. జిమూరాణి పుత్రుడందులకు తగడా?" మాన్ సింగు అనినాడు.

"జిమూరాణి పుత్రుడయిన తగియుండెడివాడే. ఆనందముగా నా కుమార్తెనిచ్చి యుండెడివాడను. కాని పాపవశమున అతడక్బరు కుమారుడయినాడు" ప్రతాప్ అనినాడు.

మాన్‌సింగు గుండెలలో బాకు దిగవేసినట్లయినది ఈమాటలకు.

"సరియే తమకు అక్బరుచక్రవర్తికిచ్చెడి సమాధానము" మాన్‌సింగు అడిగినాడు.

"సమాధానమేమున్నది మహారాజా? రాజపుత్రు

కయిన వాడెప్పుడును తన ప్రాణముకొరకు స్వాతంత్ర్యమును తాకట్టుపెట్టడు మొగలు సామ్రాజ్యమందలి భోగ భాగ్యములకన్న నాకు అభిజాత్యాభిమానములే ముఖ్యములు. మా స్త్రీలు మొగలు అంతఃపురమునందలి సంపదలనుభవించుటకన్న అగ్నిదేవుని జ్వలించెడి శిఖలను కోరుచుందురు. నేను మొగలు సామ్రాజ్యమునకు తలయొగ్గుట ఈ బొందిలో ప్రాణముండగా జరుగదు, నా కుమార్తెనే సామాన్య రాజపుత్రునకయిన సంతోషముగ నిచ్చెదను గాని ఆ మ్లేచ్ఛునకీయను" తన నిర్ణయమును వెలిబుచ్చినాడు ప్రతాప్.

యువరాజు అమరసింహుడు విందు సిద్ధమైనదని పోయినాడు. ఉదయసాగరము తీరమునయున్న రాజభవనమునకు చేరినారు రాజపుత్రనాయకులు.

విందులో అందరు తమ తమ యాసనములందు కూర్చున్నారు. సర్వభోజన పదార్థములు వడ్డింపబడినవి. మాన్‌సింగ్‌కు ఎదురుగా రాణా ప్రతాప్‌సింహుడు కూర్చుండినాడు. అతనిముందు మాత్రము భోజనము వడ్డించలేదు.

మాన్‌సింగునకు అవమానమైనది.

"మహారాణా వారికీ భోజనమేలనో వడ్డింపలేదు." మాన్‌సింగు అడిగినాడు.

"నాకు కడుపునందు సంకటముగానున్నది. ఇప్పుడు భోజన మొనర్చలేను. క్షమించి అతిథులు భోజనమున కుపక్రమింపవచ్చును"

రాణా ప్రతాప్ చెప్పిన కారణము వెనుకనున్న నిజము గ్రహించినాడు మాన్‌సింగు. కోపముచే అతని కనులరుణారుణము లయినవి. మహమ్మదీయులతోడి తమ సంబంధమే ఈ తిరస్కరణమునకు కారణము. అతని ఆగ్రహమునకు మేరలేదు.

"ప్రతాపసింహా! నీ రోగమునకు తగినమందు నావద్దనున్నది. ఇందరు రాజపుత్రులమెదుట నీ వొనర్చిన ఈ అవమానమునకు త్వరలో ప్రతీకారము రుచిచూచెదవు. నా ఓరిమిని పరీక్షించినావు. నా ఆగ్రహమెట్టిదో చూడగలవు. నీయింట భుజించుటకు నాకేమి అవసరము!" మానసింగ్ అనినాడు.

"మొగలులు వేయుకూటి రుచిని మరగినవారికి తోటి రాజపుత్రిడిడిన భోజనము రుచించునా? ఇంకనూ నీవంటటి హైన్యమును భుజింపవలయునో భగవంతుడెఱుగును మాన్‌సింగ్! నీ పంక్తి నీ రాజపుత్రులందరు భుజింప నొనర్చి నీకు గౌరవమును చేకూర్చిన రాణాకు కృతజ్ఞత చూపక నింద కుదిగిన నిన్నేమనవలయునో తెలియదు! ఈ రాజపుత్రుల అభ్యర్థనపైననే అతడు నీపంక్తిని త్యజించినాడు. నీకుతగని ఈ గౌరవ మిచ్చుటయే వీరి అపరాధము" అనినాడు చంద్రసేనుడు.

"మొగలులతోడి నా సాంగత్యమును తెగడిన మీరే ఆ మొగలు పాదుషా పాదము లంటినప్పుడు నన్ను జ్ఞప్తికి తెచ్చుకొందురుగాక."

"మాన్‌సింగ్ మహారాజా! మీరు కోరినచోట యుద్ధ మొనర్చుటకు సంసిద్ధుడను. మీరుకాని, మీ బంధువు పాదుషా అక్బరుకాని నాతో ద్వంద్వయుద్ధ మొనర్చి జయిం చిన నా మేవారు రాజ్యమును మొగలు సామ్రాజ్యమున కలిపి వేయుదును.

మీ గోడిన నా రాజ్యమువైపుకి చూడకుండునట్లు ప్రతిజ్ఞ చేయుడు." అనినాడు ప్రతాప్.

మానసింగు పలుకలేదు. ప్రతాప్‌ని జయించగల్గిన వీరుడానాడు లేడు.

"వారి ప్రతిజ్ఞలకు విలువలేదు. ఆసీర్‌ఘర్‌లో మీరాన్ బహదూర్ గోండ్వానారాణి దుర్గావతి, నూర్ జాన్, వీరందరీ ప్రతిజ్ఞలవలనే జయించబడినారు. మోసమే వారి ప్రతిజ్ఞకు మూలాధారము రాజా భగవాన్‌దాసు అం దులకే యాకూబ్‌ను రక్షింపలేక ఆత్మహత్యకు ప్రయత్నిం చినాడు" చంద్రసేను డనినాడు.

మానుసింగున కా సంభాషణ వినుట దుర్భరమయి నది. అవమానాగ్ని దహించుచుండ విందుపద్దనుండిలేచి పరిజనులతో వెడలిపోయినాడు.

రాణాప్రతాప్ విచారిపడినాడు జరిగినదానికి.

మొగలాయీ సైన్యమునకు మానసింగు ఆధిపత్య మువహించినాడు. హాల్దీఘాట్ యుద్ధమున ప్రతాపు ఓడి నాడు——

కాని జీవించి యున్నంతవరకు కొండల కోనల కష్టముల పాలయినను ప్రతాపు తన స్వాతంత్ర్యమును వీడలేదు. అగ్బరు కోర్కె నెరవేరలేదు.

ఎన్నికష్టములపాలైనను రాణాప్రతాపు అమరజీవి.

# 13

"సలీమ్!"

"వీడు నా కుమారుడేనా?"

"నా రక్తమే వీనిలో ప్రవహించుచున్నదా?"

"నే నొర్చిన యపరాధమేమి!"

"ఇంతరాజ్యమును సంపాదించిన దెందులకు? అతని కొరకు కాదా? నాపై కుమారుని కింత ద్వేష మెందులకు!"

"ఈ బిడ్డకొరకు నేను పడిన బాధలెన్ని! పేకుబాబా అనుగ్రహమున కలిగిన వీనికినాపై ఇంతటి ద్వేషము, అసహ్యమేల కలిగినది!"

"ఈ ద్వేషమునకు కారణము నీవేకాదా అగ్బర్!" అతని యంతరాత్మ యనినది.

"నేను కారణమా! నేనా కారణము" "ఔను నీవే కారణము. సలీమా సుల్తానా మురాదును కనినది మొదలు నీ ఆలోచన లెట్లు మారినవి అగ్బర్?"

"అబుల్ ఫజల్, బదాసీలు నిన్నెట్లు మహమ్మదీయ వనితకు పుట్టిన మురాద్ వైపు మొగ్గునట్లు మార్చినారు?"

"మురాద్ పై నీవు తీసికొనిన శ్రద్ధలో కొంచమైన సలీంపై చూపిన ఈ నాడిట్టిది సంభవించునా?"

"మిహిరున్నీసాను, అతడు ప్రాణసమానముగ ప్రేమించిన స్త్రీని వేరొకనికిచ్చి వివాహము జరిపించిన నీపై ద్వేషం గాక మరేమి కలుగును?"

"ఒకప్పుడాతని చంపించుటకుకూడ నీవు ప్రయత్నింపలేదా? డేనియల్ మరణించినందున గతిలేక కారాగారమందుంచినావు."

"అతడు బ్రతికియుండగనే అతని కుమారుడు ఖుస్రూకు సింహాసనము కట్టబెట్టు ప్రయత్నము చేయలేదా నీవు?"

"సలీం ద్వేషించునట్లొనర్చిన కారణములకై వెదకుకొనవలసిన పనియేమి అక్బర్."

"నీ తప్పులను గ్రహించి ఇప్పటికైన అతని పిలిపించి మాట్లాడు. సలీం నీతో రాజీకి రాగలడు" అనినది అంతరాత్మ.

తానెట్లు ఓడింపబడి నాట్లో జ్ఞప్తికి వచ్చినది అక్బరుకు.

అక్బరుతల్లి మరియం మకాని కుమారుని చూడవలెనని పిలిపించినది. అక్బరు తల్లికడ కరిగినాడు.

"అక్బర్! ఆ దైవమిచ్చిన బిడ్డపై నీకంత ద్వేషమెందులకయ్యా?" మకాని అడిగినది.

"అమ్మా! ఈ తిరుగు బాటేమి? యువరాజైన వాడు రాజునకు వ్యతిరేకముగా లేక రాజ్యములోనిదైన ఖజానాను కొల్లగొట్టి వాడి చేయునా? ఆ ధనముతో సైన్యము నెందులకు సమకూర్చును? ఇది సామంతుల కెంత స్వతంత్రత నిచ్చునో తెలియదా!"

"అక్బర్! నీ ప్రవర్తన అతనియెడ సక్రమముగా లేనప్పుడు అతడు చేయగలిగిన దేమి? వాడు పెద్దవాడు రాజ్యార్హత కలిగినవాడు. మీ అందరి చూపులు వానికి వ్యతిరేకముగా నున్నవి. రాజ్యపరిపాలనకు శక్తి చాలని తాగుబోతు మురాదు వైపు మీరు మొగ్గు చూపుచుండ సలీం చేయగలిగిన దేమి?"

"పెద్దవాడు మూర్ఖత్వముతో ప్రవర్తించిన చేయగలిగిన దేమమ్మా!" బిడ్డ మూర్ఖత్వమును పోగొట్టుట కిది సరియైన పద్ధతి కాదు అక్బర్. మొరటువాని హృదయమును సేద దీర్చి చల్లని మాటలతో మనవైపు త్రిప్పుకొనవలయు నేగాని బెదరించిన బెదరిపోవుటకు వాడును నీ రక్తములో భాగమే కదా!"

"నా రాజ్యాధికారమును ధిక్కరించిన తరువాత బిడ్డయైన మరి యెవ్వరైన ఒక్కటే. ఈ ధిక్కరణా జాడ్యమందరిలో ప్రాకిపోయిన ఈ మొగల్ సామ్రాజ్యమే పునాదులతో కదలిపోగలదు. ఇంట గెలువజాలని నేను ఇతరుల నెట్లదుపులో పెట్టుట. అందులకే సలీమునకు ఫర్మానా పంపినాను."

"ఏమని ఫర్మానా అక్బర్?"

"అతని శాంతి అభివృద్ధులు అతడు తిరిగి అలహాబాదు వచ్చుటపై ఆధారపడి యున్నవి. పాదుషా సేనపై కోరిక ప్రాణములపై ఆశ యుండిన అతడు వెంటనే పాదుషాను ఒంటరిగా సందర్శింపవలయు నని."

"బెదరింపుగాక మరేమి అక్బర్! దీనితో అతడు మరింత బెదరిపోయి ఇంకను వ్యతిరేకిగా మారగలడు."

"మారిన మారనీ! నా అధికారమునకు తిరస్కృతి నేను సహించను!"

"అక్బర్! ఇంత వయసు వచ్చినను నీలో అధికార దాహము తీరలేదు. నాకు తెలియును. నీ రెండవ కుమారుడు కాకానియల్ మరెంతో కాలము బ్రతుకడు. ఈ సామ్రాజ్యమంతయు ఏ మొనర్చుకొందువు?"

"నాకు విధేయుడైన ఖుస్రూకు ఇచ్చిపోయెదను!"

"అక్బర్?" పెద్దగా అరచినదామె "నీ బుద్ధి ఏమయి పోయింది. ఇంతటి అధికారపిపాస మానవునికి కూడదు. ఈ రాజ్యమును ఇతరులకు కట్టబెట్టుటకు సమర్థత కలవాడవా నీవు? భగవంతుని విశేషముయ్యా మనలను నడపునది. నీవు ఫర్మానా పంపినావా?"

"పంపుచున్నానమ్మా" బెదరుచు అనినాడు అక్బరు.

"దాన్ని మార్చి అతనిని క్షమించుటకు సిద్ధముగా నున్నట్లు, వచ్చి పాదుషా దర్శనము చేసికొనుమని వ్రాయించి పంపు అక్బర్."

అక్బరు మాట్లాడలేదు. అతడాలోచనా నిమగ్ను డయినాడు.

"అక్బర్! ఈ రాజ్యమును నీ తరువాత సలీము మాత్రమే ఏలును. ఇతర విధములగు ఆలోచనలు సలుపు వారు రాజద్రోహులు. మనలోని బలహీనతలను ఆధార మొనర్చుకొని వారు విజృంభించకుండునట్లు చూడు. ఇది కుటుంబవిషయమైన కలహము. తల్లిగా నా బాధ్యతను నిర్వ ర్తించినాను. నీవు వేయు ప్రతి తప్పటడుగు ఈ సామ్రాజ్య మునకు ఆపదను గొని తెచ్చును." మరియం మకాని ఊరు కొనినది. అక్బరు ఆలోచనలు దారి తెన్ను లేక విజృం భించినవి.

"సరియే ఫర్మానాను సవరించి పంపుదును." అని లేచి పోయినాడు అక్బరు. దక్కనులో సామ్రాజ్య స్థితి గతులను పరిపాలనను, నిర్వహించుచున్న అబులు ఫజుల్ ఒక్కడే అక్బరు చిన్ననాటిసలహాదారులలో మిగిలినవాడు.

అప్పటికే అక్బరుకు అత్యంత సన్నిహితులైన రాజా భగవాన్ దాసు, తోడర్ మల్ మరణించినారు. మతవిష యములలో అక్బరు సహచరుడు ప్రాణమిత్రుడైన షేక్ ముబారక్ మరణించినాడు. తర్వాత రెండు సంవత్సరము లలో షేక్ సైజీ కవిపండితుడగు అబులు ఫజుల్ తమ్ముడు మరణించినాడు. బీర్ బలు దుర్మరణము పాలైనాడు.

ఇక అక్బరు సన్నిహితులలో మిగిలినవారు అబుల్, మాన్‌సింగులు.

"అబుల్ ఫజుల్‌ను సమీపించాడు అక్బరు.

అతడు వచ్చి పాదుషా దర్శనమొనర్చుకొనినాడు.

"అబులుఫజుల్! మీ యువరాజావారివ్యవహారమును వినినావా!" అక్బరు అడిగినాడు.

"విన్నాను జహాపనా! ఇంతవరకు ఉపేక్షించుటే ఇంతగా సలీమ్ సాహసించుటకు కారణమైనది" అనినాడు అబుల్ ఫజలు.

"మరి కర్తవ్యము?" అక్బరు దీనముగా ప్రశ్నించినాడు.

"అతని దుండగములు నరికట్టుటే. మొదట అతని దుండుడుకు చర్యల నరికట్టనిది సామ్రాజ్యమున కల్లోలము తప్పదు జహాపనా!"

"మరి అతనితో ముందు మాటాడుట అవసరమేమో!" అక్బరు అనినాడు.

"అవసరము మాన్‌సింగు నంపిన ఆతడన్ని విషయములను తేల్చుకొని రాగలడు" ఫజులు అనినాడు.

"మాన్‌సింగుకు సలీముపై వ్యతిరేకతయున్నది. అతడీ కాయబారమునకు తగడు. ఇది మీరు స్వయంగా నిర్వర్తింపవలసిన కార్యము. సలీమునుచూచి అతనిలో పరివర్తనము వచ్చుటో లేక అతనినిబంధించి తెచ్చుటో చేయవలయును." అనినాడు అక్బరు.

అబుల్ ఫజుల్ తానా కార్యమునిర్వహింపగలనా యనుకొనినాడు. కాని పాదుషా ఆజ్ఞగా భావించి సలీమ్ వద్దకు పోయినాడు.

అబులు ఫజులు వెంట అయిదువందల సైన్యము మాత్రమే నడచినది.

సలీమ్ ఫజులును ఆనందముగ ఆహ్వానించినాడు. అబులు ఫజలు సైనికుల కానాడు విందుభోజనమే లభించినది.

"అక్బరు పాదుషా తమకోరకు ఎదురు చూచుచున్నారు యువరాజా" అబులు ఫజులు అన్నాడు చిరునవ్వుతో.

"కారాగారపు తాళపుచెవులు మాన్‌సింగు వద్ద నున్నవా? దాదాజీ" నవ్వుచునే సలీమ్ అడిగినాడు.

అబులు ఫజులు ఉలికిపడినాడు ఆ ప్రశ్నకు. సలీమ్ భావము తెట్లున్నదో ఊహించుకోగలిగినాడు అతడు.

"నీ తండ్రి ఉదారహృదయుడైన అక్బరు పాదుషా. నిన్ను కారాగృహమున నుంచునా యువరాజా!"

"దాదాజీ! సలీమిప్పుడు యువరాజు కాడు. మొగలు పాదుషా, ఇదిగో చూడుడు. నేను ముద్రించిన నాణెములు. కాని మీరు నన్ను సలీమని పిలువవచ్చును."

"లేదు యువరాజా! మీరు ఇంక మా మొగలు సామ్రాజ్యపు యువరాజులే. ఘనత వహించిన అక్బరు పాదుషా జీవించియుండునంతకాలము మరొక్కరు పాదుషా కాలేరు."

"మీరనుకున్న నాకు అవమానమేమి దాదాజీ నన్ను పాదుషా యనువారు. పెక్కురున్నారు?"

“మీ తండ్రితో కలిసి జీవించుటకు నీకు అభ్యంతర మేమి యువరాజా?”

“నాకచట స్థానములేదు. మీరందరు ముఖస్తుతి సొనర్చు నటుల ఆ మొగలు పాదుషా ఏదనినదానికి తాళం వేయుట తప్ప న్యాయాన్యాయములను పల్కువాడా సభలో లేడు. మరణము కోరిననే అక్కడకు రావలయును?”

“తన బిడ్డను చంపుకొను తండ్రి కలడా యువరాజా!”

“ఆకలి వేసిన పులి దన బిడ్డను తానే తినును. అధికార పిశాచము ఆవేశించినవానికి తన బిడ్డ, ఇతరుడను భేద భావము లేదు. తన అధికారమును ధిక్కరించిన కుమారుడై నను అక్బరు పాదుషా వదలడు.”

“నీకు క్షమాపణ తప్పక లభించును యువరాజా! మీ తండ్రి పితృహృదయము నిన్ను చూచుటకై వేగిర పడుచున్నది.”

“తండ్రిగా అక్బరుపై నాకు ప్రేమ యున్నది దాదాజీ! పాదుషాగా అతడొనర్చిన ఘాతుక కృత్యములు నా కసహ్యములు కలిగించినవి. ఖుస్రూను పాదుషాగా చేయుమనిన అతనిది పితృహృదయమా దాదాజీ! ఆ విషయములను బలపరచిన మీరందరు న్యాయ మార్గానురక్తులు. ఆయనకు సలహాదారులు, నే నెవ్వరిని నమ్మి రాజధానికి రావలయును?”

అబులు ఫజలు సమాధానముకొరకు వెదకికొను స్థితి కల్గినది.

"సామ్రాజ్యమునకు వారసుని నిర్ణయింపవలయును కదా" ఫజులు అనినాడు.

"పాదుషాకుగల హక్కు కొడుకునుండి బహిష్కరించు హక్కు పాదుషా కెక్కడిది! అదివారసత్వము"

"లేదు. పాదుషాయే నిర్ణయించును తనవారసుని"

"కాదు దాదాజీ! మొగలు సామ్రాజ్యమువిచ్ఛిన్నమగుటయే కొందరు కోరుచున్నారు. ఖుస్రూను బలపరచుచున్న మాన్‌సింగ్ కోరినదేమి? తండ్రి కొడుకుల పోరాటములో తాను స్వతంత్రుడగుట. సింహాసనమును ఛిన్నాభిన్నమొనర్చుట. దానిచుట్టు వేచిఉన్న ముసలి తోడేళ్ళు. ఈ తోడేళ్ళ నుండి సామ్రాజ్యసింహాసనమును దక్కించుకొనుటకు సలీము సమర్థుడే దాదాజీ!"

నిర్ద్వంద్వముగ పలికినాడు సలీమ్.

"నీవు రాజధానికి వచ్చి ప్రభువును క్షమాపణ కోరుట యవసరము యువరాజా! అంతకుముందు నీ కోరిక లేవయిన ఉన్నవా" "ప్రాణరక్షణమే నా కోరిక, నా అనుయాయుల రక్షణము నాకర్తవ్యము. ఇవి నా కోరికలు" సలీమ్ అనినాడు.

"నీ ప్రాణమునకు నేను హామీనీయగలను యువరాజా! కాని నీ అనుయాయులను మాత్రమే స్థితిలోను నీ తండ్రి క్షమించడు" అబులు ఫజులు అనినాడు.

"ప్రాణములకు తెగించి నా వెంటనుండిన వారిని నేను వదలుకుందునా దాదాజీ! నాపై నమ్మకమే వారినినా వెంటనుంచినది" అనినాడు.

"యువరాజా! ఇప్పుడు నీవు నా వెంటరానిచో నీకు పతనము తప్పదు. తప్పు క్షమించమని పాదుషా కాళ్ళపై పడుటే నీ కిప్పుడు మిగిలినది. పాదుషా స్వయముగా నీపై దండెత్తి వచ్చుటకు సిద్ధముగ నున్నాడు."

"భయములేదు దాదాజీ! నాకు కూడ సైన్యమున్నది ప్రాణము లీయగల సేనాను లున్నారు. నా తల్లివైపు రాజ పుత్రబలగమున్నది అన్నిటికన్న మిన్నగ నా తల్లి ఆశీ ర్వాద బలమున్నది. నా వద్ద ఇప్పుడు డెబ్బదివేల సైన్యము పదునయిదువందల గజము లున్నవని మీరు నమ్మకపో వచ్చును." సలీమ్ నవ్వుచు అనినాడు.

అబుల్ ఫజుల్ గుండెలున నిలిచిపోయినట్లయినది. ఇక నితడు లొంగివచ్చుట కల్లయనికొనినాడు.

"పాదుషాకు నీ సమాధానమేమి యువరాజా?"

"నా సైన్యముతో రాజధానీ నగరమునకు నేను వచ్చెదను. నా అనుయాయుల కెట్టిశిక్ష విధింపబడ కూడదు. నా సైన్యము ప్రభుత్వపు ఖర్చుపై నిలుపవలయును. ఇవి పాదుషావారంగీకరించిన నేను వచ్చుటకు అభ్యంతరము లేదు. దాదాజీ! ఒక్క విషయము. రాబోవు పాదుషాను ఎదుర్కొ నుటకు మీ సర్దారులలో ఎందరు విముఖులో మీరు రాజ ధానికరిగి లెక్క వేసికొనవచ్చును" సలీమ్ అనినాడు.

"యువరాజా! నీవు నిప్పుతో చెలగాట మాడుచు న్నావు. అక్బరు పాదుషాను ఎదిరించి జయించినవాడెవ్వడు ఇంతవరకు లేరు. నీకు పతనము తప్పదుయువరాజా!" అబుల్ ఫజులు అన్నాడు కోపంగా.

"కోపించకు దాదాజీ! కోపమనునది అందరకు ఒక్క-కే. నా నుండి మిహిరున్నీసాను వేరుచేసినవారిలో మీరు కూడా ఒకరు. ఆమెకు పెండ్లిచేసివేయుటకు మీరు పాటు పాను ప్రోత్సహించిన విషయము నాకు జ్ఞప్తియందున్నది. దాదాజీ! ఆనాడే అనుకొనినాను. నేడు నిర్ణయించుకొని నాను. మీ ఇరువురి మరణము నా చేతిలోననే యని ప్రతిన కూడ చేసినాను" స్థిరముగ సలీమనినాడు.

అబుల్ ఫజుల్‌నకు పాదములనుండి వణకు పుట్టుకొని వచ్చినది. అతడెట్లో నిలువ తొక్కి-కొనినాడు.

"సరియే యువరాజా! ఈ ముసలివాడెప్పుడో రాలి పోవును. ఎట్లయినను భయము లేదు, కాని తండ్రిపై మాత్రం క్షత్రియాయకుము" అబుల్ ఫజలు అన్నాడు.

"ఈ విషయములన్నియు పాదుషా వారికి తెల్పు దురా దాదాజీ!"

"ఏమి భయమా యువరాజా?"

"కాదు నాపై చెప్పుటకు తాము భయము చెందు దురేమో నని మాత్రమే."

"లేదు. పాదుషాకీ విషయములన్నియు మనవి చేసె దను" అనుచు లేచినాడు అబుల్ ఫజలు. అతనిని సకల మర్యా దలతో సాగనంపినాడు సలీమ్.

ఓ ౖచ రాకుమారుడు బీకసింగు సలీమునకు ముఖ్య అనుచరుడు. అక్బరుపై తిరుగబడిన రాజపుత్రులలో నొకడు.

తా నడిన విషయములన్నియు అగ్బరు విని తనమాట కట్టించుననియు, ప్రాణభయమున అబుల్ ఫజులు అతనిని తనకు వ్యతిరేకముగ ప్రోత్సహించుననియు వెరచి సలీమ్ మార్గమధ్యమున సరాయ్ వద్ద అబులు ఫజులును మరికొంత సేనను వెంటగొని హమ్మని అసద్ బేగ్ హెచ్చరించినాడు.

మృత్యు తాసన్నమయి రమ్మని పిలుచుచుండ మానవుడు హెచ్చరికలను తెక్కచేయునా? ఆతడట్లే ప్రయాణ మొనర్చినాడు. సరాయ్ దాటిన తర్వాత బీర్ సింగ్ తన సేనతో అతనిపై పడినాడు, అబుల్ ఫజులు కొలదిసేన కొంచెము ప్రతిఘటించి పారిపోయినది. బీర్ సింగు అనుచరు డొకడా వృద్ధ సరదారుని శిరస్సును ఖండించినాడు.

బీర్ సింగ్ అబులు ఫజులు శిరస్సును చంపినందులకు గురుతుగా సలీమ్‌నకు పంపినాడు. సంతసించిన సలీం బీర్ సింగునకు 'రాజా' యను బిరుదమిచ్చినాడు.

ఈ వార్త వినిన అగ్బరు చింతకు అంతమే లేదు. మూడు దినములాతడు భవనమునందుండి ఎవ్వరికిని ముఖము చూపలేదు.

సుల్తానా సలీమాబేగమ్ రెండవ కుమారుడు డానియల్ అధికముగ త్రాగి మరణించినాడు. ఇక అగ్బరునకు సలీమ్ తప్ప పుత్ర సంతతిలేదు.

సుల్తానా సలీమాబేగం, గుల్ బదన్ బేగం, మరియుం మకానీ అంతఃపురమండలి అధికారిణులు, తండ్రికుమారుల

మధ్య తగవుతీర్చుటకు ప్రయత్నించి సలీమును క్షమించుటకు అక్బరునే ఒప్పించినారు. సలీమాబేగం స్వయముగా సలీంను కొనివచ్చుటకు అలహాబాద్ వెళ్ళినది.

దుఃఖముతో తల్లి పాదాలకు చుట్టుకొనినాడు సలీమ్.

అతనిని కౌగలించుకుని దుఃఖించినది సుల్తానా.

"సలీం. నిన్ను కొనిపోవుటకు వచ్చానయ్యా!" సుల్తానాబేగం అనినది.

"ఎచ్చటకు మృత్యుమందిరానికా" సలీం అనినాడు.

"ఎంతమాట అనినావు సలీం? నేను నిన్ను మృత్యువుకడకు కొనిపోదునా సలీం? నీ తండ్రికడకు పోవుట మృత్యువుకడకు పోవుటా! సలీమా ఏడ్చుచుచూ యనినది.

"మృత్యుదేవత కొకప్పుడు కొంత కరుణగలదేమో కాని అక్బరు పాదుషాకు కరుణ యనునది లేదమ్మా. అతని అధికార దాహామునకు బిడ్డలు భార్యలుకూడ కన్పించరు"

"లేదు సలీం నిన్ను క్షమించుటకు పాదుషా వాగ్దానము చేసినారు" సలీమా యనినది.

"పాదుషా వాగ్దానము! అక్బరు పాదుషా నోటిమాట నీటిమూట ఒక్కటే దానికి విలువయే లేదు"

"కాదు సలీమ్ ఇది ముగ్గురు కలసి తీసికొనిన వాగ్దా

నము. ఈ వాగ్దానమాతను భంగపరచిన మేము ముగ్గురమచటనే ప్రాణత్యాగము చేతుమని తెల్పినాము"

"నేను అగ్బరు పాదుషా సన్నిధికి మాత్రము తాను. ఆతనిపై నా ద్వేషము నన్నేమిచేయించునో"

"అవి అన్నియు సమసిపోవలెసలీమ్! నీ వచ్చుటనుండి వచ్చిన కాని వృద్ధుడయిన తండ్రిగారి రాజ్యము నీవశము కాదు"

అదియు నిజమే యనిపించినది సలీమ్‌నకు.

సలీమ్ తన సైన్యముతో బయలుదేరి సుల్తాన్ బేగం వెంట ఆగ్రా నగరమునకు చేరినాడు.

మరియంమకాని సుల్తానాబేగం చెరియొక వైపున నుండి అగ్బరువద్దకు సలీమును కొనివచ్చినారు.

సలీమును చూడగనే పొంగివచ్చిన దుఃఖముతో క్రోధముకూడగా నమస్కరించినిలచిన సలీము చెంపలు వాయునట్లు కొట్టినాడు అగ్బరు.

రాయివలె మాటలేక మ్రాన్పడి నిలచినాడు సలీం.

"అగ్బర్" అరచినది మరియం మకాని.

"నీవు పశువవు నీ యంతటి కుమారునిపై చేయిచేసుకొనిన నీ పతనము సమీపించినది." కోపముతో రోజుచు వెడలిపోయినది అగ్బరు తల్లి. అగ్బరు ఆగినాడు. ఆగిన అగ్బరు సలీమును నిర్బంధమున నుంచుటకు ఆజ్ఞ యిచ్చి

నాడు. రాజా శాలివాహనుడు సలీమును నిర్బంధమునందుంచి నాడు.

సలీమా బేగమ్ అక్బరును పూర్తిగా నిందించినది.

తనవారందరును వ్యతిరేకమయినారు అక్బరునకు.

మూడు దివసముల తరువాత రాజా శాలివాహనుడు సలీమును నిర్బంధమునుండి విడిపించినాడు. శాలివాహను నితో కలసి పెక్కురు సేనాపతులను, సరదారులను కలిసి సలీమ్ ఆ రాత్రియేమాటాడి వారి అధికారములను హోదాలను పెంచు షరతుపై తనవైపునకు త్రిప్పుకొనినాడు. రాజా రామదాస్, ముర్తజాఖాన్‌లు సలీమునకు బాసటగా నిలచి నారు.

అధికారసాహసియైన రాజా బీర్‌సింగ్ సలీమ్ సైన్యమునకు నాయకత్వము వహించినాడు.

ఆగ్రానగరపు కోట వాకిండ్లు తెరువబడినవి. సలీం సైన్యములు మెల్లగా కోటలో ప్రవేశించి ముఖ్య ప్రదేశముల నాక్రమించినవి. అంతఃపురమున సలీమా బేగం ఆజ్ఞచే ప్రతిఘటనమే లేదు. సైన్యాధిపతులందరు నిమ్మకు నీరెత్తి నట్లూరకొనినారు, అక్బరుచక్రవర్తి అంతఃపుర సైన్యము కొద్దిగా ప్రతిఘటించినది. నాయకుడు చంపివేయబడినాడు. తన అంతఃపురమే అక్బరు పాదుషా కారాగారమయినది.

పరిస్థితులను గమనించి ప్రతిఘటించుటకు ప్రయత్నిం చిన మాన్ సింగు, ఖాన్ ఆజంలు బంధింపబడినారు.

ఆగ్రా పట్టణము సలీం వశమయినది. నిన్నటి మొగ లాయీ సార్వభౌముడు నేడు కారాగారవాసి, రక్తపాతము లేకుండగనే సింహాసనమును వశపరచుకొనినాడు సలీం.

మరునాటి ఉదయము అక్బరు పాదుషా తీవ్రరోగ గ్రస్తుడయినట్లు యువరాజు సలీం రాజ్యాధికారము స్వీక రించినట్లు ప్రకటింపబడినది.

# 14

"For eighty years, I have worshipped my God according to this religion. Why should I merely from fear of my life and without understanding it come into your way of worship." the stout hearted old man of eighty (Rajah Punan Mal) said.

Abul fhajal Akbarnama
Bevaridge II 72

Hemu's father (Rajah Puran Mal) captured. Not given option to convert himself to Islam and save his life.
Pirmohammad was not a man to whom such words would have any appeal.

విషపాత్ర.

లోన విషమున్నదని యెవ్వరికి తెలియును?

కుటిల హృదయమందలి పాపమువలె ఆ విషయమును గుర్తించుట అసంభవము.

మద్యముతో నిండిన లక్షల విలువచేయు పచ్చల పాత్ర పై విలువలెన్నియైననేమి! లోన హృదయము నిర్మలము కావలయును.

ఆ పాత్రను తొలుదొల్త విషముతో తాను నిండించినాడు.

ఆపచ్చలపాత్రను చేతనెత్తినాడు అక్బరు.

ఎంతచక్కని పనితనము.

కాని లోపల ప్రాణముల హరించు కాలకూటమున్నది.

హంతకుని చిరునవ్వు వంటిది పాత్ర.

తన హృదయమువంటి పచ్చలపాత్ర.

పాత్రలోని విషము తాను త్రాగవలయును.

అతని శరీరము గగుర్పొడిచినది. కన్నులు తిరిగినవి.

ఆపాత్రయందలి మద్యములో ఒకవ్యక్తి ఆకారము

ముడుతలుబడిన ముఖము. జ్యోతులవలె వెలుగుచున్న కన్నులు తెండిజరీకుంచెవంటి గడ్డము. ఎనుబదేడుల వృద్ధుడు ఆచల్లనిచూపులు మలయమారుతము వెదజల్లు చిరునవ్వు.

ఆ ఆకారము పల్కరించినది.

“అక్బర్! నేను గుర్తుకురాలేదా నీవు మొగలు పాదుషావు ముప్పదియేండ్లనాటి నన్ను గుర్తించలేదా? అక్బర్?

ఇదిగో నాచేతిలోని పచ్చలపాత్రి గుర్తుకు వచ్చినదా?"
అనుచు నవ్వినదా ఆకారము.

"రాజా పురాణమలు" అగ్బరనినాడు.

"అగ్బర్!" ఆ ఆకారము గంభీరముగా మారిపోయి
నది.

"ఇవి నీ అంతిమక్షణాలు. నీ చేతిలోని విషము నీకు
మృత్యువు. ఈవిషము త్రాగకున్న నేమనుకొనుచున్నావా?
నీకొరకు రాజా బీర్‌సింగు నల్గురు హంతకులతో ఈ భవ
నము బయట కాచుకొని యున్నాడు. అగ్బరు పాదుషా
సూర్యోదయమును చూడరాదని ఆజ్ఞ.

"పురాణమల్! నీవు నాకంటే అదృష్టవంతుడవి"
అన్నాడు అగ్బరు.

"అవును అగ్బర్. నేనొక మ్లేచ్ఛుని. మతపిశాచా
వేశము కలిగిన సామ్రాజ్యవాహకునిచేత విషమీయబడి
మరణించినాను. కాని అగ్బర్! కన్నకొడుకు. దైవవర ప్రసా
దియను కొమరుడే నీకు బహుమానముగ విషమంపినాడు.
ఇదెవ్వరిపాపఫలము అగ్బర్?

"పాపఫలముకాదు పురాణమల్ ఇది ఆనాటి నీ శాప
ఫలితము వచ్చుచున్నాను. నేనుకూడ నీకడకు,

విషపాత్రను దించినాడు అగ్బర్.

* * *

ఆనాడు ఆలోచనలు ముప్పుతిప్పలు వెనుకకు పోయి నవి.

"మీరు అప్రయోజకులు పీర్ మహమ్మద్! ఎనుబదేండ్ల ముసలి పీనుగును పట్టుకొనలేక తిరిగివచ్చిన మీరు అసమర్థులు. అసమర్థులకి సేనాధిపత్యము పనికిరాదు, ఎఱ్ఱవారిన కన్నులు ఆగ్రహాన్ని కక్కుచుండగా అన్నాడు అక్బర్

పీర్ మహమ్మద్ గడగడ వణకిపోయినాడు.

"అతణ్ణి చంపివేయుటకు ఆజ్ఞలేకపోయింది జహాపనా" వినయంగా పీర్ మహమ్మద్ అన్నాడు.

"చంపితే లాభమేమిటి? శారీరకంగా కాదు చావవలసింది మానసికంగా కాదు చావవలె మహమ్మదీయుడుగానే అతడు మరణించవలె పీర్! ఇది నీకు అప్పగించిన విషయాలు."

"మన్నించ అపకారశమీయండి జహాపనా! అతడు మతం మారి ముసల్మాను కావడమో లేక చిత్రవధ చేయబడడమో జరిపిస్తాను. అతడు అనినమాటలు నన్ను నరనరాన వేధిస్తున్నవి" అన్నాడు పీర్ మహమ్మద్.

"ఇప్పుడు అతణ్ణి నీవు పట్టగలవా! పీరు మహమ్మద్ నీకు తగిన పరాభవం జరిగింది. నీవు కనీసం ఆ హేమూ కుమార్తెను కొనివచ్చినా నిన్ను క్షమించేవాణ్ణి" అక్బరని

నాడు. పీర్ మహమ్మద్ తలవంచుకొన్నాడు. "షరాపుద్దీన్‌ను పిలిపించు—" షరాపుద్దీన్ లోపలకువచ్చి మొక్కాడు.

"మతవిషయాలలో నీ పట్టుదల మాకు తెలుసు". అనినాడు అక్బరు.

"ఆజ్ఞాపించండి జహాపనా! ప్రాణాలయినా యిచ్చి కార్యాన్ని నెరవేరుస్తాను" షరాపుద్దీన్ అన్నాడు.

"అల్వార్ కోటలో ఉన్నాడు హేమూ తండ్రి రాజ పురాన్‌మల్. అతడు ముస్లింకావలె. అతని మనుమరాలు మా జనానాలో చేరిపోవలె మమ్ము ప్రతిఘటించిన ఆ కాఫిర్ హేమూ ఆత్మ క్షోభించిపోవలె. ఆ ముసలివీనుగు మా జన్మాన్నే తూలనాడినాడు. సర్వసంపదలతో అతన్ని మాముందు మహమ్మదీయుడుగా హాజరుపెట్టు" అక్బరు ఆజ్ఞాపించాడు.

"చిత్తం" ఆజ్ఞ! తీసికొనివెళ్ళాడు షరాపుద్దీను.

పీరు మహమ్మద్ విచారంతో వెనుకకు వెళ్ళిపోయి నాడు.

o o o

"మహారాజావారి దర్శనాన్ని కోరుతున్నా రెవరో రాజపుత్రుడట. ఆ వృద్ధుడు తనపేరు చెప్పటంలేదు" ప్రతీహారి విన్నవించాడు రాజాముద్దేవు,

"ప్రవేశపెట్టు" ఆజ్ఞాపించాడు రాజా మార్తాండ్దేవు.

వృద్ధుడు లోపలకు ప్రవేశ పెట్టబడ్డాడు.

"మహారాజా! నేను వృద్ధుణ్ణి. మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను. ఈ వయసులో నా యీను హారాలను మృత్యు దేవత కాపాడి వుండయినాను, మీ మవద్దకు శరణార్థిగా వచ్చాను. తరిమే శత్రువులనుండి నన్ను రక్షించి ఆదరించండి. ఈ వృద్ధుడికి మిగిలిన ఈ కానుకను స్వీకరించు మహారాజా" అంటూ వృద్ధుడొక వజ్రాలహారాన్ని రాజా మార్తాండ్దేవుకు సమర్పించాడు.

మార్తాండ్దేవుని కన్నులు జిగేలుమన్నవి ఆ హారాన్ని పుచ్చుకొన్నాడు.

"తామెవరో తెలియజాలని నా అజ్ఞతను మన్నించండి. ఈ వజ్రపుహారమొక్కటే నా కోశాగారము వెలకు సరిపోవచ్చు ఇటువంటి కానుక నేనివ్వగలిగే దేముంది?" ఆశ్చర్యంతో అన్నాడు రాజామార్తాండ్దేవు.

"నాకు కావలసింది ప్రశాంతజీవితం నా ధర్మాన్ని నేననుసరించి హిందువుగానే మరణించడం. నా మతాన్ని మార్చి నన్ను ముసల్మానుగా మార్చడానికే నన్ను వేటాడుతున్నారు నా శత్రువులు."

"శత్రువు అందరు హిందువులకూ శత్రువే తమశత్రువెవ్వారు?"

"మొగలు పాదుషానని విర్రవీగుచూ సామ్రాజ్య దాహంతో కొట్టుకపోతూ నాకుమారుని పొట్టనబెట్టుకొనిన అగ్బరు."

"ఎవరు తమ కుమారులు?" అనుమానంగా అడిగాడు మహారాజా.

"రాజా విక్రమాదిత్య బిరుదుతో ఢిల్లీ సింహాసన మధిష్టించిన హేమూ నా కుమారుడు" అతని కన్నులవెంట నీరుబికినది.

"తాము రాజా పురాణములు" అంటూనే సింహాసనంనుంచి లేచి రాజా మాల్దెవు నమస్కరించాడు. సభ లేచి నిలువబడింది గౌరవసూచకంగా.

"నా హేమూ మరణించిన నాటినుండి ఆత్మహత్య మహాపాతకమని జీవితాన్ని గడుపుతున్నాను. ఈమె హేమూ కుమార్తె, నా వంశానికి మిగిలినదీ ఒక్క మొక్కయే. ఈమె నొకని కప్పగించిన తర్వాత నా ప్రాణమేమయినా బాధలేదు మహారాజా! నన్ను మహమ్మదీయు నొనర్చి తన యెదుటకు తెమ్మని పీరు మహమ్మద్‌ను ఆజ్ఞాపించాడా మ్లేచ్ఛుడు. నా మనుమరాలాతని జనానాలో చేరిపోనట. పీర్ మహమ్మద్ ఆల్వార్‌పై దాడిచేయగా తప్పించుకొని మీ ఆశ్రయమునకు చేరినాను" అతని కన్నీరు గడ్డమును తడిపినయ్.

"ఈ వయసులోని మిమ్ము వెంటాడుట యెందులకో!" యువరాజు చంద్రసేనుడనినాడు.

"నేను ముస్లిమునయిననాడు నా హేమూ ఆత్మ క్షోభించునట ఈ మతోన్మాదం వారి రక్తంలో జీర్ణించింది. హిందువుల నాశనమే వారికోరిక మతసహనపు ముసుగులో ఆ మేకవన్నెపులి చేసే తుచ్ఛకార్యాలు నోటపలుకరానివి. సౌందర్యవతులయిన రాజపుత్రిలోకంలోని సౌందర్యవతులయిన రాజపుత్రికలందరు అతని కామాన్ని తీర్చుకొనడానికి అతనికివ్వడు కావలె. కామక్రోధాలు జీర్ణించిన రక్తం అతనిలో ప్రవహిస్తున్నది. నేను ముస్లిముగా మారితేగాని నా మనుమరాలు అతనికి వశముకాదు" అన్నాడు పురాణమల్.

"యుద్ధములో ఆ బాణమే హేమూ కంటికి తగులకుంటే ఈ అగ్బరు ఈపాటికి యమలోకానికి పాతకాపై ఉండేవాడు" చంద్రసేనుడనినాడు.

"మన దేశము మ్లేచ్ఛుల పాలయ్యే స్థితిలో మన మతాన్ని మన దైవతాలను కాపాడటం కొఱకు నా హేమూను ప్రోత్సాహపరచాను. కాని భగవన్నిర్ణయం వేరుగా ఉన్నది" దుఃఖంతో మాట్లాడలేక ఊరుకున్నాడు పురాణమల్.

"దుఃఖపడకండి రాజాసాహేబ్-తమరు వృద్ధులు,

తమ జీవిత శేషం జోధ్‌పూరులో గడపండి. ఏ అగ్బరు ఎత్తి వచ్చినా మీకు భయంలేదు. తమరు అంగీకరిస్తే మీతో సంబంధం కలుపుతాను. తమ మనుమరాలిని నా కుమారుడు చంద్రసేనునికి వివాహం చేస్తాను" అన్నాడు రాజా మాల్దేవు,

"మహారాజా! మీ ఋణాన్ని తీర్చలేను. ఈ బాలిక వెంట ఈమె తండ్రి సంపదలో అగ్బరుకు చిక్కగా మిగిలినది నా వెంట తెచ్చాను. దానినిస్వీకరించి ఈమెను కోడలుగా స్వీకరించండి" అన్నాడు పురాణమల్.

"అప్పుడు వీరిబాధ్యతను మనం స్వీకరించి అగ్బరుకు జవాబు చెప్పడానికి అవకాశం కలుగుతుంది" అంటూ ఆ వివాహానికి తన అంగీకారాన్ని తెల్పాడు చంద్రసేన్.

పురాణమల్ వెనుకనున్న యువకుని ముఖముసిగ్గుతో క్రిందికి వాలిపోయింది.

ఆమెను ఆనందంతో అంతఃపురానికి పంపాడు రాజా మాల్దేవు.

ఢిల్లీ అంతఃపురానికి సంబంధించిన అనేక సంపదలతో ఆమెను భార్యగా స్వీకరించాడు చంద్రసేన్.

తనజీవితాన్ని ప్రశాంతంగా ఆ మనుమరాలిని చూచుకుంటూ గడుపుతున్నాడు పురాణమల్.

* * *

పురాణమల్ జోధ్‌పూర్‌లో ఆశ్రయం పొందడం, హెమూ కుమార్తె వివాహం అక్బరును ఆగ్రహావిష్టుణ్ణి చేసినవి. కాని అతడు సమయం కొరకు చూచాడు. అతడు జోధ్‌పూరుపై యుద్ధాన్ని ప్రకటించడానికి వెనుకాడాడు. కాని తన శత్రుశేషాన్ని ఏవిధంగానయినా తుదముట్టించడానికి ప్రయత్నాలు చేశాడు. జోధ్‌పూరు అంతఃపురంలో సైన్యంలో మొగలు గూఢచారులు చేరిపోయినారు,

రెండు సంవత్సరములు గడచిపోయినవి. జీవితపు చరమదినములలో కాశీ విశ్వనాథుని సేవింపవలయునని పురాణమల్‌కు కోరిక కల్గినది.

రాజా మాల్దేవుతో తన అభిప్రాయమును వెలిబుచ్చినాడు. ఈ సమయమున కోటనుండి బయలుదేరుట మంచిది కాదనినాడు రాజా మాల్దేవు.

తన జీవితమేమయినా ఆ విశ్వనాథునొక్క పర్యాయము దర్శించుకొనుట తన చివరికోరికయని రాజా పురాణమల్ రహస్యముగ కాశీకి బయలుదేరినాడు.

సమయముకొరకు వేచియున్న గూఢచారులు అక్బరునకు వార్త నందించినారు.

అవమానితుడయిన పీర్ మహమ్మద్ పురాణమల్ తోవ కాచినాడు

అక్బరు అనుజ్ఞతో షరాఫుద్దీన్ పురాణమల్‌నుపట్టు కొనుటకు సైన్యముతో సాగినాడు.

రెండు మూడు మజిలీలు పూర్తియై జోధ్‌పూర్ రాజ్యపు ఎల్లలు దాటగనే పీర్ మహమ్మద్ పురాణమల్ బృందముపై బడినాడు. అతని వెంట నున్న కొలది పరిజనులు మరణించగా పురాణ మల్ బంధింపబడినాడు.

తన అవమానానికి పరిహారంగా పురాణమల్‌ను అక్బరు సమ్ముఖంలో అప్పగించినాడు పీర్ మహమ్మద్.

సంతోషించిన అక్బర్ అతన్ని జాగీర్ దారుగా నియమించాడు,

శత్రువృద్ధు రాజా పురాణమల్ ఆ సభలో హాజరు పెట్టబడ్డాడు,

"అల్లాహో అక్బర" పీర్ మహమ్మద్ పలికాడు.

ఆ శబ్దానికి ప్రతిధ్వనించింది సభ.

"మహమ్మద్ జాన్ అతని సంకెళ్ళు వదిలించు" అక్బరు ఆజ్ఞాపించాడు.

సంకెలలనుంచి విడివడ్డాడు పురాణమల్.

"పురాణమల్! మీరు మా శత్రువర్గంలోనివారు. శత్రుశేషాన్ని ఉంచరాదని మిమ్ము పట్టి తెప్పించాము. కాని మీకు మరొక అవకాశాన్నిస్తున్నాము అదిగో ఆ పానపాత్ర

అది పచ్చలతో నిర్మింపబడింది. అది మీా హోదాకుతగినది. దానిలో విషమున్నది అదిగో పవిత్ర(—నే పవిత్ర) గ్రంథమున్నది. అదిఖురాన్ ఇవి మీా పట్టుదలకు ఫలితంగా మీాకు అనుగ్రహించబడినవి. గ్రహించండి రాజాసాహెబ్! బ్రతికి ఉండవలెనంటే ఖురాన్ లేకపోతే పచ్చలపాత్ర. నాకేదైనా యిష్టమే." వెకిలినవ్వు నవ్వాడు అగ్బరు. అది క్రౌర్యపు చాల నవ్వు. మానవ హంతకుడు చింగిజ్ ఖాన్ నవ్విన నవ్వు,

"అగ్బర్! దొంగవలె పొంచినన్ను పట్టుకున్నావు. కుటిలమైన నీ విజయాలకు పొంగిపోకు నీ మత దురహంకారానికి రోసి సంఘటితమౌతున్న శక్తి సన్నూ నీ సామ్రాజ్య దాహాన్ని నిర్మూలించక మానదు. విషాన్ని చూపి నన్ను భయపెట్టడం నీ అవివేకానికి నిదర్శనం" గంభీరంగా పలికాడు పురాణమల్.

"కాఫిర్! మాటలతో పనిలేదు. చిత్రవధ చేయకుండ నిన్ను కరుణించాము. వెంటనే ఏదో ఒకటి నిర్ణయించుకో."

"అగ్బర్! నీ మత సాహసానికి ఇది మంచి నిదర్శనము నేనువృద్ధుణ్ణి నేటివరకూ నా మార్గంలో జీవించాను. నా మతాన్ని ప్రేమించాను.

"నేను స్వచ్ఛమైన భారతీయుణ్ణి హిందువును ఇప్పటికి తుచ్ఛమైన ప్రాణానికి వెరచి నీ మతాన్ని స్వీకరించవలసిన

గతి నాకు లేదు." అంటూ ఆ విషపాత్రను చేతికి తీసికొన్నాడు రాజా పురాణమల్.

"అక్బరు నీవు విషపాత్రవంటి వాడవు పై పాత్ర విలువ కల్గినది. లోనున్నది కాలకూటము. నీలో జీర్ణించి పైకి కన్పించని విషమీ విషము ఒక్క ప్రాణిని చంపగలదు. నీలోని విషము ఎందరి మారణహోమమునకు కారణ మగునో!

"అక్బరు నీవు గోముఖవ్యాఘ్రమవు హైందవ రక్తము నరనరాన ప్రవహించే ఎవ్వడూ తన మతాన్ని వదులుటకు ఒప్పుకోడు. నీ విచ్చే ఈ విషం నన్నొకడినే చంపుతుంది. ఈహత్య సర్వరాజపుత్రలోకాన్ని భగ్గునమండించి నీ రాజ్యానికి విషంగా పరిణమిస్తుంది. నీకు కావలసింది రాజ్యం, ధనం, స్త్రీలు, నీలో మానవత లేదు అక్బరు. నీవు పిశాచానివి. ఇదిగో నా ఆత్మ నీ సర్వనాశనాన్ని చూచి తృప్తి చెందుతుంది." అంటూ పాత్రలోని విషాన్ని ఒక్క గుక్కలో త్రాగివైచాడు ఆ వృద్ధుడు పురాణమలు.

అచ్చటి ప్రతి రాజపుత్రుడు ఆ గరళం తమ గొంతు వెంటదిగినంత బాధను చెందారు.

"అక్బరు!" పెద్దగా అరిచాడు పురాణమలు ఆ శబ్దా

నికి అగ్బరు ఉలికిపడ్డాడు. సభ నొక కుదుపు కుదుపింది గుండెలను చీల్చుకొని వచ్చిన ఆ కేక.

"విషమిచ్చావు అగ్బరు నాకు, ఒకనాడు నీ మరణం కూడా ఆ విషం వల్లనే జరుగుతుంది. నేను శతవృద్ధును నేనింత వరకు అసత్యమాడలేదు. నా వాక్కు వ్యర్థం కాదు. అగ్బరు! దేశం కొరకు పోరాడాను. పుత్రుణ్ని బలిచేశాను మతం కొరకు పోరాడి ప్రాణాలను బలిపెట్టాను. దేశం పోయినా, చివరకు ప్రాణం పోయినా నా ధర్మాన్ని నా దైవాన్ని విడువలేదు. వస్తాను అగ్బరు, నీకుకూడ ఈ దుర్గతి కల్గిన నాడు నన్ను జ్ఞప్తికి తెచ్చుకో" అతని స్వరం క్షీణించింది.

"జై భవాని - దుర్గా" అతని పెదవులు వణికినయ్.

ముఖం వల్లబడి క్రిందపడిపోయినాడా వృద్ధుడు. అతని ప్రాణజ్యోతి ఈ శరీరాన్ని వదలి పరమాత్మ సాన్నిధ్యానికి చేరిపోయినది. స్వర్గంలో తనకుమారుణ్ని అప్యాయంగా ఆలింగనంచేసి కొనినాడా వృద్ధుడు.

ఈ క్రూరమైన హత్యకు సర్వరాజపుత్రలోకము ఆగ్రహోదగ్రమైనది.

అదే పచ్చలపాత్ర - అగ్బరు చేతిలోని విషపాత్ర ఆచేయి గడగడ వణికింది.

ఆ విషంలో పురాణమలు ఆకారం పకపకనవ్వింది.

ఆ నవ్వు అగ్బరు హృదయాన్ని శూలంతో పొడిచి నట్లున్నది.

'ఆలోచిస్తున్నావా అగ్బరు, అది విషమని భయమా అంతకన్న భయంకరమైనది నీకుమారుని ప్రేమ. అగ్బరు నీలో లోపించిన మానవత్వమే నీకుమారు నీస్థితికి తెచ్చింది. నీ పాపాలకి ఫలితం భయపడకు తాగు. అది తాగనినాడు నీకు దారుణమరణం తప్పదు తాగు.'

"తప్పదా నాకు!" అక్బరు శరీరం చెమటలతో తడిసి పోయింది.

"తప్పదు అగ్బరు. ఇది తాగిన తర్వాత నీవు నీ కుమారుని సానుభూతిని పొందుతావు తాగు అక్బరు. ఇది నీ మానసిక దుఃఖాలను తీర్చే అమృతము"

"అగ్బరు ఎందరి ప్రాణాలు నీకొరకు కసాయికత్తికి బలియైపోయినవో! చిత్తూరుకోటను ఆక్రమించినప్పుడు నీ వొనర్చిన సాముహిక హత్యలెన్ని? ఎన్నివేలమంది అమాయకులా నాడు బలియైనారు. ఎందరి మంగళసూత్రాలు తెగినవి! ఏడున్నరమణుగుల బరువుగల మంగళసూత్రము లానాడు ఒక్కరేవున తెగినవే! నీ పాపమునకు నిష్కృతి యేమి? ఎందరు తల్లులానాడు నిన్ను శపించినారో! ఇందరి

మరణమునకు ఘోరదుఃఖమునకు కారణభూతుడైన నీవు నీ సామ్రాజ్యదాహము, నీ కామ పిపాస, నీ దురాశలతో జీవింపగోరుచున్నావా? ఛీ మరణమనిన ఇప్పుడు భయముగ నున్నదా?"

'నీ పుత్రుడు నీకు శత్రువు. నీభార్య. నిన్ను రక్షించిన బైరాంనుచంపి కట్టుకొనిన అతనిభార్య సలీమా, దేశద్రోహియై నిన్ను జేరిన మానసింగు, నీ సైన్యము, నీ సామంతులు అందరు నీకిప్పుడు శత్రువులే. నీవు ఏకాకివి. నీవొనర్చిన పాపపుణ్యములే నీకుతోడు. ఈ లోకమున నీకిక తావు లేదు అక్బరు. అదిగో నీ బహుమతి. త్రాగు, ఆ విషాన్ని త్రాగు.అది నీ పుత్రుని ప్రేమరసము. త్రాగు అక్బర్,అదుగో నిన్ను ముక్కలుగా నరికివేయును రాజాబీర్‌సింగ్ త్రాగు అక్బర్ త్రాగు."

వణకిపోయెడి చేతిలో ఆ పాత్రలోని విషము త్రాగివైచినాడు అక్బర్.

అతని శరీరం తూలినట్లైనది.

రాజా బీర్‌సింగు తలుపుతట్టాడు.

అక్బరు వెళ్ళి తలుపు తెరచాడు.

"బీర్‌సింగ్ నీవు వెళ్ళి సలీమ్‌ను పిలుచుకొనిరా! ఎవరినీ ప్రార్థించని అక్బరు నిన్ను ప్రార్థిస్తున్నాడు. వెళ్ళు బీర్‌సింగ్! చివరికోరికగా చెప్పి సలీమ్‌ను పిలుచుకొనిరా!"

అతడు కన్నులుమూసి ప్రక్కపై ఒరిగాడు.

మరల అదేనవ్వు-మగతలో వినిపించింది అక్బరుకు.

"పురాణమల్! నీది సత్యమైన వాక్కు ఏ రాజ్యం కొరకు నీకు విషమిచ్చానో అదేరాజ్యం కొరకు నా కొడుకే నాకు విషమిచ్చాడు. నీవే జయించావు. నవ్వుతున్నావా! ఈ పతిత ద్వేషిని పరిహసించు"

అప్పుడే లోనికివచ్చాడు సలీమ్.

విషం త్రాగిన అక్బర్ కన్నులు తెరచాడు.

"అదిగో మరలానవ్వు పురాణమల్ నవ్వుకు నీ నవ్వు నన్ను ఈ విషం కన్నా తీవ్రంగా దహించివేస్తున్నది.

"సలీమ్-సలీమ్" ఆ పితృహృదయం మూల్గింది. సలీమ్ దగ్గరకు వచ్చాడు.

"జహాపనా!" అన్నాడు దుఃఖంతో "సలీమ్! వచ్చావా సలీమ్! నీ కోరిక తీర్చాను షేకు బాబా! ఇదిగో పచ్చల పాత్ర, దీనితోనే ప్రతిదినం నీవు మద్యం త్రాగు షేకు బాబా! నేను ప్రతిదినం నీకు జ్ఞప్తికి వస్తాను. ఇదిగో రాజ ముద్రిక సలీం నీ తండ్రి నీకు తండ్రి ఇక శాంతంగా మరణిస్తాడు"

సలీమ్‌కు నిజంగా దుఃఖం వచ్చింది.

"దుఃఖిస్తున్నావా సలీమ్. నీవు నిజంగానే దుఃఖిస్తున్నావా మరణించే నీ తండ్రి కొరకు ?"

"షేకు బాబా! ఈ విషమిచ్చే ఆనవాయితీ మన వంశంలో లేకుండా ఇక రాకుండ చూడు" సలీం హృదయం చివుకుమన్నది.

"మాన్‌సింగ్ దేశద్రోహి-రాజద్రోహికూడ"

అతను కన్నులు మూసినాడు.

"ఎవరు! జియూరాణి! నేను నీ వెంటనే, ఆగు జియూ"

"ఓ బైరాం, నవ్వుతున్నావా ?"

"రాణాప్రతాప్! ఇదిగో నీ వెంట వస్తాను.నీవు తగిన జోదు."

"అదిగో మరల నవ్వకు పురాణమల్."

"ఇప్పుడు నాలో ద్వేషంలేదు. మీ శంకరుణ్ణి మా అల్లాను కూడ నీలో చూస్తున్నాను. పురాణమల్."

అతని రెండుచేతులు పైకిలేచి ఎవరికో నమస్కరించి వాలిపోయినవి.

ఆ మొగలు పాదుషా అంతిమ క్షణాలు అంతమైనవి. అతని ప్రాణము అనంతవాయు పథంలో కలిసింది.

అతని పాపపుణ్యాల ఫలితాన్ని అనుభవించడానికి ఆత్మ అనేది ఉంటే సిద్ధపడింది.

[వరా. మూడువంతులు భారతదేశాన్ని ఏకచ్ఛత్రంగా పాలించిపరమత సహనంతో దీన్ ఇలాహీమతాన్ని స్థాపించి ప్రవక్తగా పేరంది చరిత్ర ప్రసిద్ధినందిన అక్బరు చక్రవర్తి ధన్యజీవి అంటారు కొందరు.



మత దురహంకారంలో కామపిపాసతో ఎందరో హిందూ స్త్రీల చెరచి సామ్రాజ్యదాహంతో కుటిలంగా ఎన్నో రాజ్యాలను కబళించి, ఎందరో అమాయకులను హత్యలు చేసిన అక్బరు పైన పాలతో మెరిసే విషకుంభం వంటివాడంటారు కొందరు_



ఏదిసత్యం ? ఏదసత్యం?

చరిత్రను నిష్పాక్షికంగా మధిస్తే తెలుస్తుంది!)



—: సమాప్తం :—

